# అస్పష్ట ప్రతిబింబాలు

## తెలుగులో స్త్రీల పత్రికలు
## ఒక పరిశీలన
## (1883–1947)

డి. పద్మావతి

హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం వారి
ఎం. ఫిల్. డిగ్రీ పొందిన పరిశోధన వ్యాసం

aspaSTa pratibimbaalu - teluguloo striila patrikalu-
oka parisiilana, M. Phil dissertation
by D. Padmavati



మొదటి ముద్రణ : ఏప్రిల్ 1989

ప్రతులు : వెయ్యి

వెల : రూ. 25-00

ప్రతులకు : 1. రోహిణీ విహార్,
బచ్చుపేట,
మచిలీపట్నం 521 001

2. డి. ఎ. పి. శాస్త్రి
బి-956, ఎన్.జి.ఓ. కాలనీ
వనస్థలీపురం,
హైదరాబాదు.

ఈ పుస్తక ప్రచురణకు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయం చేసింది-కృతజ్ఞతలు.

ముద్రణ : చంద్రశేఖర ప్రింటింగ్ వర్క్స్, భోలక్‌పూర్, సికింద్రాబాదు.

# ముందుమాటగా నామాట

ఒక అంధకార యుగంలోంచి స్త్రీ జాతి అప్పుడప్పుడే ఉషోదయం వైపు ఆశగా కనులు విప్పార్చుకొని చూస్తోన్న సంధియుగం, శ్రీమతి పద్మావతి (ఎం.ఫిల్. చేసే నాటికి కుమారి పద్మావతే) తన పరిశోధనకు తీసుకున్న కాలం. అక్షరాస్యతే తక్కువగా వున్న హిందూ సమాజంలో స్త్రీ విద్య, మరింత స్వల్పాతిస్వల్పంగా ఉండేదని వేరుగా చెప్పనక్కర్లేదు. ఆ కాలంలో వెలువడిన పత్రికలను వేళ్ళ మీద లెక్కించుకోవచ్చు అయితే పండిత రాజా రామమోహన్‌రాయ్, వంటి సంస్కరణవాదుల కారణంగా బెంగాల్‌లో వెల్లువలా వచ్చిపడిన సామాజిక సంస్కరణ-ముఖ్యంగా మహిళాభ్యుదయ సంస్కరణలు తెలుగుదేశానికీ వ్యాపించాయి వీరేశలింగం వంటి విద్యావంతులు ఆ సంస్కరణను చేపట్టి ఇటు సాహితీ రంగంలోనూ, అటు సామాజిక సంస్కరణల్లోనూ, స్త్రీ జాతిని అన్నిరకాలుగాను ప్రగతి మార్గంలో నడిపించటానికి సకల ప్రయత్నాలు చేశారు. ఆ ప్రయత్నంలో ఒక ప్రధాన భాగమైన స్త్రీల పత్రికలు ఈమె పరిశోధనాంశం

పత్రికల ప్రారంభ దశ నుంచి ఆయా దశలలో వచ్చిన పరిణామ క్రమాన్ని విశ్లేషిస్తూ— సామాజిక రంగంలో స్త్రీల స్థితిగతులలో వచ్చిన మార్పులు పత్రికా రంగంలో ప్రత్యేకంగా ప్రతిఫలించిన తీరు నిర్దేశిస్తూ— సమాజంలో స్త్రీల పురోగమనానికి పత్రికా ప్రపంచం ఏయే రకాలుగా దోహదకారి కాగలిగిందో నిరూపించే పరిశోధన వ్యాసం రచించింది పద్మావతి. ఈ పరిశోధన వ్యాసం విమర్శకుల మన్ననలందుకోగలదని నా సంపూర్ణ విశ్వాసం. పద్మావతికి ఆశీస్సులతో—

—సి. ఆనందారామం

# పుస్తకం గురించి మరోమాట

పందొమ్మిదో శతాబ్దంలో భారతీయ సమాజం ముఖ్యమైన మార్పులకు లోనయింది. ఆధునిక యుగంలో భారతదేశ చరిత్రకు సంబంధించి 19వ శతాబ్దం ఆయువుపట్టు. అంగ్లేయుల వలస పాలన మొగ్గతొడిగి, మూడు పూవులుగా, ఆరు కాయలుగా విస్తరించింది ఈ కాలంలోనే! కొత్త భూసంబంధాలను ప్రవేశ పెట్టి, వ్యవసాయ రంగంలో విప్లవాత్మకమని చెప్పదగిన మార్పులు తెచ్చి, భూమిపై ప్రైవేట్ యాజమాన్యాన్ని కలిగించారు. వ్యవసాయ రంగం వ్యాపారీకరణకు గురై, తిండిగింజల కరువు ఏర్పడి, దేశం నలుమూలల్లో కరువులు వచ్చాయి. వ్యవసాయం, గ్రామీణ చేతి పరిశ్రమలు, పడుగు పేకల్లా పెనవేసుకుపోయి, పూర్తిగా కాకున్నా, కొంతవరకు స్వయం సమృద్ధి పొందిన గ్రామీణ సమాజం, విదేశీ వస్తువుల దిగుమతితో, ఛిన్నా, భిన్నమైంది. భారతీయ పరిశ్రమలు దెబ్బతిని, deindustrialisation కి దారితీసింది. ఈ పరిస్థితుల్లోనే గ్రామీణ నిరుద్యోగం ఈ దేశంలో తలెత్తింది. ఆ విధంగానే, షావుకార్ల పెత్తనం పెరిగి, గ్రామీణ రుణ భారం తడిసి మోపెడైంది. అంటే, మధ్యయుగాల నాటి సమాజాన్ని ఆంగ్లేయులు ధ్వంసం చేశారు. ఈ ధ్వంస రచన చారిత్రకంగా ఎంతో అవసరమైనదిగా, భారతీయ సమాజం విధిగా పొంది తీరాల్సిన మార్పుకు దోహదం చేసే నాందీవాచకంగా కొందరు ఆర్థిక, సామాజిక వేత్తలు అభిప్రాయపడ్డారు. అయితే ఈ మార్పు సమాజంలో బాధకు, దుఃఖానికీ, ఎంత కడుపు కోతకూ కారణమయిందో, ఎన్ని లక్షల మంది ప్రజలు బలయ్యారో తలుచుకొంటేనే దారుణంగా వుంటుంది.

వలస పాలకులు, ఆర్థిక సంస్కరణలతో పాటుగా విద్యారంగంలో గణనీయమైన మార్పులు ప్రవేశపెట్టారు. కొత్త పరిపాలనా వ్యవస్థకు అనుగుణంగానే విద్య రూపొందించబడింది. చట్టాలూ, న్యాయస్థానాలూ వెలిశాయి, మొత్తంగానే, భారతీయ సమాజపు పునాదుల్లోనే పట్లుసడలాయి. దీనికి తగినట్టుగా వుపరితలంలో రాదగ్గ మార్పులు చోటుచేసుకొన్నాయి రాజకీయంగా, ఆర్థికంగా దేశం సమైక్యతను సాధించింది. సమాజంలో కొత్త సాంఘిక వర్గాలు (new social classes) తలెత్తాయి. ఈ వర్గాల ప్రజలు భారతదేశం

మొత్తంగా విస్తరించుకొన్నారు. వీరి మధ్య ఎల్లలు, అడ్డుగోడలు లేక సామాజిక చలనతకు దోహదం చేశారు. వీరిలో ప్రధానంగా చెప్పుకోవాల్సింది విద్యాధిక మధ్య తరగతి వర్గం. సమాజంలో సంస్కరణలకు, సమాజాన్ని పట్టి పీడిస్తున్న మత మౌఢ్యాలకు, సాంఘిక దురాచారాలకు స్వస్తి చెప్పాలనీ, మానవత్వం ప్రాతిపదికగా, హేతువాదచింతననూ, శాస్త్రీయ దృక్పథాన్నీ పెంపొందించాలనీ ఆశించారు. మత, సాంఘిక ఉద్యమాలను నిర్మించారు. సూత్రప్రాయంగానైనా వలస పాలనలో ఆర్థిక దోపిడిని గ్రహించారు. నిరసించారు. రాజకీయంగా, వలస పాలనను వ్యతిరేకించక పోయినా, రాజ్యాంగ బద్ధమైన ఉద్యమాలకు, పోరాటాలకు శ్రీకారం చుట్టారు. రానున్న ప్రజల రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ఉద్యమాలకు వేగుచుక్కలై నిలిచారు. అప్పటి చారిత్రక దశలో ఇది నిస్సంకోచంగా ప్రగతి పూర్వకమైన పరిణామమే !

సంస్కరణోద్యమాలకి సమాజం కేంద్రం కాగా, స్త్రీ కేంద్ర బిందువైంది. సాంఘిక సమానత్వం ఆశించి, సమాజంలో స్త్రీకి అనాదిగా జరుగుతున్న అన్యాయాన్ని, అక్రమాన్ని అరికట్టాలని ఆశించారు. విద్యాపరంగా, వివాహపరంగా, ఆర్థికంగా దోపిడికి గురయినవారి కంటె, అత్యంత దయనీయంగా, స్త్రీ స్థితిగతులు వుండడం గమనించి, సామాజికాభివృద్ధికి స్త్రీ ఎదుగుదల, విముక్తి అవసరమని గుర్తించారు. అందుకే సంస్కరణోద్యమాలు అనేకానేక ఇతర అంశాల్ని సంస్కరించాలనుకొన్నా, స్త్రీ జన సంస్కరణ వారి ప్రధాన ధ్యేయమైంది. దీన్ని విశాలమైన సాంస్కృతికోద్యమంలో అంతర్భాగంగా మనం గుర్తించాలి. కొత్త సాహిత్య రూపాలు, కళారూపాలు, భాషా సంస్కరణ, జర్నలిజం, సామాజిక చైతన్యం ద్వారా రాజకీయ చైతన్యానికి దోహదం చేసిన ఎన్నో వైజ్ఞానిక, సాంస్కృతిక, సంస్థలు ఏర్పడ్డాయి. సమాజంలో పునరుజ్జీవనం మొదలైంది. భారతదేశ భవిష్యత్ చిత్రపటం అస్పష్టంగానైనా, ఒక నిర్దుష్టమైన రూపు దిద్దుకోసాగింది.

భారతదేశంలో వచ్చిన ఈ ఉద్యమాలు ఆంధ్రదేశంలోనూ తలెత్తాయి. దేశంలో ఏ ప్రాంతానికీ తీసిపోనట్లుగా ఇవి బలం పుంజుకొన్నాయి. అప్పుడొచ్చిన సాహిత్యం, పత్రికలు, చేపట్టిన సమస్యలు, వెల్లివిరిసిన చైతన్యం గణనీయమైంది. 1897లో ఏలూరులో మొదటి గోదావరి మండల సంస్కరణ సభకు 75 మంది మహిళా ప్రతినిధులు హాజరుకావడం ఒక్కటే దీనికి

నిదర్శనం కానక్కరలేదు. 1911లో మద్రాసు నుండి వెలువడే 'హిందూ' పత్రికలో వెలువడిన ఒక సమీక్షా వ్యాసం గూడ దీనికి తార్కాణంగా చెప్పు కోవచ్చు. మహిళా సమాజాలు, స్త్రీ రచయితలు, వారి గ్రంధాలు, వ్యాసాలు, సమాజాలు, అవి నిర్వహించిన గ్రంధాలయాలు, చేపట్టిన అనేక కార్యక్రమాలు— స్త్రీలు సభల్లో పాల్గొనడమేగాక, ప్రత్యేక సమావేశాలను, మండల సభలను నిర్వహించడం, వీధి ఊరేగింపుల్లో పాల్గొనడం ఇవి మనం గుర్తించాల్సిన మార్పులు. ఏ స్థితి నుండి స్త్రీలు ఏ దశకు ఎదిగారో— అది వారి స్వయంకృషి కానివ్వండి లేదా సంస్కరణోద్యమ ప్రభావం కానివ్వండి, సంస్కర్తల చేయూత కానివ్వండి— గమనించాల్సిన అంశం వారిలో వెల్లివిరిసిన చైతన్యం, వచ్చిన మార్పు.

పైన పేర్కొన్న చైతన్యంలో భాగంగానే స్త్రీల పత్రికల్ని పరిశీలించాలి. అదే కృషి ఈ గ్రంధంలో శ్రీమతి పద్మావతి చేసింది కూడ. తెలుగు జర్నలిజం ఎంతో అభివృద్ధి చెందింది, 19వ శతాబ్దపు మధ్య భాగం నుండి మామూలు, సాదా, సీదా పత్రికలుగా ప్రారంభమై, సంస్కరణోద్యమకాలంలో వేగం పుంజుకొని, అప్పట్లో నిర్వహించాల్సిన చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించి, ఆ తర్వాత రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక ఉద్యమాల సంపన్నతకు ఎంతగానో దోహదం చేశాయి. వీటిని గూర్చిన విశ్లేషణ, అన్ని కోణాల నుండి ఇంతవరకూ సరిగ్గా జరగలేదు ఈ విధమైన పరిశోధనకు కావల్సిన ముడిసరుకు గ్రంధాలయాల్లో, వ్యక్తుల దగ్గర, అక్కడా, ఇక్కడా నిక్షిప్తమై వుంది. వీటిని కష్టపడి సేకరించారు పద్మావతి. వాటిని పరిశీలించాల్సిన చారిత్రకు, సాంఘిక నేపధ్యంలో వుంచారు. కొన్ని సూత్రీకరణలు చేశారు. అవే తిరుగులేని అంతిమ ముగింపు వాక్యాలుగా ఆమె అనుకోడంలేదు. కేవలం పత్రికలనే ఆధారం చేసుకొని, అందులో వెలువడిన రచనలను మాత్రమే విశ్లేషించి, అప్పటి ఉద్యమాలపై, సంస్కర్తలపై అభిప్రాయాలు వెల్లడించడం గానీ, తీర్పులివ్వడం కానీ సరైందికాదని ఆమెకూ తెలుసు. అందుకే, ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాలు, చేసిన సూత్రీకరణలను, ఆ కాలపు మొత్తం సంస్కరణ సాహిత్యంలో కలిపి చూడాలి. వాటి మధ్య గల సంబంధాలను పరిశీలించాలి. సాహిత్యంలో వెలిబుచ్చిన భావాలకు, పత్రికల్లో భావాలకు వైరుధ్యమున్నా, ఒక దాంట్లో చెప్పినవి మరో చోట లేకున్నా, వాటికి గల కారణాలు వెతకాలి. పరిశోధకులు, సత్యాన్వేషనులు చేయాల్సింది సరిగ్గా ఇదే! ఆ పని పద్మావతి ప్రారంభించింది. ఆమె పిహెచ్.డి. పరిశోధనాంశం

"సంస్కరణోద్యమ సాహిత్యంలో స్త్రీ" నేడు మనకు లభ్యమవుతున్న పరిశోధక పనిముట్లనూ, కాలానుగతంగా ఏర్పడిన పరిశోధక దృష్టితోనే గాక, ప్రాపంచిక దృష్టితో గూడ కలగలిపి, గతకాలపు ఘటనలను అంచనా వేయడానికి ప్రయత్నించాలి. అంతేకాని, ఈనాటి మన భావాలను, మనం కావాలనుకొంటున్న మార్పులను, అప్పట్లో, దాదాపు ఒక శతాబ్దం క్రితం, రాలేదని కానీ, వాటి కొరకు కృషి జరగలేదని కానీ అనడం చారిత్రకంగా సరైంది కాదు. ఒక్కొక్క యుగంలో పెంపొందే భావజాలం, వచ్చే మార్పులు, అప్పటి ఆర్థిక, సామాజిక పరిస్థితులకు, చారిత్రక శక్తులకు అనుగుణ్యంగానే వుంటాయి అకానీ, కాలాన్ని మించి వుండడానికి వీల్లేదు. ఈ చారిత్రక దృష్టితో చూసినప్పుడు 19వ శతాబ్దపు సంస్కరణోద్యమాలు పరిమిత స్వభావాన్ని కలిగి వున్నట్టివే! వాటి పరిమిత స్వభావం కానీ, ఆనాటి సంస్కర్తల భావజాలం కానీ, వలసపాలన విధించిన పరిమితులకు లోబడినట్టివే. వలసపాలన సృష్టించిన ఆశలు, భ్రమలు, ఆధునికతవైపు సమాజాన్ని మార్చడం పట్ల వలస పాలకులకున్న అనుకూలతతోనే (వారి ప్రయోజనాల దృష్ట్యా), సమాజ ఆధునికీకరణ జరిగిందన్నది చారిత్రక సత్యం. వలసపాలకుల పరిమిత దృష్టిని, ఆధునికీకరణ విషయంలో, ఆసరగా తీసుకొని అప్పటి మధ్య తరగతి వర్గం, అప్పుడే భారతీయ సమాజంలో తలెత్తుతున్న పెట్టుబడిదారీ వర్గపు ప్రతినిధులుగా, వారి భావ వ్యక్తీకర్తలుగా పనిచేశారు. సామాజిక మార్పుకు, ఆధునికీకరణకు అసంపూర్తిగానైనా కృషి చేశారు. ఫలితంగా జరిగిందేమిటి? సామాజిక మార్పు జరగాల్సినంతగా జరగనేలేదు. మధ్యంతరంగానే ఆగిపోయింది. పూర్తి పెట్టుబడిదారీ, ఆధునిక సమాజం ఆవిర్భవించలేదు. భూస్వామ్య సమాజపు భావజాలం, అవశేషాలు సమాజంలో మిగిలిపోయాయి. వలసపాలకులు సామాజిక మార్పును పూర్తిగా కొనితెస్తారన్న పొరబాటు అవగాహనలో (False consciouness)లో వుండిపోయారు ఆనాటి సంస్కర్తలు ఇది వలసవాద పెత్తనం వల్ల జరిగిన కీడు. విదేశీ పాలనతో సంబంధం లేని, స్వతంత్రంగా అభివృద్ధి చెందిన టర్కీ, జపాన్ లాంటి దేశాల్లో, ఆధునికీకరణ పరిణామం వేరే విధంగా, మరింత సంపూర్ణంగా, స్వతంత్రంగా జరగడం ఇక్కడ గమనించదగ్గ విశేషం. ఇదే సందర్భంలో మనదేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కూడ, ఆర్థికపరమైన పరిణామాలు వేరే విధంగా వున్నందున, ఇంకా సమాజంలో రావల్సిన ఆరోగ్యపరమైన మార్పులు రాలేదు. ఈనాటికీ సాంఘిక దురాచారాలు విలయనృత్యం చేస్తూనే

వున్నాయి. సతీ పునరుద్ధరణ, వరకట్నం, స్త్రీ స్వాతంత్ర్యం, కులవ్యవస్థ, మత, సాంఘిక దురాచారాలు, మూఢ నమ్మకాలు, కుహనామత విశ్వాసాలు, టక్కుటమారాల మతగురువులు మెదలగునవి చూస్తూనే వున్నాం. మరో వీరేశలింగం రావాలనీ, రాజారామ్మోహన్‌రాయ్, విద్యాసాగర్ మళ్ళీ పుట్టాలనీ, అర్థంలేని నిస్సహాయ స్థితిలో కలలు కంటున్నది సమాజం. సామాజిక పరిణామాన్ని పూర్తిగా తీసుకరాగలిగిన పాలక వర్గం, దాని స్వతంత్ర పటిష్ఠత, ఆ వర్గానికి దోహదం చేయగలిగిన మధ్యతరగతి వర్గం యీనాడు లేదు. ఉదాహరణకు ఈనాడు సాంస్కృతిక రంగాన్నే చూద్దాం. సినిమాలు, సాహిత్యం, వాటిలోని కథా వస్తువులు ఎలా వున్నాయో మనకు తెలుసు. సమాజంలోని యువత, ఆదర్శ బలంలోపించి, సరియైన విలువలు లేని వాతావరణంలో వట్టి పిప్పిలా, వేళ్ళులేని వృక్షంలా ఎదుగుతున్నారు. నేటి స్త్రీల పత్రికల్నే ఉదాహరణగా తీసుకొందాం. పద్మావతి ఈ గ్రంథంలో ఒకచోట రాసినట్టుగా, కనీసపు 19వ శతాబ్దపు ఆదర్శవాదం కూడ వీటిలో కనపడదు. వంటింటి వ్యవహారాలు, అందచందాల చిట్కాలు, భూతప్రేత, పిశాచ సంబంధమైన సీరియల్స్, బూతు కథలు, కొన్ని మినహాయింపులతో, ఖచ్చితంగా పెట్టుబడికీ, కట్టుకథకీ పుట్టిన విష పత్రికలు యివి.

19వ శతాబ్దపు పత్రికలు స్త్రీని కేవలం విద్యావంతురాల్నే చేయాలనుకోడం. వివాహవ్యవస్థను, కుటుంబ పరిమితుల్ని దాటి వెలువలికి రమ్మని పిలుపు యివ్వకపోవడం నిజమే! విద్యను సార్వజనీనం చేయాలని, అది అజ్ఞానాన్ని, మూఢత్వాన్ని పారద్రోలి, మానవుని మనస్సును పెనవేసుకొన్న అంధకారపు శృంఖలాల్ని తెంచివేసే సాధనంగా భావించారు. స్త్రీకి కూడ ఒక మనస్సు వుందనీ, స్వేచ్ఛావాయువులు పీల్చే గుండెలువున్నాయని గ్రహించినా, వాటికి భౌతికమైన పునాది వుందనీ, దానికక్కరవల్సిన ఆర్థిక పరమైన హక్కులు పురుషులతో సమానంగా వుండాలన్నంత మేరకు వెళ్ళలేకపోయారు. అది, ముందే చెప్పినట్టు, ఆనాటి సంస్కర్తల సంస్కరణ దృష్టి మాత్రమే! వారు సమాజాన్ని సమూలంగా మార్చాలన్న భావజాలానికి దోహదం చేసిన వారు కాదు. వివాహ వ్యవస్థను గూర్చి ఈ నాటికీ మనం చర్చిస్తూనే వున్నాం. అందులో ఎనలేని దోషాలున్నాయని ఛాందసులనబడే వారి అంతరంగానికి కూడ తెలుసు. అయితే దీనికి ప్రత్యామ్నాయం ఏమిటి? ఇదే మనల్ని వేధిస్తున్న సమస్య. అలాఅని దోషభూయిష్ఠమైన వివాహ వ్యవస్థను సమర్థిస్తున్నామని కాదు. అందులోంచి వెలికి తీసి స్త్రీని

ఎక్కడికి తీసుకెడుతున్నట్టు? ఇది తీవ్రంగా మనం ఆలోచించాల్సిన విషయం. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యంతో పాటు, సమాజంలో స్వేచ్ఛగా వుండే వీలు, సామాజిక భద్రత నేడు వుందని చెప్పలేం. మన సమాజం బాగా పేరుకుపోయిన పితృస్వామిక, మగవాడి ఏలుబడిలోవున్న సమాజం. అందువల్ల అప్పటి చైతన్యం. ఉద్యమాలు స్త్రీని ఉత్తమ గృహిణిగా తయారుచేయపూనుకొన్నాయన్నా, 'పూర్తి' స్వేచ్ఛను కోరలేదన్నా, ఆనాటి విద్యాప్రణాళికల్లో క్రియాశీలక, మిలిటెంట్, రాడికల్ భావాలు లోపించాయన్నా, కారణం, అప్పట్లో స్త్రీకి ప్రాథమిక చైతన్యం పెంపొందించే దశగా దాన్ని పరిగణించాల్సి వుంటుంది. లేకుంటే 19వ శతాబ్దపు ప్రథమ భాగంలో జరిగిన బ్రిటీష్ వ్యతిరేక తిరుగుబాట్లు, వలస వ్యతిరేకతా చైతన్యాన్ని కలిగిలేవనీ, వాటికి వలస దోపిడి గూర్చిన స్పృహ వుండాల్సినంతగా లేదనీ తప్పుపట్టినట్టుగా వుంటుంది. అయితే, సంస్కర్తలు వెలిబుచ్చిన భావాలకు, ఆచరణకు ఎడం వుంటే దాన్ని ఖండించాల్సిందే! ద్వంద స్వభావాన్ని బట్టబయలు చేయాల్సిందే!

అనల్పైన ఆధారాలతో, శ్రమించి, సరియైన ఉపపత్తులతో, సమాచారంతో, చక్కటి స్పష్టతతో, యం.ఫిల్. సిద్ధాంత వ్యాసం రాశారు. ఎంతో పట్టుదలతో, చిత్తశుద్ధితో విషయాన్ని పరిశీలించారు. అడుగడుగునా వివరణలు పొందుతూ ముందుకు సాగింది ఆమె పరిశోధన. అందుకు పద్మావతిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. స్త్రీల సమస్యలపై వివిధ దృక్కోణాల నుండి ఉపయోగకరమైన చర్చలు జరుగుతున్న నేటి కాలంలో, సమ్యక్ దృష్టితో, శ్రీమతి పద్మావతి చక్కటి రచనలు చేస్తుందన్న విశ్వాసం నాకుంది.

కేంద్రీయ విశ్వవిద్యాలయం
హైదరాబాద్, 24-4-'89

—వి. రామకృష్ణ

# కృతజ్ఞతలు

యం.ఫిల్. పరిశోధన వ్యాస రచన పర్యవేక్షణకి అంగీకరించిన శ్రీమతి ఆనందారామం గారికి.

శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గారికి, శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, తెలుగుశాఖ (యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్)లోని ఇతర అధ్యాపక బృందానికి.

ఎన్నోసార్లు పరిశోధనాంశం గురించి చర్చించి, అమూల్యమైన సలహాలను, అరుదైన పుస్తకాల్ని ఇచ్చి సహకరించిన శ్రీ వి. రామకృష్ణ గారికి,

సిద్ధాంత వ్యాసాలకోసం, వివిధ పుస్తకాల పత్రికలకోసం వెళ్ళినప్పుడు వాటినిచ్చి, చర్చలు చేసిన....డా॥ జి.ఎన్. రెడ్డి గారికి, డా॥ పి.సి.యన్. రెడ్డి గారికి, డా॥ కొలకలూరి ఇనాక్ గారికి, డా॥ హెచ్. బ్రహ్మానంద గారికి, డా॥ దేవకి గారికి, డా॥ కాత్యాయని గారికి డా॥ చేకూరి రామారావు గారికి.

రాజమండ్రి నుంచి ఎన్నో విలువైన పుస్తకాల్ని పంపించి ఎంతగానో సహకరించిన శ్రీ సన్నిధానం నరసింహ శర్మ గారికి,

ప్రతి స్థాయిలోనూ నన్ను ప్రోత్సహిస్తూ సహకరించిన శ్రీదేవి, సుబ్బలక్ష్మి, స్వర్ణ, తిరుపతమ్మ, జోబాలకి,

యం.ఫిల్. థీసిస్ ప్రచురించుకోవాలి అని చెప్పగానే, భారాన్నంత భుజాన వేసుకున్న శ్రీ వి. నరసింహ రావు గారికి, వీరిని పరిచయం చేసిన రవి అన్నయ్య గారికి, ఇతరత్రా సలహాలిచ్చి సహకరించిన డా॥ ఎ. పాండయ్య గారికి, డా॥ సుధీర్ గారికి, అతి తక్కువ వ్యవధిలో ముద్రించి ఇచ్చిన మెస్సెర్స్ చంద్రశేఖర ప్రింటింగ్ వర్క్స్ వారికి,

ఇంకా ఎందరికో........!

# భూమిక

"తెలుగులో-స్త్రీల పత్రికలు ఒక పరిశీలన" అనే విషయాన్ని పరిశోధనాంశంగా గ్రహించడానికి నేడు స్త్రీలకోసం ప్రత్యేకంగా పత్రికలు 'వనిత, వనితాజ్యోతి' వెలువడుతున్నాయి కదా? వాటి వలన మధ్య తరగతి స్త్రీకి ఏ మాత్రం ప్రయోజనం కలుగుతోంది. అసలు ఈ పత్రికల లక్ష్యం ఏమిటి? అని కలిగిన అనుమానాలే కారణం. అనుమానానికి సమాధానం వెతుక్కుంటూ పోతూంటే స్త్రీల కోసం పత్రికలు ఈ రోజే కాదు వంద సంవత్సరాల క్రితమే వెలువడ్డాయి. అనే ఆసక్తికరమైన విషయం తెలియవచ్చింది. ఏ పరిస్థితుల్లో స్త్రీలకోసం పత్రికలు వచ్చాయి! అనే ప్రశ్న తర్వాత కలిగింది. సామాజికంగా స్త్రీ విపరీతంగా అణచివేయబడివున్న కాలంలో స్త్రీల కోసం మొదటి పత్రిక వెలువడింది. అయితే స్త్రీ బయటికి వస్తేనే తప్పుగా భావించే ఆ సమాజంలో వెలువడిన స్త్రీల పత్రికలు ఏ విషయాన్ని చర్చించేవి? నిజంగా స్త్రీల సమస్యల్ని చర్చించేవా? లేక మరే విధంగానైనా ప్రబోధించేవా? అనే కుతూహలం ఈ విషయం మీద పరిశోధనకి పురికొల్పింది.

తెలుగులో పత్రికలకి సంబంధించిన పరిశోధన చాలకొద్దిగా జరిగింది. అందులో చెప్పుకోతగ్గది శ్రీ లక్ష్మణ రెడ్డి గారి 'తెలుగులో జర్నలిజం-అవతరణ-వికాసాలు' అనేది ఒకటి. తెలుగు పత్రికా ప్రపంచానికి సంబంధించి ఇప్పటి వరకు జరిగిన పరిశోధనల్లో కాస్త సమాచారాన్నందించ గలిగేది లక్ష్మణరెడ్డి గారి సిద్ధాంత వ్యాసం. ఆ వ్యాసం ఈ మధ్యనే పుస్తక రూపం పొందింది. ఇందులో కాలక్రమానుగతంగా పత్రికల జాబితా కనిపిస్తుంది గానీ పత్రికల స్వభావ విశ్లేషణ అంతగా కనిపించదు.

వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి చెందిన పి. రామమూర్తి గారు 'తెలుగులో మహిళా పత్రికలు-మహిళాభ్యుదం' అనే పేరుతో ఒక యం.ఫిల్. సిద్ధాంత వ్యాసాన్ని ఆ యూనివర్సిటికి సమర్పించారు. అయితే ఆ సిద్ధాంత

వ్యాసంపై పేరులో మహిళా పత్రికలనే పదం వుంది కాని లోపల విషయమంతా 1835 నుంచి నేటి వరకు వచ్చిన పత్రికల జాబితాతో పాటు మధ్యలో మహిళల హక్కులకి సంబంధించిన ఒకటి రెండు చట్టాలను గురించి కూడా చర్చించారు. అయితే ఆ చర్చ పరిమితంగా వుంది కాబట్టి, ఆ సిద్ధాంత వ్యాసాన్ని చూసింతర్వాత, తప్పకుండా మహిళా పత్రికల్ని గూర్చి పరిశోధన చెయ్యాలి అని నిర్ణయించుకొని ఈ అంశాన్ని పరిశోధనకి ఎంచుకోవడం జరిగింది.

తెలుగులో దీర్ఘకాలం వెలువడి ఎంతో ప్రఖ్యాతి పొందిన 'గృహలక్ష్మి పత్రిక మీద కాకపోయినా, ఆ పత్రిక ప్రదానం చేసిన 'స్వర్ణకంకణ' గ్రహీతలను గూర్చి, 'గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతలు వారి కావ్యములు-ఒక పరిశీలన' అనే పేరుతో ఉస్మానియా యూనివర్సిటి నుంచి ఒక పి హెచ్.డి., సిద్ధాంత వ్యాసం వెలువడింది. అందులో రచయిత్రి గృహలక్ష్మి పత్రిక స్వరూప స్వభావాల్ని గురించి స్థూలంగా చర్చించారు.

తెలిసినంత వరకు తెలుగు పత్రికలకి సంబంధించి జరిగిన పరిశోధన యిది. (పత్రికల్లోని భాషా విశేషాల్ని గురించి ఒకరిద్దరు పరిశోధన చేశారు.) కాబట్టి ఎంతో విశిష్టమైన చరిత్ర కలిగిన తెలుగు మహిళా పత్రికల్ని గూర్చి లోకానికి తెలియజేయాలనే తపనతో కూడా ఈ అంశాన్ని ఎన్నుకోవడం జరిగింది. ఇక దీనిలో 1947 వరకు వచ్చిన పత్రికల్ని మాత్రమే పరిశీలించడం జరుగుతుంది. ఎందువల్లనంటే 1947 తర్వాత దేశంలో అనేకమైన మార్పులు సంభవించాయి. వాటికనుగుణంగా పత్రిక స్వభావంలో మార్పు రావడం సహజం. విషయం విస్తృతమైపోతుందనే భయంతోను, 1947 తర్వాత మార్పులు అంతకు ముందు పరిస్థితితో స్పష్టంగా భిన్నమైనవి కావడంతోను ఈ విషయాన్ని ఇంతవరకే తీసుకోవడం జరిగింది. గృహలక్ష్మి పత్రికకి సంబంధించి కూడా ఒక సిద్ధాంత వ్యాసం వెలువడింది కాబట్టి ఆ పత్రికని గూర్చి కొద్దిగా సమాచారం మాత్రమే సేకరించి రాయడం జరిగింది. గృహలక్ష్మి, ఆంధ్ర మహిళ పత్రికా ప్రతులు అన్నీ లభ్యం అవుతున్నాయి.

ఇందులో కూడ 1920 తర్వాత చూసినంత వరకు మూడు, నాలుగు పత్రికల కంటే ఎక్కువ లేవు. ఈ పరిశోధనాంశం ప్రధానంగా 1920 వరకు వచ్చిన పత్రికలకి సంబంధించి వుంటుంది. ఆ తరువాత పత్రికలకి సంబంధించి స్థూలమైన చర్చ మాత్రమే జరుగుతుంది.

1920 కి ముందు తెలుగులో స్త్రీలకోసం పత్రికలున్నాయా? అని ఆశ్చర్యపడే తెలుగు వారికి సమాధానం ఈ పరిశోధనా వ్యాసం.

“సాహిత్యం జర్నలిజం ఇవి రెండు జీవితాన్ని ప్రతిబింబించడానికి ప్రయత్నించేవే. ఎటొచ్చీ జీవితపు సంఘటనలను విన్నవాటిని- కన్న వాటిని, విన్నట్టుగా, కన్నట్టుగా జర్నలిజం చిత్రిస్తుంది. పత్రిక ఒక పేజీలో వేసే దానికి మరొక పేజీలో వేసేదానికి సంబంధం ఉండదు. పేజీలోనూ ఒక కాలంలో దానికీ, సంబంధం ఉండదు ఒకే కాలంలో పరస్పర సంబంధము కాని విభిన్న విషయాలుండవచ్చు. ఇందుకు కారణం జీవితం బహుముఖమైంది కావడమే. బహుళ సమస్యలతో కూడినది కావడమే.” (నవమేధావి నార్ల పు. 52) అన్న నార్ల వారి మాటలు అక్షరసత్యాలు.

సంఘ జీవితాన్ని సాహిత్య ప్రక్రియలు ఒక్కో ప్రక్రియ ఒక్కో కోణం నుంచి చూస్తే పత్రికలు అన్ని కోణాల్నించి చూసి ప్రచారం చేస్తాయి. ఒక్కో సారి వ్యాఖ్యానం చేస్తాయి.

అనే నమ్మకంతోనే పత్రికల ద్వారా నాటి స్త్రీ సామాజిక పరిస్థితిని అంచనా వేయడానికి ప్రయత్నం చేశాను.

“అస్పష్ట ప్రతిబింబాలు” అనడంలో ఆ పత్రికలు నాటి సమాజాన్ని ప్రతిబింబించిన తీరులో స్పష్టత లేదు అని చెప్పడమే. ఎందుకంటే స్త్రీ జనోద్ధరణ కోసం పాటుపడిన సంస్కర్తలు నడిపిన స్త్రీల పత్రికల్లో కనిపించిన స్త్రీ నాటి స్త్రీ సమాజానికంతటికీ ప్రతీక కాదు, స్త్రీల సంపాదకత్వంలో నడిచిన పత్రికల్లోనూ స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని కొంతవరకూ గుర్తించి కూడా, తిరిగి పురుషస్వామ్య భావజాలానికి అనుగుణంగానే ఆ పత్రికలు తయారు కావడానికి కారణం ఊహకందనిది. అందుకి ఈ పత్రికల్ని ‘అస్పష్ట ప్రతిబింబాలు’ అన్నాను.

ఈ పరిశోధన వ్యాసం స్త్రీల పత్రికలకి సంబంధించిందే అయినా చివర్లో తలెత్తిన ప్రశ్నలు కేవలం ప్రతికలకే పరిమితం కాదు. అవి నాటి సమాజానికంతటికీ సంబంధించినవి. ప్రశ్నలు తలెత్తినంత సులభంగా సమాధానాలు దొరకవు. ప్రతి సమాధానానికి సవాలు చేయగలిగే సమాధానం మరోటి ఉంటూ ఉండవచ్చు. స్త్రీ పరమైన ప్రశ్నలకి, స్త్రీలందరి సమాధానం ఒకటిగా ఉండకపోవచ్చు. ఎవరివాదం వారికి సబబుగానే తోస్తుంది. స్త్రీల పత్రికల్ని, తద్వారా స్త్రీ పరిస్థితిని నేను చూసిన దృక్పథం పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా స్త్రీవాద దృక్పథం అని చెప్పగలను.

ఏ సామాజిక పరిస్థితుల్లో స్త్రీల పత్రికలు వెలువడ్డాయో, ఏ సామాజిక ప్రేరణతో వారు పత్రికలు చదవటం ఆరంభించారో తెలుసుకొంటే పరిశీలించబోయే స్త్రీల పత్రికలకి సంబంధించిన అంశాలకి దోహదకారిగా ఉంటుందనే భావంతో ఈ పుస్తకాన్ని సామాజిక నేపథ్యంతో ప్రారంభించాను.

నాకు సాధ్యమైనంతవరకు స్త్రీల పత్రికల్ని సేకరించాను. నా దృష్టిలోకి రాని పత్రికలు ఏవైనా ఉండి ఉండవచ్చు. అటువంటి పొరపాట్లని సహృదయులు మన్నిస్తారని ఆశిస్తూ.

—పద్మావతి

# విషయసూచిక

పేజి నం.

# 1
# సామాజిక నేపథ్యం

తెలుగులో స్త్రీల పత్రికల్ని పరిశీలించడానికి, సామాజిక పరిస్థితుల్ని అంచనా వేయడం అవసరమా! అని అనుమానం రావచ్చు. కాని సాహిత్యమైనా, సంఘమైనా మార్పుపొందిందంటే తప్పకుండా తత్కాల ప్రజల అవసరాల్లో మార్పు వచ్చి ఉంటుందన్నమాట. అందుకే తొలి తెలుగు మహిళా పత్రిక వెలువడే నాటి సంఘ స్థితి ఏ విధంగా దోహదం చేసిందనే విషయ పరిశీలనకి తొలి దశలో మహిళా పత్రికల సామాజిక నేపథ్యం కొంత ఇవ్వడం జరిగింది.

సంఘం పరిణామాత్మకమైంది! మరి అటువంటప్పుడు ఏ పరిణామాన్ని ఈ పరిశోధనకి తొలి ఘట్టంగా తీసుకోవాలి అన్న ప్రశ్న ఏర్పడుతుంది! అందుకు సమాధానం మన దేశంలో 'యుగ సంధి' అని చెప్పబడే 19వ శతాబ్దపు ఉత్తరార్ధం నుంచి తొలి స్త్రీల పత్రిక వెలువడే నాటి వరకు స్థూలంగా చర్చించి. ఆ పత్రికలు వెలువడుతున్న నాటి పరిస్థితుల్ని చేతనైనంత వివరంగా పరిశీలించాలని ప్రయత్నం.

తెలుగు దేశంలో స్త్రీల పత్రిక వెలువడే నాటికి వంగ దేశంలోనూ వెలువడ్డాయి. వీటి రెండింటికి మార్గదర్శియైన ఆంగ్ల దేశంలో స్త్రీల పత్రికలు ఎప్పుడో వచ్చాయనే విషయం వేరుగా చెప్పక్కర్లేదు. 19వ శతాబ్దంలో తెలుగుదేశంలో ఏం జరిగినా అది ఒక్క తెలుగుదేశానికే పరిమితం కాదు. యావద్భారతంలోనూ అటువంటి పరిస్థితే నెలకొని వుంది. 1849 నాటికి మహారాష్ట్రలో స్త్రీల కోసం పత్రిక నడుపబడినట్లు తెలుస్తోంది.1

ఆ రోజుల్లో ఉద్యమాలకు, అంజడులకు భారతదేశంలో బెంగాలు ముందంజ వేసింది. ఎందువల్లనంటే ఆంగ్లేయుల పాలన అక్కడ మొదట విస్తరించింది కాబట్టి ఆ ప్రభావాలు మిగిలిన దేశం అంతటి కంటె ముందుగా బెంగాలు మీద పడ్డాయి. క్రమంగా ఇవి ఇతర రాష్ట్రాలకి వ్యాపించింది. 19వ

శతాబ్దం పూర్వార్థంలోనే రామమోహనరాయలు అక్కడ సంస్కర్త అయ్యారు. ఆ శతాబ్ది ఉత్తరార్థంలో దక్షిణ భారతదేశంలో సంస్కర్తలు తయారయ్యారు. సంస్కరణ భావాలు మొదటిసారిగా బెంగాల్లో తలెత్తి దేశమంతా వ్యాపించాయి.

పొరుగునున్న మహారాష్ట్రలో కూడా అదే కాలంలో సంస్కరణ భావాలు తలెత్తాయి. రామమోహనరాయ్ అనంతరం అతనికి అనుచరులు బయల్దేరారు. బెంగాల్‌లో ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహారాష్ట్రలో మహదేవ గోవింద రానడే, ఆంధ్రలో కందుకూరి వీరేశలింగం గార్లు ఇంచుమించుగా ఒకే కాలంలో సంస్కరణోద్యమాన్ని నడిపారు.

19వ శతాబ్దికి మన దేశంలో ఆచారాలు, బూజు పట్టిపోయాయని, మూఢ నమ్మకాలు శుష్క సంప్రదాయాలకు భారతదేశం పుట్టినిల్లుగా ఉండేదని అనిపిస్తుంది. అప్పటి సమాజం బూజుపట్టిన ఆచారాలతో మూఢ నమ్మకాలతో నిండి వుంది కానీ అప్పటికే మేధావుల్లో కొందరు ఆ పరిస్థితిని ప్రశ్నించారు! అంటే ఆ సంఘంలో ప్రజల అవసరాలు మారాయన్న మాట! ఆలోచనలో మార్పు వచ్చిందన్నమాట, వాళ్ళ ఆలోచనలో మార్పు రావడానికి 'ఆంగ్ల విద్య' ప్రధాన కారణం అయివుండవచ్చు.

అంతకు ముందు ప్రతీది 'కర్మ' అని 'విధి' అని సరి పెట్టుకొనే భారతీయ పండిత లోకంలో, ఈ కర్మ, విధి, అనేవి మార్చడానికి వీలైనవనే ఆలోచన మొదలైంది! తత్ఫలితంగానే నాటి ఆచారాలను ప్రశ్నించడం, నూతనాచారాలను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించడం జరిగింది. ఆచారం, సంప్రదాయం అనేవి మానవ జీవితాన్ని సుఖవంతం చేసేవిగా ఉండాలి కాని దుఃఖ భాజకాలుగా ఉండకూడదనే దృక్పథం యేర్పడింది!

నాటి సమాజంలో ప్రతి వ్యవస్థలోను మేధావులకు లోపాలు కనిపించాయి. వాటిని సరిదిద్దాలనే తాపత్రయం మొదలైంది వీటన్నిటికీ ముఖ్యమైన కారణం సమాజ ఆర్థిక వ్యవస్థలో మార్పు రావడం[2] అని కొందరి అభిప్రాయం.

అనాడు భారతదేశంలో చేతి పరిశ్రమలకి ప్రాముఖ్యం తగ్గి, ఫ్యాక్టరీల స్థాపనకు, పారిశ్రామిక రంగానికి ప్రాముఖ్యత పెరిగింది. దేశీయమైన చేతి పరిశ్రమ స్థానాన్ని యంత్ర పరికరాలు ఆక్రమించుకొన్నాయి.

> ''మన దేశంలో ద్రవ్యస్థితి మిక్కిలి తక్కువ యున్నది. మన దేశస్థులు జీవించడమునకు ఉండే వస్తువులు చాలా తగ్గిపోయినవి, రాజధానుల యందుండే వారికి జీవనార్థమై కొన్ని సదుపాయాలు కలుగుతున్న ప్పటికిన్ని ఇతర స్థలముల యందు ఉద్యోగములు లేకుండా నుండే వారికి జీవనము జరుపుకోవడం మిక్కిలి కష్టతరమైయున్నది. రాజధా నులయందుండే వారిలోనున్న ఉద్యోగములు కలిగియున్నవారు వినాగా తతిమ్మా వారు జీవనార్థమయి యుండేబాధను కొంతమట్టుకైనా తెలుసు కుంటూనే యున్నారు.''3

ఇది దేశ ప్రజల జీవనం మీద ఎంతో ప్రభావం చూపించింది. దేశీయ మైన వృత్తులు తగ్గిపోవడంతో జీవనాధారం వెతుక్కుంటూ ఉన్న వూరు విడిచి వెళ్ళవలసి వచ్చేది. ఉన్న వూరు విడిచిపెట్టిన తర్వాత వారు అనేకమైన ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వచ్చేది! దాంతో వారిలో ఆలోచన మొదలైంది. అంతకు పూర్వం ఉన్నచోటే ఉండటం, ఎవరివృత్తి వారు నిర్వహించుకుంటూ వుండడంతో, వారి ఆచార వ్యవహారాలకి ఏ విధమైన ఆటంకం కలగలేదు. ఎప్పుడైతే ఉన్న ఊరిని విడిచి వెళ్ళవలసిన అవసరం ఏర్పడిందో అంతవరకు తాము పాటిస్తున్న ఆచారాలకి ఆటంకాలు ఏర్పడ్డాయి. సవరణలు ప్రతిపాదించ బడ్డాయి.4

కొన్ని సంస్కృతులు బాహ్య ముఖంగా వుంటే కొన్ని ఆంతరికంగా ఉంటాయి. నాటి భారతీయ సంస్కృతి ఆంతరికంగా వుంది. బాహ్య ప్రపంచాన్ని గురించి ఎక్కువగా ఆలోచించలేదు. అందుకే ఎవరో వచ్చి మన దేశాన్ని కబళించుకొనేవారే కానీ మన వారు వేరే దేశాలవైపు చూపు సారించను కూడా లేదు. ఈ విపరీతమైన అంతర్ముఖత్వం మనిషి చుట్టూ గిరులు గీస్తుం టుంది. సరిగ్గా నాటి భారతీయ సమాజం కూడా అదే స్థితిలో వుంది. సముద్ర యానం చేస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి వంటి ఆచారాలు, అర్థం అయినా,

కాకపోయినా అవే శ్లోకాల్ని వల్లెవేసే విద్యా విధానం, బతికినా చచ్చినా మూడు ముళ్ళు పడితే చాలుననుకొనే వివాహ వ్యవస్థ ఒకటేమిటి అన్ని రంగాల్లోనూ భారతీయ సంస్కృతి గిరులు గీసుకొని అందులోనే ఉండి పోయింది. పక్క దేశంలో వస్తున్న మార్పుల్ని, సంభవిస్తున్న పరిణామాన్ని మనవారు మచ్చుకైనా పట్టించుకోలేదు.5

19వ శతాబ్దంలో ఈ పరిస్థితుల్లో మార్పు వచ్చింది. అయితే ఈ మార్పు హఠాత్తుగా 19వ శతాబ్దంలోనే ఎందుకు వచ్చిందన్న అనుమానం కలగక మానదు. అంతకు ముందు ఎన్నో శతాబ్దాల ముందు నుంచి ఈ దేశాన్ని విదేశీయులే పాలిస్తున్నారు కదా! అనే సంశయం రావచ్చు.

"ముసల్మానుల కాలములో నూతన పదజాలము చేరుట, రాజాస్థానాదులలో జరుగు మర్యాదల విషయములో కొన్ని భేదములు వచ్చుట మాత్రమే జరిగినది గాని పాశ్చాత్యుల సంపర్కము వలన మనలో వచ్చిన భావ విప్లవము వంటిది రాలేదు.6

దీనికి కారణం ముసల్మానులు మన దేశంలో పారిశ్రామిక వ్యవస్థను ఏర్పాటు చేయలేదు. వారికి నూతన ఉద్యోగి వర్గంలో పనిలేదు. వారికి కావలసిన పండితులు సభల్లో, రాజ స్థానాల్లో హాజరయ్యే వారు, వారి అవసరాలు అంత వరకే. వారిది పూర్తిగా భూస్వామ్య వ్యవస్థే. అయితే పాశ్చాత్యుల అవసరాలు వేరు. వారు ఈ దేశంలో నూతన పారిశ్రామిక వ్యవస్థను నెలకొల్పారు. వారికి మన దేశంలో వారికింద పనిచేసే ఉద్యోగి బృందం అవసరమైంది. అన్ని రకాల ఉద్యోగుల్ని మాతృ దేశం నుంచి ఇక్కడకు తీసుకురావడం ఆర్థికంగా వారికి లాభం కాదు. అందువల్ల సమాజానికి ఆయువు పట్టైన విద్యా వ్యవస్థను పాశ్చాత్యులు కదిలించారు. దాంతో భారతీయ సమాజంలో భావ విప్లవం బయల్దేరింది. పాశ్చాత్యులు తమ అవసరాలకోసం గుమస్తా చదువుల్ని ప్రవేశ పెడితే, ఆ చదువుతో బయట ప్రపంచాన్ని చూడగలిగిన భారతీయ మేధావులు తమని గురించి ఆలోచించడం మొదలుపెట్టారు. అంతకు ముందు ముసల్మానులు భారతీయ విద్యావ్యవస్థను ఏ మాత్రం కదిలించలేదు. కుతూహలం ఉన్న భారతీయ కవి పండితులు కొందరు వారి భాషల్ని నేర్చుకొని రాజదర్బారుల్లో

ప్రవేశించారు. కాని పాశ్చాత్య ప్రభావం అటువంటిది కాదు, అది సమాజాన్ని పునాదుల్లోంచి కదిలించింది. (ఇంగ్లీషు వారు గుమాస్తా విద్యా విధానాన్ని ఈ దేశంలో ప్రవేశపెట్టేప్పుడు బహుశా వారు కూడా భారతీయులు తమని ఈ దేశం నుండి తరిమి వేయడానికి తయారవుతాయని ఊహించి ఉండరు.)

ఆనాటి దేశీయ విద్యావ్యవస్థలో సమగ్రంగా మార్పు రావాలని శ్రీ వెన్నెలకంటి సుబ్బారావు ప్రభుత్వానికి సమర్పించిన ఒక నివేదికలో తెలియజేశారు.[7] ఈ పరిస్థితి 1850 నాటికి పెద్దగా మారినట్లు కనిపించదు. అంటే ప్రభుత్వం పాఠశాలలు స్థాపించింది కానీ అప్పటికి ఇంకా భారతీయుల్లో చాలామంది వాటి వైపు వెళ్ళలేదు.

ఛందోరూపంగా ఉన్న శాస్త్రాల విద్యాభ్యాసం క్లిష్టతరం అవుతోందని, బాలురకు అది అందుబాటులో ఉండటం లేదని వారికి స్థాయికి తగిన పాఠ్య పుస్తకాలను ఏర్పరచాలనే తలంపు స్వామినీన ముద్దు నరసింహం గారి నాటికే కనిపిస్తుంది. వివిధ నీతులు వైద్యాది శాస్త్రాలకు సంబంధించిన ప్రాథమిక పరిజ్ఞానం విద్యార్థులకు బాల్య దశలోనే బోధించాలనే భావం నాటికి ఏర్పడింది. ఈ శాస్త్రాది అంశాలను భాషాంతర గ్రంథాలలోంచి, దేశ భాషల్లో వచన రూపకంగా అచ్చువేయించాలనే అభిప్రాయం కూడా ఏర్పడింది.[8] కేవలం సంస్కృత శ్లోకాన్ని వల్లెవేస్తే లాభం లేదని, నిత్యజీవితానికి అవసరమయ్యే విషయాలను ఇతర భాషల్లో ఉంటే వాటిని దేశ భాషల్లోకి తర్జుమా చేసి నేర్చుకోవాలని ముద్దు నరసింహం నాయుడు సూచించారు. సమాజంలో విద్యావ్యవస్థలో సమగ్రమైన మార్పు రావాలనే తపన నాటి మేధావుల్లో కనిపిస్తుంది. ఆనాటికి మన విద్య సంస్కృత భాషలో ఛందోబద్ధంగా రాసి వున్న గ్రంథాలకే పరిమితమై ఉన్నట్టు అదీ కేవలం వల్లెవేసే పద్ధతికే విద్యార్థులు అలవాటు పడినట్లు భావించవచ్చు. దీన్నిబట్టి నాటి విద్యా విధానం అర్థంలేని బట్టీ పద్ధతిలో ఉండేదని, ముద్దు నరసింహం వంటివారు ఆ విద్యా విధానంలో మార్పుకోసం యోచించారని గ్రహించవచ్చు. దేశాంతరాలతో, భాషాంతరాలతో సంబంధాలు పెంచుకొని వివిధ విద్యల్ని సుగమం చేసుకోవాలనే తపన వ్యక్తమౌతుంది. విద్యా విధానంలో ఈ విధమైన మార్పులు కోరిన వారందరూ నాటి ప్రభుత్వంలో ఏదో విధమైన ఉద్యోగాలు చేస్తున్నవారే.

అంటే వీరంతా ఇంగ్లీషు విద్యతో సంబంధం ఉన్నవారే. మొదట్లో పాశ్చాత్య సంస్కృతి పట్ల ఇంగ్లీషు విద్య పట్ల ఉన్న వ్యతిరేక భావం క్రమక్రమంగా సడలిపోయింది. తొలి దినాల్లో పాశ్చాత్య సంస్కృతిని మనవారు అంత తేలిగ్గా ఒప్పుకోలేదు.9 19వ శతాబ్ది పూర్వార్థానికి ఇంగ్లీషు విద్య పట్ల పెరిగిన వ్యామోహం ప్రజల్లో ఆ విద్యా ప్రభావాన్ని చాటుతుంది. క్రమంగా దేశీయ పాఠశాలల స్థానే క్రైస్తవ మిషనరీల పాఠశాలలు చోటుచేసుకున్నాయి. ఊరూరా ఈ పాఠశాలలు వెలిశాయి. కళాశాలలు వెలిశాయి. 1857 నాటికి విశ్వవిద్యాలయాల చట్టం ద్వారా కలకత్తా, బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయాల స్థాపన జరిగింది. అయితే ఈ క్రమంలో మనం గుర్తించాల్సిన అతి ముఖ్యమైన పరిణామం ఇంతకు పూర్వం సాధారణంగా విద్య కేవలం ఏదో ఒక కులం వారికే (బ్రాహ్మణులకి) పరిమితమై ఉండేది. ఇంగ్లీషు వారి పాఠశాల లేర్పడ్డాకా ఆ పరిస్థితి మారిపోయింది.

> "....పూర్వకాలమందు మన హిందూదేశ హీనస్థితికి మూలకందమైన కుల విచక్షణచే తక్కువ కులజులు విద్యనేర్చుట కనర్హులుగా నెంచబడెడి వారు, అక్కతంబుననే వారట్లు హీనదశయందుండ వలసి వచ్చె కాని యిటీవల ఆంగ్లేయుల దొరతనము వారు దయబూని కుల భేదమెంచక నందరు విద్య నేర్చుట కర్హులని పాఠశాలల నేర్పరచి విద్య గరుపుచు చదువుకొన్న వారిని ఉద్యోగంబులచే గౌరవించుచు విద్యాభివృద్ధియు దాని మూలమున దేశాభివృద్ధియు జేయదొడంగిరి."10

ఈ పరిణామం హిందూ సంఘంలో విపరీతమైన మార్పు తెచ్చింది. అంతకు ముందు అంతంత దూరం నుంచే విడివడి మాట్లాడుకొనే భిన్న కులాల వ్యక్తులు ఒక కప్పు కింద చేరి చదవవలసిన అగత్యం ఏర్పడడంతో— ఆంగ్ల విద్యా విధానం భారతీయ సమాజ పునాదుల్ని కదిల్చివేసింది. ఈ విధంగా విద్యా వ్యవస్థలో వచ్చిన మార్పు భారతదేశంలో ఒక కొత్త తరహా మేధావి వర్గాన్ని తయారుచేసింది. ఈ వర్గం ఆంగ్లేయుల పరిపాలనా పద్ధతుల్ని, ఆచార వ్యవహారాల్ని హృదయ పూర్వకంగా ఆచరించి, 'ఆంగ్ల మానస పుత్రు'లనే బిరుదాన్ని కూడా పొందింది. అయితే ఈ పరిస్థితి ఎంతోకాలం సాగలేదు. 1885లో కాంగ్రెస్ స్థాపన జరిగి భారతీయులంతా ఏకంకావడం జరగడం

వలన క్రమంగా మరో వర్గం వుద్భవించింది. వారి దృక్పథంలో బ్రిటిష్ వారు ఈ దేశాన్ని అక్రమంగా పాలిస్తున్నారు. కాబట్టి వారిని మన దేశం నుంచి వెళ్ళగొట్టాలి. ఇటువంటి భావాల్లోంచి ఉద్భవించినవే 'స్వరాజ్యం నా జన్మ హక్కు, దాన్ని సాధించి తీరుతాను' వంటి నినాదాలు, వాటి ఫలితమే నేటి స్వతంత్ర భారతదేశం.

ఈ దేశంలో కులవ్యవస్థ కరడుగట్టి పోయింది. అది ఎన్నో అనర్థాలకి దారితీసింది. 19వ శతాబ్ది నాటికి ఈ సంఘంలో కుల వ్యవస్థ విపరీతమైన అంతర భేదాలతో సతమతమౌతోంది. మత ప్రాతిపదిక మీద ఏర్పడిన సామాజిక వ్యవస్థలో బ్రాహ్మణ ప్రాబల్యం కొనసాగుతోంది! మతాచారాల పేరిట ఏర్పడిన మూఢ విశ్వాసాల్ని మార్చవలసిన అవసరం ఏర్పడింది. ముస్లిం పరిపాలన మూలంగా వర్ణాశ్రమ ధర్మాలు మరింత పటిష్ఠమయ్యాయి! ఇంచుమించుగా అన్ని వర్గాల్లో ఈ మూఢాచారాలు ప్రబలి ఉండగా సమాజ ప్రవక్తకులుగా భావించబడే బ్రాహ్మణుల్లో ఇవి ఎక్కువగా ఉన్నాయి. వీరి తర్వాత ఈ లక్షణాల్ని కొంత అంటించుకొన్న వారు వైశ్యులు, వీరు బ్రాహ్మణుల్ని అనుకరించాలనే తాపత్రయంతో వారు ఆచరిస్తున్న ఆచారాలను తాము ఆచరించడానికి ప్రయత్నం చేసేవారు.11 కాబట్టి బ్రాహ్మణుల తర్వాత సంస్కరింపబడవల్సిన దశలో ఉన్నవారు వైశ్యులు, అందుకేనేమో చాలావరకు సంస్కర్తలు బ్రాహ్మణులు, ఒకరిద్దరు వైశ్యులు కనిపిస్తారు.

మేధావి వర్గంలో కొందరు ఛాందస భావాల్ని విడనాడకుండా వర్ణ వ్యవస్థని సమర్థించడంతో తర్వాతి కాలంలో త్రిపురనేని రామస్వామి చౌదరి వంటివారు వర్ణవ్యవస్థను ప్రశ్నించడం మొదలుపెట్టారు, సంస్కరణావశ్యకత ఉన్నత కులాల్లోనే ప్రధానంగా ఏర్పడింది. వీరిలో అనేక అంతర శాఖలున్నాయి. వీరిలో సాధారణంగా ఒక శాఖ వారు ప్రభుత్వోద్యోగాల్లో ఉండేవారు. ఆ శాఖలోంచే సంస్కర్తలు కూడా ఎక్కువగా రావడం గమనార్హం.12 కులం పరిధిలో గిరిగీసుకొని, ఆచారం పేరిట బయట ప్రపంచాన్ని తిరస్కరించే వారిలో చాలామంది ఆంగ్ల విద్యతో సంబంధం లేనివారే. ఆంగ్ల విద్యతో సంబంధం ఉండి ఆంగ్లేయుల కింద ఉద్యోగాలు చేస్తున్న వారిలో మార్పు సహజంగానే తొందరగానే వచ్చింది. 'నియోగి' శాఖ వారు అంతకు పూర్వం

కూడా రాజా స్థానాల్లో దివానుగా, గ్రామాధిపతులుగా ఉన్నట్లు చారిత్రక దాఖలాలున్నాయి. బ్రాహ్మణుల్లో అంతశ్శాఖల్లో వివాహాలేకాదు. సహ పంక్తి భోజనాలు కూడా ఉండేవి కావు. ఇతర కులస్థునితో అవసరమైతే మనసు పంచుకోగలరు కానీ వారితో కలిసి భోజనం చేస్తే కులం నుండి వెలేసేవారు.

సంఘంలో నిమ్న జాతుల వారి పరిస్థితి ఘోరంగా ఉండేది. అయితే వారి స్థితిని గుర్తించే దశకి ఇంకా ఆనాటి సమాజం చేరుకోలేదు. అంతకంటే ముందు సంస్కర్తల దృష్టిని ఆకర్షించిన విషయాలనేకం వున్నాయి. సమాజంలో నిమ్న జాతుల పరిస్థితిని ఇంచుమించుగా 20వ శతాబ్ది ప్రారంభం దాకా ఎవరూ పట్టించుకోలేదు. అప్పటికి కొందరు సంస్కర్తల దృష్టిని ఆ సమస్య ఆకర్షించగలిగింది. ఆంగ్లేయులు హైందవ వర్ణ వ్యవస్థలోని బలహీనతలు ఆధారంగా చేసుకొని నిమ్నజాతుల సముద్ధరణ పేరిట వారందరిని మతపరంగా తమవైపు మరలించుకోవటానికి ప్రయత్నించారు. అప్పుడు ఇది జాతి సమైక్యతకు గొడ్డలిపెట్టు కాగలదని గాంధీజీ వారు గుర్తించి నిమ్నజాతుల సంస్కరణలకు నడుంకట్టారు. జాతి పునరుజ్జీవనానికి ఇది ఎంతో ప్రధానమైనదనే భావం ఆనాటి సంస్కరణవాదులందరిలోను వ్యాపించింది.

కనీసం సంస్కర్తలలోనైనా కుల శాఖా భేదాలు సమసిపోయినప్పుడే సంస్కరణోద్యమం నిరాఘాటంగా సాగుతుందనే నినాదం మేధావి వర్గంలోంచి వినబడింది. తత్ఫలితంగా వెలువడ్డవే ఉన్నవ లక్ష్మినారాయణ గారి 'మాలపల్లి' వంటి నవలలు. వీరికి గాంధీ గారు హరిజనులనే గౌరవప్రదమైన నామకరణం చేశారు. ఆ తర్వాత వారిలోంచే మేధావులు బయల్దేరి స్వజాత్యుద్ధరణకి పూనుకున్నారు. ఈ హరిజనుల సమస్యల్ని పరిష్కరించడానికి స్త్రీలు ముందుకు రావాలని ఈ విషయంలో స్త్రీలు పూనుకొని చేయాల్సింది చాలా వుందని 1943 ప్రాంతాల్లో హిందూ సుందరి పత్రిక అభ్యర్థించింది.[13] సంఘసంస్కర్తలంతా సాధారణంగా బ్రాహ్మణ కులానికి చెందిన వారే కావడంతో వీరిలో శాఖా భేదాలు సమసి ఐక్యమత్యం సాధించాలని, అప్పుడే వారు దేశాభ్యుదయానికి పాటుపడగలరని, బ్రాహ్మణ కులంలో జరగవలసిన సంస్కరణ గురించిన చర్చలు నాడు సాగుతుండేవి.[14] 19-20 శతాబ్దాల నడుమ కాలంలో

1850-1920) దేశంలో అనేక రకాల మార్పులు సంభవించాయి. రైల్వేలు, ంతి తపాల వంటి ఆధునిక సౌకర్యాలన్నీ ప్రవేశపెట్టబడ్డాయి.

ఒక సమాజ స్థితిని అంచనా వేసేప్పుడు మర్చిపోలేని అంశం ఆనాటి కుటుంబ వ్యవస్థ. ఆంగ్లేయులు ఈ దేశంలో పరిపాలన ప్రారంభించే నాటికి మనది నిశ్శంసయంగా సమష్టి కుటుంబ వ్యవస్థే! అయితే క్రమంగా ఆ వ్యవస్థలో మార్పులు రాసాగాయి. సమష్టి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమై వ్యష్టి కుటుంబా లేర్పడాలనే తలంపు పొడసూపింది.15 సమష్టి కుటుంబ వ్యవస్థలో ఏ విధమైన ఇబ్బందులు ఉండేవో కందుకూరి, చిలకమర్తి మొదలైన వారి ఆత్మ చరిత్రల వల్ల తెలుస్తుంది.16 సమష్టి కుటుంబ వ్యవస్థలో మార్పు రావడానికి కూడా చాలవరకు ఆర్థిక కారణాలు, కొంత వరకు భావజాల సంబంధమైనవి. కుటుంబంలోని అన్నదమ్ముల్లో కొందరు సంపాదించే వారు, కొందరు ఇంట్లో కూర్చునే వారు అయినప్పుడు మనస్పర్థలు రావడం అతి సహజం. ఒక్క మాటలో చెప్పాలంటే సమష్టి కుటుంబ వ్యవస్థ శిథిలం కావ డానికి ఉద్యోగ జీవితాలు కూడా ఒక ప్రధాన కారణం. అంతేకాదు. ఒకే కుటుంబంలో పాశ్చాత్య విద్య నభ్యసించిన వారు సంప్రదాయక విద్య నభ్య సించిన వారు ఉన్నప్పుడు కూడా వారి మధ్య వాభాల్లో భిన్నత్వం పొడసూపి కత్ఫలితంగా కలహాలు తలెత్తేవి. ఈ కలహాలు వేరు కాపురాలకి దారితీసేవి.

> "సంస్కర్త సమిష్టి కుటుంబ జీవితమును త్యజించినగాఁని అతనికి సతికిని బొత్తిగ లియదనియు, భార్యాభర్తలకు బాహాటముగా సంభాషణములు జరుగుట కవకాశ మేర్పడినగాని సంస్కరణ విష యములందు పత్నికామోదంగలుగదనియుఁ నా నిశ్చితాభిప్రాయము.... సంస్కరణోద్యమ విధులననుసరించి నదువ గోరితిమేని హిందూ సంఘ దురాచారములకెల్ల మూలకందమగు సమష్టి కుటుంబ జీవిత మున కొడంబడక, భార్య కాపురమునకు వచ్చినది మొదలు వేరుగ నుండ ప్రథమ కర్తవ్యమని మేము నిర్ధారించుకొంటిమి".17

ఈ విధమైన భావాలు సర్వత్ర వ్యాపించి క్రమంగా హిందూ సమాజ మూల వ్యవస్థ అయిన సమష్టి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమై క్రమంగా వ్యష్టి కుటుంబాలేర్పడ్డాయి.

19వ శతాబ్దం వివిధ సంస్కరణలకి పుట్టినిల్లన్న సంగతి జగమెరిగిన సత్యం. హిందూమతం లోపభూయిష్ఠంగా ఉందనే భావం తలెత్తింది. తత్ఫలితంగా అనేక మత సంస్కరణలు చోటుచేసుకున్నాయి. ఆర్య సమాజం, బ్రహ్మ సమాజం, దివ్యజ్ఞాన సమాజం వంటి నూత్న ఆధ్యాత్మిక మార్గాలేర్పడ్డాయి. వీటిలో ఆర్యసమాజానికి, బ్రహ్మసమాజానికి దేశవ్యాప్తంగా ఆ మతశాఖలేర్పడి ప్రజల్ని చైతన్యవంతం చేశాయి. నాటి హిందూ మతం బాగా సంకుచితంగా ఉండేది. మత సంప్రదాయాలకు ఏ మాత్రం భిన్నంగా వెళ్ళినా మతగురువుల్నించి సంఘ బహిష్కార, మత బహిష్కార ఆదేశాలొచ్చేవి. ఇటువంటి బహిష్కారాల్ని మన సంఘ సంస్కర్తలందరూ ఏదో సమయంలో ఎదుర్కొన్నవారే.[18] ఎందరో హిందువులు తమ మతంలో సరిపెట్టుకోలేక ముస్లిం, క్రైస్తవ మతాల్లోకి మారడం నాడు కనిపిస్తుంది. 'సర్వమానవ సమానత్వం' అని ప్రచారంచేసే క్రైస్తమతం ప్రజల్ని ఎంతగానో ఆకర్షించింది. ఈ మార్పుకి కేవలం క్రైస్తవ మతంలోని సర్వమానవ సమానత్వ సిద్ధాంతమేకాక ఆర్థికపరమైన కారణాలుకూడా ఉన్నాయి. హిందూ మతంలోని కింది కులాలవాళ్ళు తరచు క్రైస్తవులుగా మారిపోతుండేవారు. కేవలం కింది కులాలవాళ్ళేకాక ఉన్నత కులంగా పరిగణించబడుతున్న బ్రాహ్మణులు కూడా క్రైస్తవ మతంలోకి మారినట్లు తెలుస్తుంది.[19] అర్థం లేని మంత్రతంత్రాలకి ప్రచారం విపరీతంగా ఉండేది. దయ్యాలు మొదలైన వాటిని గూర్చిన చర్చలు సర్వసామాన్యంగా జరిగేవి. జాతకాలకి, శకునాలకి, ముహూర్తాలకి మంచి రోజులకి విపరీతమైన గిరాకీ ఉండేది. వీటన్నిటి ఆధారంగా ప్రజల్ని మభ్యపెట్టి పబ్బం గడుపుకొనే బైరాగుల, సాధువుల పని బాగుండేది.

ఇక 19వ శతాబ్దపు వివాహ వ్యవస్థ అనేక విధాలుగా లోపభూయిష్ఠంగా ఉండేది. వివాహానికి వయస్సు ఒక ఆటంకం కాదు. 60, 70 సం॥ల వృద్ధులకి 6, 7 సం॥ల బాలికలకి తరచూ వివాహాలు జరుగుతుండేవి. 'అష్టవర్షాద్భవేద్కన్యా' అనే సూత్రంతో ఆడపిల్లకి 8 సంవత్సరాలకల్లా వివాహం జరగకపోతే అది క్షమించరాని తప్పుగా భావించబడేది. వివాహ విషయంలో వధూవరుల ఇష్టాయిష్టాలకంటె, వధువు తండ్రి ధనాశకి ఎక్కువ

ప్రాముఖ్యం ఉండేది. ఎవరు ఎక్కువ 'శుల్కం' ఇస్తే వారికి తమ పిల్లని అంటగట్టేవారు.20 బాల్యవివాహాలు తత్ఫలితంగా బాలవితంతువులు ఇంటి కొక్కరైనా ఉండేవారు. తల్లి దండ్రులు తాము పెద్దవాళ్ళమయ్యామనో, తమ పెద్దవాళ్ళు పిల్లల పెళ్ళిళ్ళు చూడాలనో లేక పైపిల్ల పెళ్ళి చేస్తున్నాం కాబట్టి ఇంకో పిల్లది కూడా చేసేస్తే ఖర్చులో ఖర్చు కలిసివస్తుందనో, వరుడు బాగా ఆస్తిపరుడు, ఆ సంబంధం తప్పిపోతుందనో తరచుగా బాల్యవివాహాలు జరిపించేవారు.21

ఈ కన్యాశుల్కం బాధ ఇప్పటి సమాజంలో వరకట్నాల బాధకంటే ఏ మాత్రం భిన్నమైంది కాదు. అయితే అప్పుడు కన్యాశుల్కం తీసుకొని పిల్ల తండ్రి డబ్బు సంపాదిస్తే పిల్ల వితంతువు కావడమో, కష్టపడడమో జరిగేది. ఈరోజు వరకట్నాలవల్ల పిల్ల తండ్రి ఆర్థికంగా చితికిపోవడమూ ఆడపిల్ల జీవితానికి రక్షణ లేకుండా పోవడమూ జరుగుతోంది! ఈనాడు వరకట్న దురాచారం సమసిపోవాలంటే ఆడవాళ్ళంతా ఏరకంగా తిరుగుబాటు చెయ్యాలని వాపిస్తున్నారో, సరిగ్గా అందుకు భిన్నంగా ఆనాడు భావించారు.

"ఒకనికి నలుగురు కన్యలు పుట్టిరేని
శ్రీమంతుడగు చున్నాడు. ఒకనికి నలుగురు
మగబిడ్డలు పుట్టిరేని వాడు దరిద్రుఁ
డగుచున్నాడు ... వివాహం పురుషున
కెట్లావశ్యకమో స్త్రీకి నావశ్యకమే
కదా స్త్రీకిం గ్రయము గొనుట న్యాయము
గా నుండెనేని పురుషునకైనను
గన్య యింటివాని యొద్దఁ గ్రయముం
గొనుట న్యాయమే కదా, వివాహము
పురుషునకంటెను స్త్రీకి నగత్యముగాను
అనివార్యముగా నున్నయది''.22

కన్యాశుల్కం విలయతాండవం చేస్తున్న రోజుల్లోనే 'వరశుల్కం' మొదలైంది. ఈ వరశుల్క పద్ధతికి ఓరకంగా ఇంగ్లీషు చదువులే కారణం అని చెప్పవచ్చు. ఇంగ్లీషు విద్య నభ్యసించిన తమ కొడుకులు ఉద్యోగాలు చేస్తారు కాబట్టి వాళ్ళకి ఆడపిల్లవాళ్ళు డబ్బు యివ్వాలనే పద్ధతి క్రమంగా అమల్లోకి వచ్చింది. తమ పిల్లకి 'చదువుకున్న పడుచు మొగుడు' కావాలంటె తల్లి దండ్రులు వరశుల్కం చెల్లించాల్సి వచ్చేది!

"అది యేమి పాపమో కాని మన
దేశములో విద్య విషమగుచున్నది.
చదువుకున్నవారే వరశుల్కము
సంపాదించి బాగుపడవలెనను
చున్నారు. నాల్గక్షరము లబ్బిన
నాల్గువందల రూప్యము లిచ్చినగాని
పెండ్లి యాడమని తిరస్కరించు
చున్నారు''.23

ఈ విధంగా వివాహ సమయంలోని ధనమార్పిడి విషయంలో మార్పు సంభవించింది. వివాహ వ్యవస్థ ఒక విధంగా సర్వరోగ పీడితగా తయార యింది. ఆ వ్యవస్థ అంతరించి అందులోంచి నూతన వివాహ వ్యవస్థ పుట్టా లనే సంచలనం సమాజంలో విపరీతంగా బయలేరింది. అయితే ఎన్నో సంస్క రణల అనంతరం ఎంతో మంచి జరిగినా, నాటి ఇంగ్లీషు విద్యా ఫలితంగా నేమి మరేవిధంగానేమి మొదలైన వరకట్నం యువతికి శాపంగా తయార యింది. ఆనాడు వివాహాల్లో అధిక ఖర్చులు, భోగంమేళాల వంటివి దురాచా రాలని భావించబడ్డాయి. అధిక ఖర్చులు నేటి వివాహాలే అధిగమించలేక పోతున్నాయి.

నాటి సమాజంలో నూత్న ఉద్యోగి బృందం తయారయింది. రెండు భిన్న సంస్కృతుల మధ్య ఘర్షణ ప్రారంభమయింది. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల సమన్వయవాదులు కొందరు బయలేరారు. వారే సంస్కర్తలు.

ఇంత వరకు రాసిన పరిస్థితులు సాధారణంగా సమాజానికంతటికి సంబం ధించినవి. సమాజంలో సగభాగమైన 'స్త్రీ'ల స్థితి ఆనాడు ఏ విధంగా వుండే దనే విషయం గురించి అన్ని రంగాల్లోంచి కొంచెం విపులంగా చూడటం జరుగుతుంది.

''మన దేశమునందు స్త్రీలను బరిచారికలవలెను,

మృగములవలెను ప్రవర్తింపఁజేయుట

మిగుల పరితపింపఁ దగిన విషయముగా

నున్నది గదా, కులమును, సంపదయు నెంత

యెక్కుడో యంతకంటె స్త్రీల దౌర్భాగ్య

మెక్కుడుగా నున్నది''.24

ఇది ఆనాటి స్త్రీల పరిస్థితి. ఇది అతిశయోక్తి కాదు. ఎక్కడో ఒక రిద్దరు తప్ప సాధారణంగా స్త్రీ లోకం ఇదే పరిస్థితిలో వుంది. అన్ని మూఢా చారాలకి, మూర్ఖత్వానికి స్త్రీ పుట్టినిల్లుగా ఉండేది.25 బయటి ప్రపంచంతో ఆమెకి ఏ మాత్రం సంబంధం లేదు, అయితే స్త్రీ ఈ పరిస్థితికి కారణం 'విద్యా విహీనతే' అని అభిప్రాయం కొందరు మేధావుల్లో ఏర్పడింది.

"మన దేశమునందలి యబలలు పరమ

పురుషార్థ ప్రదంబగు విద్య లేమింజేసి

యజ్ఞానాంధకారంబున మునిగి దెస

గానక తడబడుచుండెదరనుట యందఱికిని

దెలిసిన విషయంబు గదా''.26

ఇది నాడు సామాజికంగా స్త్రీపట్ల ఉన్న భావం. ఆమెను అదుపులో వుంచాలన్న భావం కూడా సర్వత్రా వ్యాపించి వుంది. సాంఘిక విప్లవవాది, తత్వజ్ఞాని అయిన వేమనలాంటివాడే "స్త్రీలు పాపానికి మూలమని, నమ్మ రాని వాళ్ళని భావించాడు, స్త్రీని అదుపులో పెట్టాలట. స్త్రీల చర్యలకు కఠి నంగా హద్దులు విధించాలట. సంస్కరణవాదపు ఉన్నత పీఠం నుండి ఆయన

పతనమైంది యిక్కడే అని చెప్తూ ఎంతైనా స్త్రీల యథాస్థితి వాదానికి కారణం వాళ్ళ వెనుకబాటుతనంవల్ల కలిగిన అజ్ఞానమే. దానికి ఎక్కువగా బాధ్యులు పురుషులే''27 అంటారు రామకృష్ణగారు. స్త్రీలను వెనక్కి తొయ్యాల్సిన అవసరం సామాజికంగా పురుషుడికి ఎందుకు కలిగింది? ఎప్పుడు కలిగింది? అనేది చరిత్రను వేధిస్తున్న ప్రశ్న. ఈప్రశ్నకు సమాధానం అంత సులభంగా దొరకదు. సామాజిక పరిస్థితులకి అనుగుణంగా వివిధ రకాల వ్యక్తుల సమూహాలు ఏర్పడుతుంటాయి. ముఖ్యంగా నాటి స్త్రీ జాతిని రెండు రకాలుగా విభజించవచ్చు.28

(1) కుటుంబ వ్యవస్థలో ఉన్న స్త్రీలు.

(2) కుటుంబ వ్యవస్థకి సంబంధంలేని స్త్రీలు.

వీరిలో మొదటి వర్గం స్త్రీలకు సాధారణంగా సమాజంతో ఏమాత్రం సంబంధం ఉండేది కాదు. రెండోవర్గం స్త్రీలు సమాజానికంతటికి ఉమ్మడిసొత్తు. వారికి సమాజంలో గౌరవం లేదు, కాని వారిని పోషించేవారికి సమాజంలో గౌరవం ఉండేది. కుటుంబ వ్యవస్థతో సంబంధం ఉన్న స్త్రీకి 'గృహిణి', భార్య, ఇల్లాలు వంటివి పర్యాయ పదాలైతే రెండో తరహా స్త్రీలకి 'దేవదాసి', వేశ్య, వెలయాలు వంటివి పర్యాయ పదాలు. ఒక్కొక్క పురుషుడు ఎంత మంది వేశ్యల్ని పోషిస్తే అతడికి అంత గౌరవం ఉండేది. అయితే దీనివల్ల కుటుంబవ్యవస్థ దెబ్బతినే ప్రమాదం కలుగడంతో ఈ వేశ్యల్ని సమాజం నిరసించ సాగింది. వారి మనుగడకి ముప్పు వాటిల్లింది. క్రమంగా ఆవ్యవస్థ మానిపోసాగింది. సామినీనముద్దు నరసింహ-నాయుడు ''స్త్రీలకు విద్యలు సార్థకములగుచున్నవి'' అని తమ హితసూచనిని ప్రారంభించారు. నిజమే. 19వ శతాబ్ది పూర్వార్థానికే స్త్రీవిద్యకి సోపానాలేర్పడ్డాయి. అయితే మొదట్లో చదువు గురించి ఆలోచించింది చదువును ప్రారంభించింది వేశ్యావ్యవస్థలోని స్త్రీలు.

"ప్రభుత్వంవారు నడిపే బళ్ళలో భోగంవాళ్ళ ఆడపిల్లలు చదువుతారు మరి ఇతరత్రా ఆడపిల్లలు పాఠశాలలకుపోరు. భోగంవారి ఆడపిల్లలు చదువనూ, రాయనూ నేర్చుకోవడం ఒక విధంగా తప్పని

> సరి. కచేరీలలో అభినయించవలసిన పాటలు, పదాలు, వాళ్ళు కంఠో
> పాఠం చేయవలసి వుంటుంది''.29

దీన్నిబట్టి ఒక్క ప్రభుత్వ పాఠశాలల్లోనే బాలికలకి ప్రవేశం ఉండే దనుకోవచ్చు, ఆడపిల్లలు భోగం కులాలకు చెందినవారే చదువుకోవటం గమనించాల్సిన విషయం. ఇక్కడ భోగం కులానికి చెందిన బాలికలు చదువుకోవడం ఒక విధంగా వారి వృత్తి నెరవేర్చడానికి, ఇదే లక్షణం తరువాతి స్త్రీ విద్య విషయంలో కూడా కొనసాగుతుంది. ఏ విధంగానంటే భోగం స్త్రీలు పాటలు, పద్యాలు కంఠస్థం చేయడానికి చదివితే, ఇతర వర్ణాల స్త్రీలు తమ గృహ నిర్వాహణలో చాకలి పద్దులు, మొదలైనవి చూడటానికి అవసరమైన విద్య నేర్చుకొనేవారు. ఏ కాలంలోనైనా విద్య స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి కాక తప్పనిసరి పరిస్థితుల్లో మరో ప్రయోజనానికి అనుగుణంగా సాగేదన్నమాట.

> ''స్త్రీజాతి కెవరెవరి మర్యాదకున్ను, స్థితికిన్ని అనుకూలమని తోచిన మట్టుకు విద్య చెప్పించవచ్చును. సాధ్యమైనంతవరకు గ్రంథములు స్త్రీలున్ను చదువుటకు లాయఖుగా నుండేలాగు రచించబడవలసినది''.30

స్త్రీలకి వారివారి మర్యాదకు, స్థితికి అనుకూలమైన విద్య చెప్పించాలనడం స్త్రీ లందరి అవసరాలు ఒకరకమైనవి కావనే విషయం స్పష్టం చేస్తోంది. భోగంకుల స్త్రీలు పద్యాలు, పాటలుపాడే స్థాయిలో చదువుకోవలసివస్తే, సామాన్య గృహిణి చాకలి పద్దులు చూసే స్థాయి చదువు నేర్చితేచాలు. ఇదీ ఆనాటికి స్త్రీ విద్యా పరంగా జరుగుతున్న ఆలోచన. క్రమంగా సమాజంలో స్త్రీ విద్యకి సంబంధించిన చర్చలు ఎక్కువ కాసాగాయి. విద్య లేకపోవడంవలన స్త్రీలు కుటుంబంలో అశాంతికి కారణమౌతున్నారని, సంసార యాత్ర సాఫీగా సాగిపోవడానికి స్త్రీ కూడా విద్యావంతురాలు కావాల భావం నాడు సాధారణంగా వెల్లడయ్యేది. అయితే స్త్రీలకు చదువెందు చదువుకొని ఊళ్ళేలాలా! ఉద్యోగాలు చెయ్యాలా! వంటి భావాలు చ మందికి ఉండేవి. ఉద్యోగం చెయ్యలేకపోయినా, భర్తకు అనుకూలంగా

కోవడానికైనా స్త్రీకి విద్య అవసరం అనే భావం వ్యాపించింది. బహుశా దీనిని కూడా పురుషుల ఆంగ్ల విద్యాభ్యాసమే కారణమని చెప్పవచ్చునేమో ఇంతకు ముందు మన సంఘంలో పురుషులు సంప్రదాయకమైన విద్య నభ్యసించినప్పటికి ప్రత్యేకమైన ఉద్యోగాలు లేకపోవటంతో ఇంటి పట్టునే వుండి ఇంటి వ్యవహారాలు చూసుకొనేవారు. ఆంగ్ల విద్యా ప్రభావంలో మగవాళ్ళు ఉద్యోగాలకి వెళ్ళవలసివచ్చినప్పుడు ఇంట్లో రోజువారి లెక్కలు, చాకలి పద్దులు మొదలైనవి చూడటం స్త్రీకి తప్పనిసరి అయింది. ఆ విధమైన పనులు చెయ్యడానికి ఆవిడకి విద్య అవసరమైంది. అటువంటి పనులు కూడా సక్రమంగా నిర్వహించలేని స్థితి నుంచి పైకి తీసుకువచ్చే ప్రయత్నమే స్త్రీ విద్యారంభం.

నాడు స్త్రీకి విద్య నేర్పించాలని ఎంతగా కాంక్షిస్తున్నారో, మరో వైపు నుంచి విద్య నేర్చిన స్త్రీ కట్టుబాట్లని ఎక్కడ దాటుతుందోనని అంతగా భయపడుతున్నారు.

> "స్త్రీవలన గలుగు పనులకొలకు వారి నుపయోగించుచు సాధ్యమైనంతమట్టుకు వారికి దూరముగా నుండవలయును''.31

స్త్రీ చదువుకున్నా, ఆమెని ఉంచవలసిన చోటనే వుంచాలి. ఆవిడకి మరీ స్వేచ్ఛ ఇవ్వకూడదు, సాధ్యమైనంత అదుపులో వుంచాలి! స్త్రీలతో పురుషులు సంభాషణలు సాగిస్తే వారు తమ సహజమైన సిగ్గుని విడిచి పెడతారనే భావం కూడా వ్యాపించి ఉండేది.

> ''సుదతులతోడి సద్గోష్ఠి సమంజసమే, కాని వారు చెంత నుండినపుడు మృదువు మీఱిన పలుకులు పురుషుల పెదవుల నుండి వెడలినచో రాను రాను స్త్రీలను తమ నైసర్గికమగు సిగ్గును విడనాడి వెలయాండ్ర వలె వలపుగొలుపు పలుకులు వంచించుటకు వెనుదీయరు.''32

సంఘసంస్కరణ పేరుతో స్త్రీ జనోద్ధరణకు నడుంకట్టిన పెద్ద మనుషుల భావాలివి. స్త్రీల నుద్ధరిస్తారు గానీ స్వేచ్ఛ నివ్వరు. స్త్రీలు తమ అధిపత్యం లోంచి బయటకు పోని విధంగా వారిని సంస్కరిస్తారు. అంటే విద్య లేకుండా

వంటింటికి అంకితమైన స్త్రీకి విద్య నేర్పి తమ భార్యలు కూడా చదువుకున్న వారే, ఎంత చదువుకున్నా వారిని తమ అజమాయిషీలో ఉంచగలుగుతున్నాం. మా ఆడవాళ్ళని చదివిస్తున్నాం అని గొప్పగా చాటుకోవడానికే తప్ప నిజంగా స్త్రీని స్వతంత్ర వ్యక్తిగా తయారుచేయటం వారి ఉద్దేశ్యం కాదు. స్త్రీ జనోద్ధరణ జరుగుతోంది కాని అది పురుష మతాభి గుణంగా జరగాలి. సంస్కరణల్లో పురుషులు తాము ప్రముఖ స్థానం వహించాలి కాని స్త్రీలకి ఆ విషయాలేవి తెలియక్కర్లేదు. ఎవరైన స్త్రీలతో అటువంటి విషయాలు చర్చిస్తే స్త్రీలు ఎక్కడ బరితెగిస్తారోననే భయం సంస్కర్తలకి అణువణువునా ఉండేది.

అయితే దేశంలో మారుతున్న పరిస్థితులు రూపుదిద్దుకొంటున్న నూతన నాగరికత సహజంగా స్త్రీ పురుషుల మధ్య ఉండే అభిప్రాయ భేదాల్ని మరింతగా పెంచసాగాయి. స్త్రీ తన పరిస్థితిని ప్రశ్నించడం మొదలుపెట్టింది. తత్ఫలితంగా గృహ కలహాలు అధికం కాసాగాయి. ఈ పరిస్థితిని అతిక్రమించడానికి కూడా స్త్రీ విద్య అవసరమైంది. ఆంగ్ల విద్యాభ్యాసం చేసిన భర్తకి అనుగుణమైన భార్యగా తయారుకావడానికి స్త్రీకి కూడా విద్య అవసరమైంది.

స్త్రీ పురుషులిరువురిలోనూ పురుషుడు శారీరకంగానూ, మానసికంగానూ ఉన్నతుడు కావడం వలన స్త్రీ ఎట్టి పరిస్థితుల్లోను అతడికి వ్యతిరేకంగా ప్రవర్తించకూడదని, ఆవిడ నూటికి నూరు పాళ్ళు భర్త అడుగు జాడల్లో నడవాలని, భర్త మంచివాడు కాకపోయినా, అతడ్ని సరిదిద్దుకొనే ప్రయత్నంతో జీవితమంతా గడపాలనీ లదే ఆడవాళ్ళకి పరమార్థం అనే భావాలు అంతట వ్యాపించి వున్నాయి.[33] ఆంగ్లేయ నాగరికత ననుసరించి, స్త్రీ పురుషులు కలిసి మాట్లాడుకోవడం, స్నేహం చేయడం వంటివి తప్పుకాదనీ ఆచరణీయమని సమాజంలో కొంతమంది ఆలోచించటం మొదలుపెట్టారు అయితే అది ఆంగ్లేయులకే కానీ హిందూ సంప్రదాయానికి ఎంత మాత్రం పనికి రాదు. స్త్రీ పురుషులు పరస్పరం స్నేహం చేయడం లాంటి భావాలు నింద్యంగా తలచబడేవి. ఆనాటి స్త్రీలు, పురుషులు తమతో సమానంగా చూడగలిగే స్థితిలో లేరని, వారిని ఆంగ్లేయ స్త్రీలలాగా స్వేచ్ఛగా వదిలేయడానికి వీలులేదని తలిచేవారు.[34]

అయితే సంఘంలో అంతర్గతంగా వస్తున్న మార్పులు, బాహ్య ప్రపంచానికి దూరంగా ఉన్న స్త్రీలపై ప్రభావం చూపాయి. ఇంటినే అంటిపెట్టుకొని ఉన్న స్త్రీలో ఒక విధమైన ఆందోళన, ఆలోచన రేకెత్తాయి. అవి గృహ కలహాల రూపంలో బయటపడేవి. ఈ పరిస్థితిని మార్చడానికి స్త్రీకి సంసారానికంటె భిన్నమైన వ్యాపకం, బాహ్య ప్రపంచంతో పరిచయం చేయడం మంచిదనే భావంతో స్త్రీ విద్యకి ప్రోత్సాహం లభించింది. సంసార జీవితం సుఖప్రదం కావాలంటే స్త్రీల సహకారం అత్యంతావశ్యకం. స్త్రీ రోజంతా పరిమితమైన సంసార జీవితం గురించే ఆలోచించడం వలన ఆమె తన చుట్టు పక్కల వాళ్ళల్లో తప్పులు పట్టే స్వభావాన్ని పెంపొందించుకొని గృహ కలహాల్ని తరచుగా కలిగిస్తుండేది. స్త్రీ విద్య గృహ వాతావరణాన్ని సౌఖ్యదాయకం చేయడానికే గానీ, ఆమె వ్యక్తిత్వ వికాసానికి మాత్రం కాదు.

19వ శతాబ్ది సంస్కర్తలు, స్త్రీ జనోద్ధారకులంతా స్త్రీలందరి మౌఢ్యం అజ్ఞానం తొలగించాలని ప్రయత్నించారే కానీ అవిడకి ఆ విధమైన మౌఢ్యం, అజ్ఞానం కలగడానికి కారకులెవరో ఆలోచించలేదు. (ఆలోచించినా పట్టించుకోలేదు). ఆ పరిస్థితుల్లో నిజానికి స్త్రీకి విద్య నేర్పడంతో పాటు స్త్రీని పాద దాసిగా చూసే పురుషులకి ప్రత్యేక శిక్షణ ఇచ్చి స్త్రీ పట్ల వారి దృక్పథం మారేట్లు చేస్తే బాగుండేదేమో పురుషస్వామ్య సమాజం అపని చెయ్యగలదా ? సంస్కర్తలంతా స్త్రీని విద్యావతియైన గృహిణిగా చెయ్యాలనుకున్నారే గానీ: 'స్వతంత్ర వ్యక్తి'గా చేయాలనుకోలేదు.

మొత్తం మీద ఏ పరిస్థితుల్లో నాటబడితేనేమి స్త్రీ విద్యా బీజం మొలకెత్తి స్వయంపోషకంగా తయారయింది. అయితే చాలా కాలం వరకు స్త్రీ విద్య గృహ సంబంధమైన విద్యగానే ఉంటూ వచ్చింది. క్రమంగా స్త్రీ విద్యలో అనేక మార్పులు వచ్చి 1947 నాటికి స్త్రీ పురుషులిరువురికి సమాన విద్యావకాశాలు కలిగించాయి.

> ''ఇటుల స్త్రీ విద్య స్వాతంత్ర్యము అంధ్రదేశములో వృద్ధి చెందుచున్నది. ఆంధ్ర స్త్రీలు మేల్కొని తమ హక్కులను బాధ్యతలను గుర్తించుచున్నారు.''35

స్త్రీలలో వస్తున్న చైతన్యం వ్యక్తిత్వ వికాసాలను వీరు గుర్తించారు. సహజంగా స్త్రీ జాతిలో జాగృతి లేకపోతే ఎందరు సంస్కర్తలు ఎంతపాటు పడినా స్త్రీ విద్య, పునర్వివాహాల వంటివి సాధించకపోయేవారు. ఒక రకంగా చెప్పాలంటే స్త్రీ అభ్యున్నతికి స్త్రీలలో వచ్చిన జాగృతి కూడా ఒక కారణం స్త్రీలలో జాగృతికి కలిగించింది పురుషులే కదా! అనే వాదానికి పురుషులు నాటి స్త్రీ నిరాశ నిస్పృహలోంచి తిరుగుబాటు చెయ్యకుండా ఆమెను సమన్వయ పరిచారు. విద్యావంతులైన స్త్రీలు తమ హక్కుల్ని ప్రశ్నించడం మొదలు పెట్టారు. స్త్రీ పురుషులిరువురికి వేరువేరు విద్య ఎందుకని ప్రశ్నించారు. స్త్రీ నేర్చుకోవలసిన విద్య ఆమె స్థితిగతుల కనుగుణంగా నేర్చుకోవాలి. గానీ స్త్రీలందరికి కూడా ఒకరకమైన విద్య నేర్పాలనే ప్రతిపాదన ఖండించారు. స్త్రీ పురుషులిరువురి మేధాశక్తిలోనూ తేడా లేదని, పురుషులు నేర్చదగిన విద్యలన్నీ స్త్రీలు కూడా నేర్చుకోగలరనే విశ్వాసం స్త్రీలలో ప్రబలింది.[36]

క్రమంగా స్త్రీలలో మరో వర్గం బయల్దేరింది. వారు కుటుంబ వ్యవస్థ లోనే వుంటూ విప్లవాత్మకమైన భావాలు కలిగి ఉన్నవారు. వీరికి సమాజంలో గౌరవం ఉండేది. వీరు కుటుంబ వ్యవస్థలో వుంటూనే తమ పరిస్థితిలో మార్పు తేవాలని తాపత్రయపడ్డారు. ఒక విధంగా వారు తమకి జరుగుతున్న అన్యాయాన్ని గుర్తించారు.

మొదట్లో భర్తల అండదండలున్న స్త్రీలే చదువులు ప్రారంభించినా క్రమంగా స్త్రీ విద్య స్త్రీలని ఆర్థికంగా స్వతంత్రుల్ని చేసేదిగా కూడా తయారయింది. ఇళ్ళల్లో దుర్భర జీవితాన్ని గడుపుతున్న వితంతువరంగా స్త్రీ విద్య విస్తరించబడింది. అది వారికి జీవనోపాధి చూపించింది. విస్తృతమైన స్త్రీ విద్య తర్వాత, తర్వాత స్వతంత్ర పోరాటంలో ప్రముఖ పాత్ర వహించే దిగా చేసింది.

ఇది ఒక విధంగా కుల స్త్రీలకి సంబంధించిన సమాచారం. సమాజంలో మరో వర్గం స్త్రీలు పరాధీనలుకాక స్వయం సంపాదనా పరులు, వారి సంపాదన సమాజం హర్షించే రీతిలో జరిగేది కాదు. వారు నృత్య గానాదుల ద్వారా కళాపోషణ చేసినా, 'వ్యభిచారమనే' వారి వృత్తి సంఘంలో వారిని నీచులుగా పరిగణించేది. వారిది ప్రత్యేకమైన కులం. సమాజంలో కొందరు

స్త్రీలు ఆ విధంగా తయారుకావడానికి కారణం నిస్సంశయంగా కొందరు పురుషుల స్వార్థ ప్రయోగమే! మొదట్లో ఈ వ్యవస్థ ఏ విధంగా మొదలైనా, రాను రాను వారి మీద 'దేవదాసి'లనే ముద్రవేసి వారిలోంచి ఒక ఉపవర్గాన్ని తయారుచేశారు. 'దేవదాసి'లు దేవుని భార్యలు, వారు దేవాలయం ఆస్తి. వేశ్యలు సాధారణంగా సమాజానికంతటికి సంబంధించిన వారు. వీరు ఉగ్గుపాలతో వ్యభిచార ప్రవృత్తిని రంగరించుకొని పెరిగి, పురుషుల్ని ఏ విధంగా తమవైపు ఆకర్షించుకోవాలో బాగా తెలిసి వుండేవారు. వివాహాది శుభకార్యాల్లో వేశ్యాకాంతల ఆట పాటలు ప్రత్యేక ఆకర్షణ, ఎవరి తాహతుకు తగినట్టు వారు ఏర్పాట్లు చేసేవారు. నాడు సంస్కర్తలుగా పిలవబడ్డవారంతా వివాహాల్లో వీరి ప్రమేయాన్ని నిరసించారు. వీరు సంఘానికి చీడపురుగులని వీరిని బహిష్కరించాలని వాదించేవారు.37

వీరు సంఘానికి విలాస వస్తువులుగా ఉపయోగించినంతకాలం వీరి పని జోరుగా ఉండేది. తరువాత వీరిని చూసే అంద వుండేది కాదు. వీరికి సాధారణంగా సంతానం ఉండేది కాదు. అయితే వీరు అనాథ పిల్లల్ని దత్తత చేసుకోవడం జరిగేది. ఆడపిల్లల్ని దత్తత చేసుకోవడం అనేది ఈ కులంలో తప్ప సాధారణంగా సమాజంలో ఎక్కడా కనిపించదు.

> ''వేశ్యకులములోని స్త్రీలనేకులితర కులములలో నుండి పిల్లలను దీసికొందురు. ఆ కులములో బుట్టిన వారికనేకులకు వ్యభిచార దోషము వలన గర్భము చెడి పిల్లలు విశేషముగా బుట్టుట లేదు. అందుచేత నితర బీదల నుండి పిల్లలఁగొని పెంచి దత్తుకుమార్తెలని పేరు బెట్టెదురు. ఇతర కులములలో నార్జన జేయువారు పురుషులు, కానవారు వంశ వృద్ధికై బాలురను దత్తుచేసుకొందురు. ఈ కులములో నార్జన చేయునది స్త్రీకాన నాదాయమునకై బాలికలను గొని వారిని దత్తు చేసికొందురు.''38

వేశ్యలు తాము సంపాదించగలిగినంతకాలం సంపాదించినా తర్వాత వృద్ధాప్యంలో వారికి ఏ విధమైన సంపాదన మార్గాలు ఉండేవి కావు. అందువల్ల తమ సంపాదనతో ఆ బీదవారి పిల్లలను కొని వారిని పెంచి పెద్దచేసి

వృద్ధాప్యంలో తమకొక అండగా చేసికొనే వారని భావించవచ్చు. ఇతర కులాల వాళ్ళు తమ పిల్లల్లో ఆడపిల్లల్ని అమ్మడానికి సిద్ధంగా ఉండేవాళ్ళు. ఎందుకంటే మగ పిల్లవాడు ఎప్పటికైనా సంపాదన పడతాడు. కాకపోయి నప్పటికి వాడితో పెద్దగా బాధలేదు. వాడివల్ల ఉంటే తమకి ఉపయోగం ఉంటుంది కానీ నష్టం ఉండదు. అయితే ఆడపిల్ల సంపాదించకపోగా ఆమెకు అనేక రకాల ఎదురు ఖర్చుచెయ్యాలి. ఇటువంటి పరిస్థితుల్లోని ఇతర కులాల్లోని బీదవారు తమ ఆడ పిల్లల్ని వేశ్యలకు అమ్మేవారు.

క్రమంగా సమాజంలో వేశ్యా బహిష్కరణ ఉద్యమం ప్రబలింది. వీరిని సంఘం తీవ్రంగా నిరసించసాగింది. వీరిని ఈ వృత్తి మానమని వొత్తిడి వచ్చింది. ఈ వృత్తి మానిన వేశ్యలకి సమాజం పునరావాసం చూపించలేదు. పెద్ద మనుషులమనే ముసుగుల్లో ఉన్నవారు దొడ్డిదారిగుండా వీరిని పోషిస్తూనే వున్నారు. అయితే క్రమంగా వివాహాది శుభకార్యాల్లో వీరిపట్ల 'మోజు' తగ్గ సాగింది. వేశ్యావృత్తిని విడిచిపెట్టిన స్త్రీ భవిషత్తు ఏమిటనేది ప్రశ్నగా తయారయింది. ఈ సమస్యనే కన్యాశుల్కం నాటకంలో మధురవాణి పాత్ర ద్వారా సూచిస్తారు గురజాడ అప్పారావు గారు. మధురవాణి నిరసించబడు తోన్న వేశ్యవృత్తి ప్రతీక అయితే ఆమె సమాజాన్ని తమ మనుగడని గురించి ప్రశ్నించిన ధురీణ. వీరిపట్ల క్రమంగా సానుభూతి పొడ సూపింది.

> ''పాపం! వేశ్యలు నేటి సామాజిక వ్యవస్థలలో నున్న అవినీతి అక్ర మాలకు బలియైనవారు కాబట్టి వాళ్ళను నీచంగా చూడక జాలి చూపెట్టండని వాదించేవాడిని''.39 అన్నారు దర్శి చంచయ్యగారు.

వీరి ఆధ్వర్యంలోనే మొదలయ్యాయి కళావంతుల స్త్రీలకి వివాహాలు (కళావంతులనేది వేశ్యాకులానికి పేరు). వీరి సంస్కరణని గూర్చి ఎంత గానో ఆలోచించి, శ్రీమతి యామిని పూర్ణతిలకమ్మగారితో కలిసి ఎంత గానో కృషిచేసి కొంతవరకు విజయం సాధించారు. వేశ్యాకాంతల్ని కూడా కుల కాంతలుగా మార్చాలనే తలంపు కలిగి దానికి ఎంతగానో కృషి చేశారు.

ఇక నాటి వివాహ వ్యవస్థ స్త్రీ పాలిట శాపం! ఎందరో బాలికలు ముక్కుపచ్చలారని దశలోనే 'ఇల్లాలు' అయ్యేవారు. ముద్దు మాటలు పలికే దశలో 'వితంతు' లయ్యేవారు. కన్యాశుల్కం వితంతువుల సంఖ్య పెంచితే వరకట్నం పెళ్లికాని ఆడపిల్లల సంఖ్య పెంచింది. కన్యాశుల్కం అమల్లో ఉన్నచోట ఆడపిల్ల తండ్రి స్థితిమంతుడైతే ఆడపిల్ల కష్టపడేది. వరకట్నం వచ్చిం తర్వాత ఆడపిల్ల తండ్రి ఆర్థికంగా నలిగిపోవడమేగాక స్త్రీలకి అత్తింటి ఆరళ్ళు ఎక్కువయ్యాయి. ఇక భర్తలు చనిపోయిన స్త్రీలు నాటి సమాజంలో పెద్ద సమస్య. బాలవితంతువుల పరిస్థితి దుర్భరంగా ఉండేది. వారికి చదువు లేదు. హక్కులు లేవు. వారిని అనర్థాలకి నిలయంగా భావించే వారు. శుభకార్యాల్లో పాల్గొనే హక్కులేదు. 'జీతంలేని కూలీ' పరిస్థితి ఆమెది. ఆడపిల్లల తండ్రులు చిన్నపిల్లలనే కనికరం, మానవతా భావం కూడా లేకుండా ప్రవర్తించేవారు. ఎవరు ఎక్కువ శుల్కం ఇస్తే వారికి తమ బిడ్డలినిచ్చేవారు. వారింట్లో 'వెండిగిన్నెలో పిండితిన్నాచాలు' వంటి లోకోక్తులు నాటి ఆడపిల్లల తండ్రుల ధనాశని చాటుతాయి. భర్త చని పోయిన స్త్రీకి తిరిగి వివాహం చేసుకొనే హక్కు లేదు. ఆమె పరిస్థితి అన్ని విధాల దుర్భరంగా ఉండేది.

> "భాగములు విభజింపఁబడక యోగక్షేమముగా నుండెడు సహోదరులలో నొకఁడు చనిపోయిన పక్షమున వాని భార్య బావమఱఁదుల యొద్దను వారి పత్నుల యొద్దను అన్నవస్త్రములకై చేచాపికొని వారా నర్చెడు సకల సంకటములను సహించునట్లు సంభవించుచున్నది. ఇది యా సంకటములను సహింపనేరక బావపై జీవనాంశవ్యాజ్యమునకుఁ బ్రారంభించెనేని అది వ్యభిచారిణి యనియు, తాను విభక్తుఁడనియు స్వత్వములు స్వార్జితమనియును బావయగువాఁడు సర్వాబద్ధములగు దుష్కృతులను బ్రేలి దాని జీవనాంశమును జెఱుప ప్రయత్నము చేసెడిని, అది భగీరథ ప్రయత్నము చేసి జయపత్రిక పొందిన నేనియు నదీ నెఱవేరకుండునట్లు బావ చేసెడు తంత్రములనంతమే. ఇందుకు సాక్షులువలసియుండి నప్పుడుండెడి న్యాయాధిపతుల నడిగిన విశదముగా తెలియవచ్చును".40

వితంతువులు ప్రకృతి సహజమైన శారీరక అవసరాలని తప్పించుకో లేక, తప్పుదారి పట్టాల్సి వచ్చేది. తత్ఫలితంగా గర్భవిచ్ఛేదాలు, భ్రూణ హత్యలు తరచుగా జరిగేవి. వితంతువుల ఈ దుస్థితి కూడా నాటి సంస్కర్తల్ని కదిల్చివేసింది. స్త్రీ పతనానికి ఆమె దురవస్థకి ఎంతగానో చింతించే వారు.

> "....యారీతిగానే పురుష వియోగము నొందిన స్త్రీ బ్రతుకును మిగుల హీనమైపోవుచున్నది.....పునర్వివాహము చేయుట మహాదోషమనియు, వ్యభిచార దోషము భ్రూణధారణ దోషము, భ్రూణచ్ఛేద దోషము, శిశుహత్య మొదలగు దోషములె కారణమై సంభవించుట కాక తమ వంశపారంపర్యమువరకును మాయని యపకీర్తియుంగలుగుట దోషము కాదనియును తలంచెదు మనవారి యెన్నిక నేమన వచ్చును ?"41

సమష్టి కుటుంబంలో స్త్రీలు విపరీతంగా నలిగిపోయేవారు. చాలాసార్లు సమష్టి కుటుంబ వ్యవస్థ స్త్రీపాలిట శాపంగా తయారయింది.42

స్త్రీలని ఈ పరిస్థితి నుంచి బయటపడేయాలనే తపన కొందరు మేధావుల్లో బయల్దేరింది. వారు స్త్రీ చదువుకోవాలని, బాల్యవివాహాలు చెయ్యకూడదని వితంతు పునర్వివాహాలు చెయ్యాలని వాదించసాగారు. వితంతు పునర్వివాహం అనే భావం హితసూచని (1856) కాలానికే ఏర్పడినా దాని ఆచరణ మాత్రం 1881 వరకు సాధ్యం కాలేదు. వీరేశలింగం పంతులువంటివారు ఈ సంస్కరణని ఉద్యమ రూపంగా మొదలుపెట్టినా, వితంతువులంతా పెళ్లికి సిద్ధమయ్యారనడానికి వీల్లేదు. దానికి ఆర్థికపరమైన కారణాలు ముఖ్యం.

> "వితంతువులు చాలా మంది వివాహాలు చేసుకోవడం లేదు. అందుకు ముఖ్యంగా ఒక కారణం తెలిసింది. వివాహాలకు ఆర్థిక పరిస్థితులకు దగ్గర సంబంధం వుంది. వివాహం నిమిత్తం నా దగ్గరకు వచ్చిన వారిలో బాగా భాగ్యవంతులు గాని, నిరుపేదలు గాని లేరనే చెప్ప వచ్చు. మధ్య తరగతిలో పుట్టి పెరిగి పేద వారైన తల్లిదండ్రులు

తమ వితంతు బిడ్డలను పోషించలేక బిడ్డలచే నౌకరీ చేయించుటకు యిష్టపడని వారే పెండ్లికి సమ్మతించుచూ వచ్చారు. భర్త ఆస్తి సంక్రమించిన వితంతువుకు పునర్వివాహం జరగడం అసంభవంగా వుండేది. పెండ్లి చేసుకొంటే ఆస్తి పోతుందని పెద్ద వారి భయం. అలాంటి ఆస్తి ననుభవించే వారు విధవ కుమార్తెల చేతుల్లో ఏ పురాణాలో, శాస్త్రాలో, పెట్టి పాతివ్రత్యాన్ని గురించి హరికథలు చెప్పించి, కాశీ రామేశ్వర యాత్రలకు పంపి పునర్వివాహం మీద యిష్టం కలుగకుండా చేస్తారు. చాల బీదవారై కాయకష్టం వల్ల జీవించే తల్లిదండ్రులు తమ వితంతు కుమార్తెలచే పనులు చేయించి వారి సంపాదనతో జీవయాత్ర సాగిస్తూ తమ బ్రతుకుదెరువు పోతుందేమోనని పునర్వివాహాలకు అడ్డు పడుతుంటారు.''42

దీనినిబట్టి సంఘంలో ఎక్కువగా ఒత్తిడికి లోనయ్యేది మధ్యతరగతి వర్గం అనేది మరోసారి ఋజువైంది. మధ్య తరగతి కుటుంబాల్లో స్త్రీలలోనే చైతన్యం కూడా వచ్చింది. అర్థికపరమైన కారణాలే వ్యవస్థలోని మార్పులకి చాలావరకు కారణమనేది కూడా ఇక్కడ స్పష్టమౌతోంది. తమ కుమార్తెలని పోషించలేక, వారిచేత ఉద్యోగాలు చేయించలేకపోయిన తల్లిదండ్రులే వితంతు పునర్వివాహాలకి అంగీకరించారు.

వీటన్నిటికి ముందు మనం తరచి చూడాల్సిన విషయం మరొకటి వుంది. మన సమాజంలో సంస్కరణలన్నీ సాధారణంగా పై కులానికి సంబంధించినవే. బాల్య వివాహాలు, కన్యాశుల్కం వంటి దురాచారాలు సాధారణంగా బ్రాహ్మణుల్లోనూ, కొంతమంది వైశ్యుల్లోనూ ఉండేవి. ఇతర కులాల్లో ఈ దురాచారాలంతగా ఉన్నట్లు గోచరించదు.43 పై కులాల వాళ్ళు తాము సంఘంలో ఆదర్శవంతంగా వుండాలనే తాపత్రయంతో అర్థంలేని ఆచారాలను గుడ్డిగా పాటించేవారు. వితంతు సమస్య బ్రాహ్మణుల్లో కనిపించినంతగా ఇతర కులాల్లో కనిపించదు. తక్కువ కులాలని పిలిచే వారిలో 'మారు మనువు' పేరిట పునర్వివాహాలు కూడా జరిగేవి. దురాచారాలు ఏ వర్గంలో ప్రబలి వున్నాయో ఆ వర్గం నుంచే సంస్కర్తలు బయల్దేరారు.

ఇది స్థూలంగా నాటి స్త్రీల పరిస్థితి ఆమె ఆర్థికంగా హక్కులేని, అస్వతంత్రురాలు, ఆర్థిక స్తోమత, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్న స్త్రీలకి (వేశ్యలకి) సమాజంలో గౌరవం లేదు. స్త్రీ విద్య నేర్చి సంసార నిర్వహణ చక్కగా చేసుకొంటే చాలు అనే భావం ఉండేది. అయితే స్త్రీకి విద్య కావాలి అనే భావాల్లోంచి క్రమంగా స్త్రీయే స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గురించి ఆలోచించడం మొదలుపెట్టింది. తత్ఫలితంగానే మహిళా సంఘాలు ఏర్పాటుకావడం, ఏటేటా సమావేశాలు జరగడం వంటివి సంభవించాయి. క్రమంగా స్త్రీ విద్యాభివృద్ధి జరిగింది. వివాహ వ్యవస్థలో మార్పు వచ్చింది. బాల్య వివాహాలు చాల వరకు తగ్గాయి. బాల్య వివాహాలు తగ్గిన వివాహం విషయంలో వధువు అభిప్రాయాలతో సంబంధం లేదు. కన్యాశుల్కం క్రమంగా రూపుమాసిపోయి ఆ స్థానాన్ని వరకట్నాలావరించి సమాజాన్ని పీడిపిస్తున్నాయి.

విద్యావంతులైన స్త్రీలు అనేక మంది స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. ఎందరో స్త్రీలు పుస్తక రచన, పత్రికా ప్రచురణ, విద్యాలయాల నిర్వహణ వంటివి సాగించారు. అయితే ఎంతచేసినా, ఎన్ని విషయాల్లో మార్పు వచ్చినా స్త్రీ పురుషునికి అనువర్తిని, అతని అభిప్రాయానుసారంగా నడుచుకోవలసిందే అనే ప్రాథమికమైన అభిప్రాయంలో సమాజంలో మార్పులేదు. 1888-1947 వరకు స్త్రీల విషయంలో సామాజికంగా అనేకమైన మార్పులు వచ్చాయి. అయితే అంతర్గతంగా వారికి విముక్తి లేదు. స్వేచ్ఛా జీవులుగా ఉండే వేశ్యలు వారి వృత్తిని విడిచిపెట్టడంతో వారు కుల స్త్రీలకి సహచరులుగానే తయారయ్యాయి. వేశ్యావృత్తిని విడిచిపెట్టడంతోనేకాక మద్యపాన నిషేదం వంటి సాంఘిక రుగ్మతల్ని వదిలించే ప్రయత్నంలో కూడా స్త్రీలు ముందంజ వేశారు.

వివాహం స్త్రీకి ప్రతిబంధకమని చలం లాంటి మేధావులు భావించారు.44 స్త్రీ చైతన్యవంతమై తనకు తానుగా వెలికి వచ్చినా కుటుంబ వ్యవస్థ ఆమెను వెనక్కిపట్టి లాగింది. అందుకే స్త్రీ అభ్యున్నతికోసం పాటుపడిన సంస్కర్తలంతా ఆమె అభ్యుదయం కూడా కుటుంబ పరిధి దాటి పోకుండా ఉండాలనే ప్రయత్నించారు. స్త్రీ కూడా పురుషుడి లాగే సామాజిక కార్యకలాపాల్లో

పాల్గొంటే కుటుంబ వ్యవస్థ దెబ్బ తింటుంది. అందుకే స్వాతంత్ర్య సమర కాలంలో ఎందరో స్త్రీలు తమ భర్తలకి ఎంతగానో సహకరించి తాము తెర మరుగున ఉండిపోయారు. భార్య సహాయకురాలు కాకపోతే ఏ సంస్కర్తలు కూడా ఏమి చేయలేకపోయేవారు.

సామాజికంగా ఉన్న సమస్యలన్నీ ఏదో విధంగా స్త్రీని బాధించేవి. అన్ని విధాల స్త్రీ పరిస్థితి ఆందోళనకరంగా ఉందన్న సమయంలో సంస్కర్తల దృష్టిని ఆకర్షించింది. 'స్త్రీ జనోద్ధరణ' కార్యక్రమం మొదలైంది. సంస్కర్తల దృష్టి సమాజంలో ఇతర సమస్యల వైపు (హరిజనోద్ధరణ, సాతంత్ర్యోద్యమం మొ॥నవి) మళ్ళిం తర్వాత స్త్రీ జనోద్ధరణ కార్యక్రమం తెరమరుగయింది.

19వ శతాబ్దపు స్త్రీని ఏదో విధంగా సంస్కరించాలనే తపన సంస్కర్తల చేత స్త్రీలకోసం రచనలు చేయించింది. సాహిత్యం సమాజాన్ని మార్చగలదనే భావంలో నాటి సమాజంలో ప్రజల్ని విపరీతంగా ప్రభావితుల్ని చేస్తున్నది. పత్రికలు. ఈ పత్రికలు స్త్రీలు చదువలేరని, వారి స్థాయికి తగిన పత్రిక కూడా ఒకటి ఉంటే బాగుంటుందనే ఉద్దేశ్యంలో స్త్రీలకోసం ప్రత్యేకంగా పెట్టిన పత్రికలైనా స్త్రీలని విద్యపట్ల ఉన్ముఖుల్ని చేస్తాయనే ఉద్దేశ్యంతో స్త్రీల పత్రికల స్థాపన జరిగింది. స్త్రీ కుటుంబ పరిధిలో నేర్చుకోవలసినవి చాలా ఉన్నాయని ఆమె అనేక విధాల విజ్ఞాన వంతురాలు కావాలనే ఉద్దేశ్యంతో నాడు పత్రికా ప్రారంభం జరిగినట్లు ఊహించవచ్చు.

జ్ఞాపికలు

1. జె. వరలక్ష్మి "యుగయుగాల్లో భారతీయ మహిళ" పుట. 404
2. V. Ramakrishna 'Kandukuri Veeresalingam Social and Political Ideas', *Indian Historical Review* Volume VI, Page 186
3. సామినీన ముద్దు నరసింహం నాయుడు, 'హితసూచిని', పుట 167
4. హితసూచని రచయిత నాటి సమాజంలో వున్న పరిస్థితుల్ని వివరిస్తూ వాటిల్లో రావలసిన మార్పుల్ని సూచిస్తారు. ఆయన పుస్తకమంతటిని 8 ప్రమేయాలుగా విభజించి ఒక్కో ప్రమేయంలోనూ ఒక్కో అంశాన్ని చర్చించి, ఆ పరిస్థితి ఏ విధంగా సంస్కరించబడాలో సూచించారు.
5. డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' శతాబ్దాలుగా చైనాతో మనకి సాంస్కృతిక సంబంధాలున్నా కూడా వారి దగ్గర వాడుకలో ఉన్న కలము, కాగితము, సిరావంటి వాటిని మనం మహ్మదీయులు మన దేశానికి వచ్చాకనే నేర్చుకున్నామని చెప్పారు. దీన్నిబట్టి మనవారు అవసరమైతే ఎవరో నెత్తిన రుద్దితే తప్ప దేని గురించి ఆలోచించలేదని పట్టించుకోలేదని భావించవచ్చునేమో!
6. కొత్తపల్లి వీరభద్రరావు, 'తెలుగు సాహిత్యాపై ఇంగ్లీషు ప్రభావము' పుట 4
7. వెన్నెలకంటి సుబ్బారావు జీవిత యాత్ర పుట 58
8. సామినీన ముద్దు నరసింహం 'హితసూచని' పుటలు 5-8
9. కొత్తపల్లి వీరభద్రరావు, 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' పుట 391

10. నాల్గవ ఆంధ్ర మహిళా సభ ఉపన్యాసాలు
చో. ముక్తేశ్వరమ్మగారు, "స్త్రీ విద్య" పుట 86
11. V. Rama Krishna, *Social Reform in Andhra* Page 8
12. వి. రామకృష్ణ, 'ఆంధ్రలో సంస్కరణోద్యమములు' పుటలు 3-4
13. కొమండూరి శఠకోపాచార్యులు. "స్త్రీలు-హరిజన సమస్య" హిందూ సుందరి. సం. 38, సంచిక 6, 1943 జూన్.
14. నాల్గవ ఆంధ్ర మహిళాసభ ఉపన్యాసాలు. పుటలు142-145
15. "హిందూ కుటుంబములు", 'హిందూజన సంస్కారిణి.
సం. 2, సంచిక 12, జూలై 1887.
16. వీరేశలింగం సమష్టి కుటుంబ వ్యవస్థలో తమ తల్లి, పినతల్లుల మన స్పర్థల మూలంగా తమ తమ చిన్న తనం నుండి వేరుగా వుండాల్సి వచ్చిన పరిస్థితిని వివరిస్తారు. చిలకమర్తి స్వీయ చరిత్రలో సమష్టి కుటుంబంలో తమ తల్లి కష్టపడిందని సానుభూతిగా రాశారు !
17. రాయసం వెంకట శివుడు ఆత్మ చరిత్ర పుట 73
18. వీరేశలింగం రచనలు, 'స్వీయ చరితము-రెండవ భాగము' పుట 203
19. *కొంతా వెంకటప్పయ్యా పంతులు **గారి** స్వీయ చరిత్ర* పుట 36
20. ఈ విషయం ఆధారంగా ఎంతో సాహిత్యం వెలసింది. వీరేశలింగం గారి బ్రాహ్మ వివాహం ఈ సమస్యకి సంబంధించిందే! గురజాడ కన్యాశుల్కం ఇప్పటికి నాటి కన్యాశుల్కం స్వభావాన్ని మనకి చూపిస్తోంది.
21. సామిన ముద్దు నరసింహం, 'వివాహ ప్రమేయం 'హితసూచని'
22. జియ్యరు సూరి స్త్రీ కళా కల్లోలిని పుటలు 247-249
23. పిళ్ళారి సెట్టి లక్ష్మీకాంతమ్మ. *అయిదవ ఆంధ్ర మహిళా సభ* **ఉపన్యాసాలు**, (1914) పుట 48
24, జియ్యరు సూరి, 'స్త్రీ కళా కల్లోలిని' పుట 205

25. వీరేశలింగం పంతులుగారు తమ రచనల్లో అనేక సందర్భాల్లో స్త్రీ మూఢత్వానికి పుట్టినిల్లుగా ఉండేదని రాశారు! అయితే ఈ మూఢత్వానికి అజ్ఞానానికి విద్య లేకపోవడమే కారణం అని కూడా వారు భావించారు.

26. జియ్యరు సూరి, *'స్త్రీ కళా కల్లోలిని'* పుట 43

27. వి. రామకృష్ణ, *ఆంధ్రలో సంస్కరణోద్యమాలు* పుటలు 30-31

28. 'కుటుంబం' అంటే ఇక్కడ వివాహం చేసుకున్న స్త్రీ పురుషుల జీవన వ్యవస్థ అనే అర్థంలో వాడబడింది.

29. *వెన్నెల కంటి సుబ్బారావు జీవితయాత్ర చరిత్ర* పుట 54

30. సామినీన ముద్దు నరసింహం *హితసూచని* పుట 10

31. 'హిందూదేశ స్త్రీల స్థితి', *హిందూజన సంస్కారిణి* సం. 2, సంచిక 12, 1887 జూలై పుట 305

32. *రాయసం వెంకట శివుడు ఆత్మ చరిత్ర* పుట 88

33. జియ్యరు సూరి, *స్త్రీ కళా కలోలిని*, పుటలు 76-78

34. *హిందూజన సంస్కారిణి*, సం. 2, సంచిక 12, 1887 జులై పుటలు 304-306

35. అయ్యదేవర కాళేశ్వరరావు గారి జీవిత చరిత్ర పుట 94

36. కాశీనాథుని రామాబాయమ్మ గారి ఉపన్యాసము, 'నాల్గవ ఆంధ్ర మహిళా సభలో చదవబడిన ఉపన్యాసాలు' పుట 9

37. కందుకూరి వీరేశలింగం పంతులు, 'వేశ్యాకాంతలు'

38. ముట్నూరి కృష్ణరాయ వ్యాసాలు పుటలు 325-330

39. దర్శి చెంచయ్య 'నేను—నా దేశం' పుట 176

40. జియ్యరు సూరి *'స్త్రీ కళా కల్లోలిని'* పుట 235

41. పైదే పుటలు 240-245
42. దర్శి చెంచయ్య 'నేను-నా దేశం' పుట 232
43. జియ్యరు సూరి 'స్త్రీ కళాకల్లోలిని' పుట 242
44. ''అసలా భార్యకి personality అంటూ ఉండదు. వాటినే మనం యిప్పుడు Successful Marriages అంటూ వుంటాం'' చలం ఆత్మకథ పుట 209 చలం మాటలు కొంచెం బాధ కలిగించేవిగా ఉన్నా ఆ మాటలు చాలా వరకు నిజమనిపిస్తుంది.

# 2

# పత్రికల పరిచయం

ఇంత వరకూ స్త్రీల పత్రిక వెలువడే నాటి సామాజిక స్థితిగతుల్ని పరిశీలించడం జరిగింది. స్త్రీల పత్రికలు స్త్రీల సమస్యల్ని చర్చించిన విధానాన్ని పరిశీలించే ముందు 1883-1947 వరకు వచ్చిన స్త్రీల పత్రికల వివరాలు ఈ అధ్యాయంలో వివరించడం జరిగింది.

19వ శతాబ్దాంతానికి స్త్రీ జాతిలో చైతన్యం కలిగింది! వారిలో విద్యాభిలాష అంకురించింది! స్త్రీలే స్వయంగా రచనలు చేయడం కూడా మొదలు పెట్టారు. శ్రీమతి పోతం జానకమ్మగారు విదేశీ యాత్రను గురించి వ్యాసం రాసి ఆంధ్ర భాషా సంజీవినిలో ప్రచురించినట్లు తెలుస్తుంది.[1] స్త్రీ రచనా వ్యాసంగం 19వ శతాబ్దంలోనే ప్రారంభమై 20వ శతాబ్ది తొలిదశకానికి ఉన్నత స్థాయికి చేరుకుంది! స్త్రీలు తమకోసం స్వయంగా పత్రికలు నడపడం కూడా మొదలు పెట్టారు తెలుగులో స్త్రీలకోసం మొదటి పత్రిక శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రారంభించారు.

వీరేశలింగం గారిచే ప్రారంభించబడిన స్త్రీల పత్రికా ప్రచురణ 20వ శతాబ్ది ఆరంభానికి స్త్రీల చేతుల్లోనే ప్రచురించబడే దశకి చేరుకుంది! 1883 నుంచి 1947 వరకు సుమారు 20 పత్రికలు వెలువడ్డాయి. ఆ పత్రికల ప్రతులన్నీ ప్రస్తుతం లభ్యం కావడం లేదు. లభ్యమైన పత్రికల వివరాలు ఇక్కడ ఇవ్వడం జరిగింది.

| పత్రిక | ప్రచురించిన సంవత్సరం | సంపాదకులు | ప్రచురించబడిన స్థలం |
|---|---|---|---|
| 1. సతీహితబోధిని | 1883 | కందుకూరి వీరేశలింగం పంతులు | రాజమండ్రి |
| 2. తెలుగు జనానాపత్రిక | 1893 | రాయసం వెంకటశివుడు | బెజవాడ |
| 3. స్త్రీహితబోధిని | 1893 | రాపాక కౌస్తుభం | కాకినాడ |

| | | | |
|---|---|---|---|
| 4. శ్రీ బాలిక | 1896 | సంగీతం బాపిరాజు | శ్రీకాకుళం |
| 5. హిందూ సుందరి | 1902 | మొసలికంటి రమాబాయి | కంతేరు |
| 6. గృహలక్ష్మి | 1903 | రాజా మంత్రిప్రగడ భుజంగరావు | ఏలూరు |
| 7. సావిత్రి | 1904 | పులుగుర్త లక్ష్మి నరసమాంబ | కాకినాడ |
| 8. వివేకవతి | 1909 | ఎం. ఎ. శ్రీనివాసనతి | మదరాసు |
| 9. సుందరి | 1909 | బి. నారాయణ | కామరిపాలెం (గోదావరి) |
| 10. స్త్రీల కొరకు వర్తమానములు | 1912 | ఇ.యస్. మెకాలేకన్య | గుంటూరు |
| 11, అనసూయ | 1914 | వింజమూరి వెంకటరత్నం | |
| 12. స్త్రీ ధర్మ | 1917 | మాలతీ పట్వర్ధన్ | మదరాసు |
| 13. బాలభారతి | 1918 | దువ్వూరి జగన్నాథశర్మ | — |
| 14. సౌందర్యవల్లి | 1919 | రమాబాయి | మదరాసు |
| 15. ఆంధ్ర లక్ష్మి | 1921 | కళ్లేపల్లె వెంకట రమణమ్మ | గంజాం |
| 16. హిందూ యువతి | 1923 | యామినీ పూర్ణతిలకమ్మ | — |
| 17. భారత మహిళ | 1925 | యు. సుందరమ్మ | అనంతపురం |
| 18, గృహలక్ష్మి | 1927 | కె. యస్. కేసరి | మదరాసు |
| 19. యశోద | — | టి. కె. యశోదాదేవి | రాజమండ్రి |
| 20. విశ్వజ్ఞాని | — | యామిని పూర్ణతిలకమ్మ | మదరాసు |
| 21, ఆంధ్ర మహిళ | 1944 | దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ | మదరాసు |

*1. సతీహిత బోధిని :* 1883 లో వీరేశలింగం గారిచే స్థాపించబడింది. మూడుసంవత్సరాలు ప్రచురించబడి ఆగిపోయింది. తిరిగి 1888లో ప్రచురణ ప్రారంభమైంది. కొంత కాలం తెలుగు జనానా పత్రికతో కలిసి ప్రచురించబడేది. ఇది రాజమండ్రి నుంచి వెలువడేది.

1874 నాటికి వీరేశలింగంగారు పత్రికా నిర్వహణ ప్రారంభించారు (వివేకవర్ధిని 1874).

వివేకవర్ధిని పత్రికా నిర్వహణతోబాటు శ్రీ వీరేశలింగంగారు సమకాలీన పత్రికల్లో రచనలు చేస్తుండేవారు. ఆంగ్ల ప్రభావంతో సాహిత్యంలో అనేక నూత్న ప్రక్రియలు వృద్ధి చేసిన వీరేశలింగం పంతులుగారు బహుశా అదే ప్రభావంతో తెలుగు దేశంలో తొలిసారిగా స్త్రీలకోసం పత్రిక స్థాపించి ఉంటారు. అయితే ఆయన తన స్వీయ చరిత్రలో "తెలుగు స్త్రీలకై తొలి వచన పుస్తకమును నేనే వ్రాసితిని" అని చెప్పారు. వారు వచన పుస్తకం అన్నది పత్రికా పరంగా ఉపయోగించారని భావిస్తే ఆ వాక్యానికి అర్థం సరిపోతుంది. లేక వారు స్త్రీలకోసం రచించిన మరే ఇతర పుస్తకాన్నైనా ఉద్దేశించి ఆ వాక్యం రాసివుంటె తెలుగులో వీరేశలింగంగారి కంటె ముందు స్త్రీలకోసం పత్రిక లేవైనా ఉండేవా? అనే అనుమానం కలుగుతుంది. మనకి దొరుకుతున్న ఆధారాలనుబట్టి తెలుగులో స్త్రీలకోసం వెలువడిన మొట్టమొదటి పత్రిక 'సతీహిత బోధిని'. అది 1883 లో వీరేశలింగంగారే స్థాపించారు. తనకి ముందు కాస్తో కూస్తో ప్రచారంలో ఉన్న ప్రక్రియల్ని వారు తెలుగులోకి వరవడిగా ప్రవేశింపజేసిన వాటిని గురించి అంత కచ్చితంగా రాసినప్పుడు అంతకుముందెన్నడూ లేని సరికొత్త కార్యక్రమం స్త్రీల పత్రిక నిర్వహణ గురించి ఆయన యెందుకు ప్రస్తావించలేదు అనే విషయం ఆలోచించవలసివుంది. అయితే ప్రస్తుతానికి మనకు లభ్యం అవుతున్న ఆధారాలనుబట్టి సతీహిత బోధినే తొలి స్త్రీల పత్రిక అని చెప్పవలసి వుంటుంది.

> "వారు చదువుటకు తెలుగులో మంచి పుస్తకములు లేకుండుటం దల పోసియు లోపమును నా చేతనైనంతవఱకు తొలగింపవలెనని 1883వ సంవత్సరమునందు స్త్రీల కొఱకు "సతీహిత బోధిని" యను

పేరుతో తెలుగున నొక మాస పత్రికను బ్రకటించుట కారంభించి తిని"

అని వీరేశలింగంగారు స్వీయ చరిత్రలో రాశారు. సతీహిత బోధిని పత్రికలో వీరేశలింగంగారు స్త్రీ విద్యకు సంబంధించిన అంశాలను గురించి. పతివ్రతా ధర్మాలను గురించి వ్యాసాలు రాసి ప్రచురించేవారు !

"స్త్రీల యుపయోగార్థమయి 'సతీహిత బోధిని' యను పత్రిక పయి చైత్ర (ఏప్రెల్) మాసము నుండి మరల మ. రా. శ్రీ బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగం గారిచేత ప్రకటింపబడును దానియందు స్త్రీల కుపయోగించు నీతి బోధకములైన కథలును, ఉపన్యాసము లును, స్త్రీ ధర్మములును, పుణ్య చరిత్రములును, ఆరోగ్య ధర్మము లును, వైద్యాంశములును, ప్రకృతిశాస్త్ర విషయములును, పుణ్యసతీ చరిత్రములును, జ్ఞానదాయకములును అగు నితర విషయములును ప్రచురింపబడును. ముఖ్యాంశములను బోధించు పటములు గూడ చేర్పబడును. సంవత్సరము ఒకటికి అంచెకూలితో రెండు రూపా యలు. ముందుగా చందాలనంపనివారు పత్రికలంబడయజాలరు. కావలసినవారు సొమ్ముతో రాజమహేంద్రివరము శ్రీ వివేకవర్ధనీ కార్యస్థానపు మేనజరుగారికి దరఖాస్తులను పంపవలెను."2

సతీహిత బోధిని పునః ప్రచురణ సందర్భంలో హిందూజన సంస్కా రిణిలో పై ప్రకటన కనిపిస్తుంది.

190లెవ సంవత్సరము నుండి వీరేశలింగంగారు శరీరాస్వస్థతవలన, వారు విద్యాలయాది సంస్థల నిర్వహణలో నిమగ్నులై వుండటంవలన ఈ పత్రికా ప్రచురణ ఆగిపోయిందని ఊహించవచ్చు.3 1905వ సంవత్సరం నుంచి వీరేశలింగం పంతులుగారు సత్యవాదిని పత్రికా ప్రచురణలో నిమ గ్నులు కావడం కూడా సతీహిత బోధిని పత్రిక ఆగిపోవడానికి కారణం కావచ్చు. వీరేశలింగంగారికి వ్యతిరేకంగా కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు 'ఆర్యమత బోధిని' అనే పత్రిక నిర్వహించే వారు. ఆర్యమత బోధినికి సమాధానంగా వీరేశలింగంగారు 'సత్యవాదిని' పత్రికని స్థాపించారు.4

కాబట్టి వారు తమ శక్తినంతటిని సత్యవాదినిపై కేంద్రీకరించి, సతీహిత బోధిని ప్రచురణ పట్టించుకోలేదని భావించడానికి వీలుంది.

సతీహిత బోధిని ముఖపత్రం మీద

"అరక్షితా గృహేరుద్ధాః పురుషైరాప్తకారిభిః!
ఆత్మాన మాత్మనా యాస్తురక్షేయుస్తాస్సు రక్షితాః"

అనే శ్లోకం ముద్రించబడేది. 'ఆప్తులైన పురుషులచే గృహమున నిర్బంధింప బడు స్త్రీలు సురక్షితురాండ్రు కారు. ఏ స్త్రీలు తమ్ము తామే కాపాడుకొందురో వారే సురక్షితురాండ్రు' అని ఈ శ్లోకార్థం.

తెలుగులో స్త్రీలకోసం మొదటిసారిగా వెలువడిన పత్రిక సతీహిత బోధిని. స్త్రీని విద్యావంతురాల్ని చేయాలని, ప్రకృతిశాస్త్ర, వైద్యశాస్త్రాలకు సంబంధించిన ప్రాథమిక పరిజ్ఞానం స్త్రీలకు కలగాలని, స్త్రీలు సాదువర్తనం కలిగి పాతివ్రత్యాచరణం సక్రమంగా చేస్తూ సంసారాన్ని చక్కదిద్దుకోవాలని ఈ పత్రిక అభిలషించేది।

సతీహిత బోధిని పత్రికలోని అంశాలు సాధారణంగా అన్ని కూడా శ్రీ వీరేశలింగంగారి చేత రచించబడ్డవే అయివుండేవి.

*2. తెలుగు జనానా పత్రిక :* 1893వ సం॥లో దీని ప్రచురణ ప్రారంభమైంది. 1893లో శ్రీ మల్లాది వెంకటరత్నం గారు ఈ పత్రికా ప్రచురణ చేపట్టారు. స్త్రీ విద్యా వ్యాప్తి ధ్యేయంగా ఈ పత్రికా ప్రచురణ ప్రారంభమయింది. 1893 నుంచి ఒక సంవత్సరము పాటు నడిపి శ్రీ మల్లాది వెంకటరత్నం గారు ఈ పత్రికా నిర్వహణ బాధ్యతను శ్రీ రాయసం వెంకట శివుడి గారికి అప్పగించారు.

> "నా పూర్వ గురువులగు మల్లాది వెంకటరత్నము గారు 1893వ సంవత్సరములో జూలై నెలలో స్త్రీ విద్యాభివృద్ధి నిమిత్తమై 'తెలుగు జనానా పత్రిక' యనునొక మాస పత్రికను నెలకొల్పి యొక సంవత్సరము నడిపి, అది యిప్పుడు విరమింప నుద్యమించినేనద్దానిని గైకొని సాగింతునాయని, మొయి 28వ తేదీన నాకు వ్రాసిరి."[5]

ఈ పత్రిక ముఖ పత్రము మీద 'తెలుగుదేశపు స్త్రీల కొఱకును, బాలికల కొఱకును ప్రచురించబడు మాస పత్రిక' అని ముద్రించే వారు, ఇది స్త్రీ విద్య నడవడికలకి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. ఇందులో పాఠకులకు చిక్కు ప్రశ్నల వంటి శీర్షికలు నిర్వహించే వారు. ఇందులో కూడా సాధారణంగా రచనలు చేసేవారంతా పురుషులే. "హిందూ స్త్రీల కారోగ్య ధర్మములు తెలియుటను గురించి" అనే పేరుతో ఒక స్త్రీ వ్యాసం రాసినట్లు వుంది.[6] కానీ ఆమె పేరు లేదు. 'ఒక హిందూ స్త్రీ వ్రాసినది' అని మాత్రం బ్రాకెట్లో వుంది. వివిధ పత్రికలలో ఇంగ్లీషులో వెలువడే వ్యాసాలను తెలుగులోకి అనువదించి ఈ పత్రికలో ప్రచురించే వారు.

తెలుగు జనానా పత్రిక కొంత కాలం రాజమండ్రి నుంచి వెలువడింది; అప్పుడు దానికి శ్రీ రాయసం వెంకట శివుడు గారు వారి తమ్ముడు వెంకట రామయ్య గారు సంపాదకులుగా వుండేవారు. వెంకట శివుడు గారి తమ్ముడు రాజమండ్రి విడిచి వెళ్లిపోవడంతో తిరిగి వెంకట శివుడు గారు ఒక్కరే పత్రికా సంపాదకత్వం నిర్వహించారు.

1904వ సం॥ నుంచి శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారు జనానా పత్రికాధి పతుల్లో ఒకరయ్యారు. 1904 సెప్టెంబర్ నుంచి జనానా పత్రికకి తిరిగి ఇద్దరు సంపాదకులు. వీరేశలింగం గారు, వెంకట శివుడు గారు. జనానా పత్రికతో పాటు సతీహిత బోధిని పత్రిక కూడ కలిపి ప్రచురించబడేది. వీరేశలింగం గారు సంపాదకత్వం వహించడం ప్రారంభించిన తర్వాత ఈ పత్రిక- సమకాలీన స్త్రీల పత్రికలైన 'సావిత్రి', 'హిందూ సుందరి'లలోని రచనల్ని విమర్శిస్తూ రాయడం ప్రారంభించింది! 'సావిత్రి—సత్యవతీ సంభాషణం' అను పేరుతో ఒక ప్రహసనం వీరేశలింగం గారు రచించారు. దాంట్లో స్త్రీల పేరు పెట్టుకొని పురుషులు పత్రికలలో రాయటం అసమంజసం అనే వెక్కిరింత వుంది. ఈ వెక్కిరింతకు నొచ్చుకున్న సావిత్రి, హిందూ సుందరీ పత్రికలు వారికి సమాధానం ఇవ్వడం మొదలుపెట్టాయి.[7]

> "తోడి పత్రికలలో వివాదాలు పెట్టుకొనుట నా పద్ధతి కాదు. సామ మార్గముననే నా కార్యములు చక్కపెట్టుకొనుచు వచ్చితిని. కాని కోప

స్వభావులగు పంతులు గారు నాతోఁ గూడి వచ్చుటయే దుర్ఘటమైన యీ పత్రికా సమష్టి సంపాదకత్వ ప్రథమ దశలోనే వారి కడ్డంకులు కలిగింపనేను వెఱచి ఉదంతము లెట్లు పరిణమించునోయని తటస్థముగా జూచుచుంటిని''8 అని జనానా పత్రికాధిపతియైన రాయసం వెంకట శివుడు గారు తమ ఆత్మ చరిత్రలో వాపోయారు.

''వీరేశలింగం పంతులు గారి రచనా సామర్థ్యము లోక విదితము, ఇట్టి ప్రతిభావంతులయ్యును, ఒక్కొక్కప్పుడు వారు చిన్న చిన్న సంగతులయందే పరులతో వాదమునకుఁ గాలు ద్రువ్వుచుండువారు. 1904 సం॥ ఏప్రిలు-మేయి జనానా పత్రిక సంచికలో జనానా పత్రిక- సావిత్రి అను శీర్షికతో మరల వెనుకటి విషయమును ప్రస్తా వించి వారిట్లు రాసిరి.... 'గత సంవత్సరము అక్టోబరు జనానా పత్రి కలో ప్రకటింపఁబడిన సావిత్రీ సత్యవతీ సంభాషణము' పైని నవంబరు, డిసెంబరు నెలల సావిత్రీ పత్రికలోఁ గొన్ని యపాత్రపువ్రాఁతలు వ్రాయబడినవి. అవివేకుల దూషణములకు బదులు వ్రాయుటయుచితము కాదని భావించి మేమా వ్రాతలను పేక్షించి యూరకొంటిమి, దురభి మానులైన మా ప్రతి పక్షులది మా యసమర్థతగా భావించి, యీనెల 'యార్య మతబోధిని'లో మన్యము వెంకట సుబ్బమ్మగారిచ్చిన పత్రిక కును వేసిన పందెమునకును9 మాఱు పలుకఁజాలక పంతులు వారును తదనుచరులును, గతించిన దానికి చింతిల్లుచు నూఱకుండిరని జయ ఘోషమిడుచున్నారు. ఆ జయమును వారే కైకొనవిందు ఈ విధముగా పంతులు గారు మరల కత్తిదూసి ప్రతి పక్షుల తోడి యుద్ధమునకు సన్నద్ధులైరి శాంతముగఁబనులు చక్కపెట్టుకొనుచు పత్రికా పుత్రిక నిటులో పంద్రెండేండ్లు వఱకును బెంచిన నేను పంతుల వారి శౌర్యోద్ధతి వలన పత్రికకేమి హాని వాటిల్లునో యని లోనభీతిల్లుచుంటిని.''10

1905లో వీరేశలింగం గారు అనేక కారణాల వలన పత్రికా సంపాద కత్వం విడిచిపెట్టారు. అరు నెలల పాటు తెలుగు జనానా పత్రిక ముద్రించ బడలేదు. 1906 జనవరిలో తిరిగి పత్రికా ప్రచురణ రాయసం వెంకట శివుడు గారి సంపాదకత్వంలో ప్రారంభమయింది.

వీరేశలింగం గారి చింతామణి ముద్రణాలయాన్ని రాజమండ్రిలో నడుపుతుండిన సత్యవోలు గున్నేశ్వర రావు గారు జనానా పత్రికను ముద్రించే వారు. వారు 1907 జూలై నుండి రాయసం వెంకట శివుడు గారికి కారణం చెప్పకుండానే పత్రికా ముద్రణ నిలిపివేశారు. ఈ విధంగా జనానా పత్రిక ప్రచురణ 1907వ సంవత్సరములో నిలిచిపోయింది.

1893 నుంచి 1907 వరకు ప్రచురించబడిన జనానా పత్రిక తెలుగు స్త్రీల పత్రిక చరిత్రలో మరిచిపోలేనిది. ఈ పత్రిక ప్రత్యక్షంగా ఎన్నో వివాదాలకి వేదిక అయింది. దీనిలో వీరేశలింగం వంటి వారి మనోభావాలు వెల్లడయ్యాయి. బహుశా ఈ పత్రికే తెలుగులో స్త్రీలే పత్రికా నిర్వహణ చేయడానికి వారికి స్ఫూర్తినిచ్చి ఉండవచ్చు. ఈ పత్రికలోని రచనలు స్త్రీలను మేల్కొల్పి పత్రికా ప్రచురణకి పురికొల్పాయని చెప్పవచ్చు. ఈ పత్రికకి ఇతర స్త్రీల పత్రికలు సమాధానాలు చెప్పేవి. ఈ పత్రికా ప్రతులు కొన్ని రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో ఉన్నాయి.

*3. స్త్రీ హిత బోధిని:* (1893) ఈ పత్రికను కాకినాడ నుంచి రాపాక కౌస్తుభంగారు ప్రచురించారు. ఇంతకుమించి వివరాలు లభించలేదు.

*4. శ్రీ బాలిక:* (1896) బాలిక పత్రిక శ్రీ సంగీతరావు బాపి రాజు గారి సంపాదకత్వంలో శ్రీకాకుళం నుంచి వెలువడేది. బాపిరాజు ఫస్ట్ గ్రేడ్ ప్లీడర్. 1896 మార్చి నుంచి ప్రచురణ ప్రారంభమైంది. 2 1/2 అణాలు వెల వుండేది. ఆరంభంలో 15 పేజీలు ప్రచురించబడేవి. క్రమంగా 30 పేజీల వరకు ప్రచురించడం జరిగింది. ఇందులో రచనలు చేసే వారంత ఎక్కువగా పురుషులే. ప్రాచీన సాహిత్యంలోంచి స్త్రీలకు సంబంధించిన సాహిత్యాన్ని ఇందులో అర్థసహితంగా ప్రచురిస్తుండేవారు. నీతి కథలు, సద్వర్తనము, దేహారోగ్యము మొ॥ అంశాల్ని ప్రచురిస్తుండేవారు. పత్రిక ముఖపత్రం మీద 'స్త్రీల నిమిత్తము మాసమున కొకసారి ప్రకటింపబడు పత్రిక' అని ముద్రించ బడేది. విషయసూచిక మొదటి పేజీలోనే ఇంగ్లీషు—తెలుగు రెండు భాషల్లోను ప్రచురించబడుతుండేవి. ఈ పత్రికకి సంబంధించిన రెండు ప్రతులు ప్రస్తుతం లభ్యమౌతున్నాయి. (1) రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలోనూ (1896

ఆగస్టు) 1-6 (2) విజయవాడ రామమోహన గ్రంథాలయంలోనూ (మే-1897) 2-3 ఉన్నాయి. ఈ పత్రిక ఏ కారణాల వల్ల ఎప్పుడు ఆగిపోయిందో తెలిపే ఆధారాలు ఏవీ లభించలేదు.

౭. హిందూ సుందరి : (1902) ఒక విధంగా తెలుగుదేశంలో స్త్రీలు పత్రికా ప్రచురణ చేయటం హిందూ సుందరితోనే ప్రారంభమయింది. "ఇది మొదట ఏలూరు నుంచి శ్రీమతి మొసలికంటి రమాబాయి గారి సంపాదకత్వంలో వెలువడింది. తర్వాత కొన్ని సం॥లు కంతేరు నుంచి వెలువడింది. అప్పుడు కూడా మొసలికంటి రమాబాయి గారే సంపాదకురాలు. 1914 ప్రాంతంలో హిందూ సుందరి కాకినాడ విద్యార్థినీ సమాజం వారిచే ప్రచురించబడేది. అప్పుడు శ్రీమతి మాడభూషి చూడమ్మ గారు, కళ్లేపల్లె వెంకటరమణమ్మ గారు సంపాదకత్వం వహించారు. 1942 నుంచి 1944 వరకు ఈ పత్రిక బాలంత్రపు శేషమ్మ గారి సంపాదకత్వంలో కాకినాడ నుంచి వెలువడేది. మధ్యలో కొంతకాలం ఆగిపోయినా 1902లో మొదలైన హిందూ సుందరి ఇంచుమించు 1945 వరకు ప్రచురించబడింది. 1944 నవంబరు పతి వరకు ప్రస్తుతం లభ్యం అవుతున్నాయి. (గౌతమి గ్రంథాలయం రాజమండ్రిలో) ఆ తర్వాత ఏ కారణంగా పత్రికా ప్రచురణ ఆగిపోయిందో తెలియదగిన ఆధారాలు లభించలేదు.

హిందూ సుందరి నాడు వెలువడ్డ పత్రికల్లో విప్లవాత్మకమైన ధోరణిలో నడిచిన స్త్రీల పత్రిక అని చెప్పవచ్చు. నిజంగా స్త్రీల సమస్యల్ని సరియైన పంథాలో చర్చించి ప్రశ్నించేది! కేవలం స్త్రీని విద్యావంతురాల్ని చేయడమే కాక స్త్రీ హక్కుల్ని గూర్చి ప్రశ్నించిన మొదటి పత్రిక! స్త్రీలకు సమాజంలో జరుగుతున్న అన్యాయాల్ని నిష్కర్షగా ఖండించిన పత్రిక !

శ్రీ సంభావిత వాక్య సంపదలచే జెన్నొంది సాధ్వీమనో,
ల్లాసంబేర్పడ నేయుచున్విమల శీలంబొప్పఁగా వైదుషీ
వ్యాసంగంబుల వైరవృత్తులెడపు-న్యాషాఢ్యయై కాననం !
తోషంబొంది కొనుండ సుందరులు హిందూ సుందరీ రత్నమున్॥

ఈ పద్యం హిందూ సుందరి పత్రిక మొదటి పేజీలో ప్రచురించ బడేది.

'స్త్రీలు చదువదగిన విషయములు ప్రచురించు పత్రిక' అని హిందూ సుందరి పత్రికకి సంబంధించి ప్రచారం జరిగేది.

*6. గృహలక్ష్మి:* (1903) ఈ పత్రికని రాజామంత్రి ప్రగడ భుజంగరావు గారు ఏలూరు నుంచి నడిపే వారు, నందిరాజు చలపతిరావు గారు పత్రికా సంపాదకులుగా ఉండేవారు. ఆంధ్ర స్త్రీల అభ్యుదయానికి అనువైన సచిత్ర వ్యాసాలు ఈ పత్రిక ప్రచురించింది. ఈ పత్రికలో బాల విజ్ఞానానికి కూడా అవకాశం ఏర్పరిచారు. అని లక్ష్మణరెడ్డి గారు తమ తెలుగులో జర్నలిజంలో పేర్కొన్నారు. ఈ పత్రికా ప్రతులు లభించలేదు. ఇతర వివరాలేవీ తెలియలేదు.

*7. సావిత్రి:* (1904) ఈ పత్రిక శ్రీమతి పులుగుర్తలక్ష్మి నరసమాంబ గారి సంపాదకత్వంలో కాకినాడ నుండి వెలువడేది. 1904 నుంచి 1911 సం॥ వరకు వెలువడింది! అయితే మధ్యలో ఆర్థికపరమైన కారణాల మూలంగా కొంతకాలం పత్రికా ప్రచురణ నిలిచిపోయినట్లు తెలుస్తోంది. 1907లో 3వ సంపుటం వెలువడితే 1911లో నాలుగవ సంపుటం వెలువడింది. దీనివల్ల ఈ పత్రికా ప్రచురణ సక్రమంగా సాగలేదని భావించవచ్చు. ఈ పత్రికలో రచయిత్రుల రచనలు ఎక్కువగా కనిపిస్తాయి. సావిత్రి పత్రిక స్త్రీ విద్యను ప్రోత్సాహించింది. అయితే వితంతు వివాహం వంటి సంఘ సంస్కరణల్ని తీవ్రంగా ఖండించేది. ఒక విధంగా సావిత్రి పత్రిక వీరేశలింగం గారికి ప్రత్యర్థి వంటిదని చెప్పవచ్చు. పంతులు గారు రాసిన 'సావిత్రీ సత్యవతి సంభాషణ'మనే ప్రహసనానికి ఇంకా వీరేశలింగం గారి ఇతర విమర్శలకి, మన్యం సుబ్బమ్మ అనే రచయిత్రి ఈ పత్రికా ముఖంగానే సవాలు విసిరింది. సావిత్రి పత్రిక సంప్రదాయబద్ధమైన రీతిలో స్త్రీ విద్యని కాంక్షించింది స్త్రీకి పునర్వివాహం కూడదని ఖచ్చితంగా చెప్పేది!

> "ఈ సావిత్రి మూలమునఁ బ్రతిమాసము సులభమైన తెలుగునఁ బతివ్రతా ధర్మములు, సంసార ధర్మములుఁ, దలిదండ్రుల యర్థ

కృత్యములు, ప్రకృతి శాస్త్రీయములు, దైవ ప్రార్థనములు, మంచి పాటలు, గుట్టు పనులు, నీతి విషయములు, దేహారోగ్య ధర్మములు, నన్యదేశపు జెలుల వృత్తాంతములు, వినోదవార్తలు, మున్నగు, వివిధాంశములు పంపుకొనుచుండెదను. నిఁగను నా సోదరులందఱు లోకాభివృద్ధికి మూలాధారమగు స్త్రీ విద్యాభివృద్ధిఁ గోరి, నాపై సోదరీ భావముంచి దీనిని దమ సఖులకందరకుఁ జూపి, వారినందఱిని సావిత్రీ బాంధవ్యముఁ గలవారిగాఁజేసి నాకుఁదగు ప్రోత్సాహము నొసంగ వేఁడుచున్నదానను'' అని

సావిత్రి పత్రికాధిపురాలు తమ పత్రికలో ప్రచురించబోయే అంశాల్ని గూర్చి తెలియజేస్తూ, స్త్రీలకు ఈ పత్రికని చదివే అవకాశం కలిగించ వలసినదిగా పురుషులకొక విజ్ఞాపనం చేశారు.

సావిత్రి పత్రిక కూడా ఏ కారణంగా ఆగిపోయిందో తెలియడానికి ఖచ్చితమైన ఆధారాలు లభించడం లేదు! జనాదరణ లేకపోవడం, ఆర్థిక పరమైన సహాయం లేకపోవడం ఈ పత్రిక ఆగిపోవడానికి కారణాలుగా ఊహించవచ్చు.

వివేకవతి : (1909) అక్టోబర్ నుంచి వివేకవతి పత్రికా ప్రచురణ అరంభమైంది. ఇది 'మద్రాసు క్రిష్టియన్ లిటరేట్యూర్ సొసైటి' వారి తరపున ప్రచురించబడేది. ''గుణవతియయిన స్త్రీ ముత్యము కంటె అమూల్యమయినది" అని ఈ పత్రిక ముఖపత్రం మీద ప్రచురించబడేది. ఇందులో పిల్లల్ని పెంచే విధానం, పరిశుభ్రత; వివిధ వంటకాల తయారి మొ॥లైన విషయాలు ప్రచు రించబడేవి 'నానాచోట్ల జరిగే విషయములు' అనే శీర్షికలో వివిధ విషయా లను సేకరించి ఆధారాలతో ప్రచురించడం జరిగేది! ఈ పత్రికలో క్రైస్తవ మత ప్రచారం జరిగేది. హిందూ స్త్రీలకి తమ సంసారాల్ని చక్కగా జరుపు కోవటం తెలీదని, హిందువులకి దేవుడంటే ఎవరో తెలియదని, ఇట్టి చెడువుల నుంచి హిందువులు బాగుపడి అభివృద్ధి చెందాలని ప్రచురించేది. ఈ పత్రిక ప్రతి ఒకటి (1909 నవంబరు) సం-1—సంచిక-2 విజయవాడ రామమోహన గ్రంథాలయంలో లభిస్తోంది. వివేకవతికి సంపాదకత్వం వహించిందెవ

తెలీదు. ఆ పత్రిక మీద సంపాదకుని పేరు లేదు. కొలకలూరి ఇనాక్ గారు తెలుగులో వ్యాస పరిణామంలో 'ఆర్చిబాల్డ్' ఈ పత్రికా సంపాదకులని రాస్తే, లక్ష్మణరెడ్డి గారు 'ఎం.ఎ. శ్రీనివాసనతి' అని రాశారు. ఈ పత్రిక ప్రచురణకి సంబంధించి కూడా వీరిద్దరిలో తేడా కనిపిస్తుంది. ఇనాక్ గారు ప్రచురణ సంవత్సరం 1912 అన్నారు. లక్ష్మణరెడ్డి గారు 1908 అన్నారు. లభించిన ప్రతి ప్రకారం 1909 అని తెలుస్తుంది! ఈ పత్రిక ఎంత కాలం నడిచిందో ఎప్పుడు ఆగిపోయిందో చెప్పదగ్గ ఆధారాలు లభించలేదు.

1909 ప్రతి విజయవాడ రామమోహన గ్రంథాలయంలో ఉంది.

*9. సుందరి :* (1909) ఇది కూడా 1909లోనే వెలువడింది. బి. నారాయణ గారి సంపాదకత్వంలో కొమరిపాలెం (గోదావరి జిల్లా) నుంచి వెలువడేది. దీని ప్రతులేవీ లభించలేదు. ఇతర ఆధారాలు దొరకలేదు.

*10. స్త్రీల కొరకు వర్తమానములు :* (1912) ఇ.యస్. మెకాలే కన్య సంపాదకత్వంలో గుంటూరు నుంచి వెలువడింది! ఇది క్రైస్తవ మత ప్రచారార్థము స్త్రీలనుద్దేశింపబడి ప్రచురించిన పత్రిక! ఇతర వివరాలేవి తెలియలేదు.

*11. అనసూయ :* ఈ పత్రిక వింజమూరి వెంకటరత్నమ్మ గారి సంపాదకత్వంలో కాకినాడ నుంచి వెలువడేది. ఈ పత్రిక ప్రచురణ సంవత్సరం 1914 అని తెలుగులో జర్నలిజంలోనూ 'స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు జర్నలిజం'లోనూ పేర్కొన్నారు. ఇనాక్ గారు తెలుగు వ్యాస పరిణామంలో 1917 అని పేర్కొన్నారు. లభించిన ప్రతులని బట్టి 1917 సరియైన సంవత్సరం అనిపిస్తుంది. ఎందుకంటే 1918లో రెండవ సంపుటం వెలువడింది. (మొదటి సంపుటం 1914లో వెలువడి రెండవ సంపుటం 1918లో వెలువడినట్లు ఊహించవచ్చు కాని తగిన ఆధారాలు లేవు) రెండు మూడు సంపుటాలలో వెలువడ్డ వివిధ సంచికలు (1918, 1919, 1920) రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో లభించాయి! అనసూయ పత్రిక పాఠకులకు 'అనసూయ బహుమతీ పరీక్ష' నిర్వహించేది! ఆ పరీక్షకు నిర్ణయించబడిన పుస్తకాలను ముందుగానే ప్రకటించేది. పరీక్షలో కృతార్థులైన వారి పేర్లను, నెంబర్లను పత్రికలో ప్రకటించి పాఠకులకు ప్రోత్సాహం కలిగించేది!

ఈ పత్రిక ముఖపత్రం మీద
"శ్రీరంజిల్లఁగ నాంధ్రదేశమున నారీ సంఘ మధ్యంబునం
దారూఢిన్ జరియించె, యర్థమగు విద్యా సద్వివేకాదులిం
పారన్ బోధ యొనర్చి, యన్నిఁటను నీవాదర్శ రూపంబవై
యారాజార్కముగా మెలంగు మనసూయా పత్రికా రత్నమా!"
అనే పద్యం ప్రచురించబడేది.

అనసూయ స్త్రీ విద్య, పాతివ్రత్యం మొదలైన అంశాలకి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేది. పత్రికల్లో తమ పేరు వేసుకోవడానికి సంకోచించే స్త్రీల నుద్దేశించి "పత్రికలలో మీ పేరులు పడినంత మాత్రాన మీకే యెగ్గును రాదు. మీ సోదర వర్గమునకు మీరు జాబులు వ్రాయునప్పుడు క్రింద మీ సంతకము లుంపకుందురా ? అటులే యిదియును." అని ప్రచురించి, స్త్రీలకు పత్రికా సభ్యత్వం తీసుకోవలసిందిగా ప్రోత్సహించేది. ఈ పత్రిక కూడా ఏ కారణాల వల్ల ఎప్పటితో ఆగిపోయిందో తెలుసుకోవడానికి తగిన ఆధారాలు లభించలేదు.

*12.* స్త్రీ ధర్మ : (1917) మదరాసు నుంచి మాలతీ పట్వర్ధన్ సతి సంపాదకత్వంలో వెలువడేది! ఈ పత్రికకి సంబంధించిన వివరాలేవీ తెలియలేదు. పత్రిక ప్రతులేవీ లభించలేదు!

*13.* బాలభారతి : (1918) జగన్నాథశర్మ గారి సంపాదకత్వాన నడిచింది! ఈ పత్రిక స్త్రీలకు పిల్లలకు సంగీతం నేర్పడానికి ప్రచురించ బడేది.

*14.* సౌందర్యవల్లి : (1919) ఇది మదరాసు నుంచి గాడిచర్ల రమాబాయి గారి సంపాదకత్వంలో వెలువడేది! నల్లా గురుస్వామి చెట్టి గారనే లాయరు గారి ధనసహాయంతో ఈ పత్రిక వెలువడేది. ఈ పత్రిక మహిళా సమస్యలకు ప్రాధాన్యం ఇచ్చేది. స్త్రీ సంఘ సంస్కరణకు, స్త్రీల సమస్యలకు, స్త్రీ విద్యకు సంబంధించిన చక్కని సంపాదకీయాల ద్వారా ఈ పత్రిక మహిళా లోకంలో విజ్ఞాన వికాసాలు కలిగించడానికి కృషిచేసిం దని లక్ష్మణరెడ్డి గారు తెలుగులో జర్నలిజంలో పేర్కొన్నారు.

*15*. ఆంధ్రలక్ష్మి : (1921) బరంపురం జిల్లాలోని గంజాం నుంచి, కళ్లెపల్లి వెంకటరమణమ్మ గారి సంపాదకత్వంలో వెలువడేది. 1921 డిశంబరులో ప్రచురణ ప్రారంభమైంది. 1924 వరకు ప్రచురించబడిన కొన్ని ప్రతులు రాజమండ్రి గౌతమీ గ్రంధాలయంలో లభిస్తున్నాయి. ఆంధ్రలక్ష్మి పత్రికలో రచయిత్రులు ఎక్కువగా రచనలు చేశారు. 'శారద లేఖలు' అనే పేరుతో మొదటిసారిగా లేఖా సాహిత్యం ఈ పత్రికలో కనిపిస్తుంది ! ఒక్కొక్క లేఖలో ఒక్కొక్క సమస్యని లేదా ఏదైనా ! అంశాన్ని తీసుకొని తీసుకుని వివరించేవారు.

"శ్రీ రమ్యంబగు నాంధ్రదేశ మహిళా శ్రేణి కరోద్యానమై
నారీలోకమనోగ తాంధతమ సాజ్ఞానార్క విజ్ఞానమై
ధీరోదార వివేక ముఖ్య సుగుణాధేయంబునై యింపు సొం
పారన్ వర్ధికి 'ఆంధ్రలక్ష్మి' మను మో ఆచంద్ర తారార్కమున్"

అనే పద్యం ఆంధ్రలక్ష్మి ముఖపత్రం మీద ప్రచురించబడేది. స్త్రీ విద్యాభ్యుదయం ధ్యేయంగా ఈ పత్రికా ప్రచురణ ప్రారంభించినట్లు ఈ పత్రికాధిపురాలు ప్రచురించారు.

ఈ పత్రిక కూడ ఎప్పుడు ఆగిపోయిందో తెలియదగిన ఆధారాలు లభించలేదు.

*16*. *హిందూ యువతి*: (1923) శ్రీమతి యామినీ పూర్ణ తిలకమ్మ గారి సంపాదకత్వంలో మద్రాసు నుంచి వెలువడింది ! ఇది స్త్రీల కోసం వెలువడిన మొదటి పక్ష పత్రిక ఇంతకు ముందు వెలువడినవన్నీ మాస పత్రికలు !

ఈ పత్రిక ప్రతులేవీ లభించలేదు ! దర్శి చంచయ్య గారు తమ 'నేనూ_నా దేశం'లో కళావంతుల సంస్కరణ నిమిత్తం యామినీ పూర్ణ తిలకమ్మ గారు ఒక పత్రికను నడిపినట్లు రాశారు. బహుశా ఆ పత్రిక ఇదే అయివుండవచ్చునని భావించవచ్చు. దాని ప్రకారం ఈ పత్రిక హిందూ స్త్రీల సంస్కరణకోసం, ముఖ్యంగా కళావంతుల స్త్రీల ఉద్ధరణకోసం ప్రచురించబడిందని ఊహించవచ్చు.

*17.* భారత మహిళ :- (1925) యు. సుందరమ్మ గారి సంపాదకత్వంలో అనంతపురం నుండి వెలువడింది! ఈ పత్రికకు సంబంధించిన వివరాలేవి తెలియలేదు.

*18.* గృహలక్ష్మి :- (1927) కె. యన్. కేసరి గారి సంపాదకత్వంలో మద్రాసు నుంచి వెలువడింది. చాలాకాలం తర్వాత తిరిగి స్త్రీల కోసం పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రిక! ఒక విధంగా 20వ శతాబ్దంలో పురుష సంపాదకత్వంలో వెలువడిన మొదటి స్త్రీల పత్రిక యిదే! ఆంధ్ర వనితా లోకానికి కేసరి గారి గృహలక్ష్మి ఎంతో జీవం, జవం ఇచ్చింది. కనుపర్తి వరలక్ష్మమ్మ గారు ఇందులో 'శారద లేఖలు' అనే శీర్షికను నిర్వహించారు. లక్ష్మణరెడ్డి గారు తమ తెలుగులో జర్నలిజంలో 'శారద లేఖలు' శీర్షిక ప్రప్రథమంగా గృహలక్ష్మిలో ప్రచురించారని రాశారు. కానీ అంతకు ముందే 1921 నాటికే ఆంధ్రలక్ష్మిలో ఇదే శీర్షిక వెలువడ్డట్టు ఇంతకు ముందు ఆంధ్రలక్ష్మి ప్రస్తావన వచ్చినప్పుడు పేర్కొనడం జరిగింది. ఇంతకు ముందు ఎన్నో స్త్రీల పత్రికలు ఉన్నా గృహలక్ష్మికి ఎంతగానో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. చాలామంది గృహలక్ష్మి మొదటిసారిగా స్త్రీలకోసం వెలువడిన పత్రిక అనే భ్రమలో ఉండటం కూడ కద్దు! ఇందులో వివిధ రచయిత్రుల వ్యాసాలు ప్రచురించబడ్డాయి.

ఈ పత్రిక సుమారు 30 సం॥లు వెలువడింది! హిందూ సుందరి తర్వాత దీర్ఘకాలం వెలువడిన స్త్రీల పత్రిక యిదే. 1960 తర్వాత దీని స్థాపకులైన శ్రీ కేసరి గారి మరణానంతరం ఈ పత్రిక ప్రచురణ నిలిచిపోయింది! ఈ పత్రిక ప్రతి సంవత్సరం ఒక్కొక్క ఉత్తమ రచయిత్రికి 'స్వర్ణకంకణం' బహూకరించేది!

''జయ జయ గృహలక్ష్మి సఖీ! జయ జయ లలితాంధ్ర
మధుర సారస్వతమా!

జయ జయ లలనా రత్నమా! జయ జయ విద్యాప్రబోధ
జయ కళ్యాణి!

అని గృహలక్ష్మి ముఖపత్రంపై ప్రచురించబడేది! గృహలక్ష్మి ప్రతులు చాలా గౌతమి గ్రంథాలయంలో ఉన్నాయి.

*19.* యశోద :- ఇది 1930 ప్రాంతాల్లో స్త్రీలకోసం వెలువడిన పత్రిక! రాజమండ్రి నుంచి టి.కె. యశోదాదేవి సంపాదకత్వంలో వెలువడింది! వారానికి రెండుసార్లు వెలువడేది.

*20.* విశ్వజ్ఞాని :- ఇది కూడా యామినీ పూర్ణ తిలకమ్మ గారి సంపాదకత్వంలో మదరాసు నుంచి వెలువడేది.

పై రెండు పత్రికల వివరాలు తెలియలేదు ప్రతులేవీ లభించలేదు

*21.* ఆంధ్ర మహిళ :- (1944) దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారి సంపాదకత్వంలో మద్రాసు నుంచి వెలువడింది! ఇది మద్రాసు ఆంధ్ర మహిళా సంఘం తరపున ప్రచురించబడేది. దీనిని దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ తర్వాత శ్రీమతి చిన్న ఘంటమ్మ, కొత్త లక్ష్మి రఘురామ్. కె. రామలక్ష్మి మాలతీ చందూర్ మొదలైన వారు సంపాదకత్వం వహించారు. ఈ పత్రిక 1960 వరకు వెలువడింది.

ఎక్కడ చైతన్యం వుంటుందో. ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటుందో అక్కడ స్త్రీ సహితం సామాజిక చట్రాల నన్నింటిని ఛేదించుకొని తాను బయటపడడమే కాక సమాజాన్ని కూడా ప్రగతి పథంవైపు నడిపించగలదన డానికి గొప్ప ఉదాహరణ శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్. సాధారణంగా సామాజిక చట్రం నుంచి బయటకి వచ్చినప్పుడు అపనిందలు ఎదుర్కోవలసి వస్తుంది. అయితే వాటిని కూడా అధిగమించి సామాజిక గౌరవం అందుకో గలిగింది దుర్గాబాయ్ దేశ్‌ముఖ్!

ఆంధ్ర మహిళ పత్రిక ప్రచురించబడే నాటికి దేశ పరిస్థిల్లో ఎంతో మార్పు వచ్చింది. స్వాతంత్ర్య సమరోద్యమం ఉచ్ఛస్థితిలో కొనసాగుతోంది! స్త్రీలు అనేక మంది ఉద్యమంలో పాల్గొంటున్నారు. ఆ మార్పుల కనుగుణం గానే ఆంధ్ర మహిళ పత్రిక కూడా రూపొందింది. స్త్రీలపట్ల గాంధీజీ అభి పాయాలను ఈ పత్రిక ప్రచురించేది. రాజకీయాల్ని గురించి కొంచెంగా

నైనా చర్చించిన తొలి స్త్రీల పత్రిక "ఆంధ్ర మహిళ! ఇంతకుముందు ఏ పత్రికలోనూ రాజకీయాల్ని గూర్చిన చర్చలు కనిపించవు! ఇందులో 'సంపాదకీయం' రాయడం ఇతర స్త్రీల పత్రికల కంటె భిన్నప్రక్రియ! ఈ పత్రికలో వ్యాపార ప్రకటనలు విపరీతంగా కనిపిస్తాయి. ఇంతకుముందు పత్రికల్లో వ్యాపార ప్రకటనలున్నా అవి చాలా తక్కువగా ఉండేవి. ఈ పత్రికలో స్త్రీల సమస్యల్ని గూర్చి ఆసక్తికరమైన చర్చలు జరిగేవి. సమాజంలో అనేక రకాలుగా స్త్రీ దగా చేయబడుతోందని ఈ పత్రిక ఘోషించింది. స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడ్డ స్త్రీల పత్రికల్లో స్త్రీల సమస్యల్ని గూర్చి ఎక్కువగా చర్చించిన పత్రిక ఆంధ్ర మహిళ!

ఈ పత్రికా ప్రతులు దాదాపు అన్ని లభిస్తున్నాయి. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో.

"....ఆంధ్రదేశంలో మహిళాభ్యుదయాశయాలు అభివ్యక్తం చేసేందుకు అనువైన పత్రికా సాధనం లేనియెడల, హృదయంలోని భావాలు హృదయంలోనే మాటుమణిగిపోతాయి! విత్తు నాటనిదే చెట్టు కాదన్నట్లు, ప్రచార సాధనం లేనిదే భావ ప్రభావం లోకాన్ని ఆవరించదు. విజ్ఞాన బీజాలు వెదజల్లిన గాని ఉజ్జీవనాంకురాలు మొలకెత్తవు.

"అట్టి కార్య భారాన్ని శిరసావహించి ఆంధ్ర నారీ సంఘానికి అండగా అనుగు సోదరిగా, ఆశయ ఫలంగా 'ఆంధ్ర మహిళ' అభ్యుదయ పతాక హస్తమై అవతరించి అంజలి ఘటిస్తున్నది" అని ఆంధ్ర మహిళ ప్రథమ సంచిక ప్రచురణ సందర్భంలో పత్రికాధిపతులు తమ పత్రికాశయాన్ని ప్రకటించారు.

ఇవీ స్వాతంత్ర్యానికి పూర్వం తెలుగులో వెలువడిన స్త్రీల పత్రికలు! ఇందులో అన్ని పత్రికలు లభించలేదు. దొరికిన కొన్ని పత్రికల ప్రతుల ఆధారంగా ఆ పత్రికలు స్త్రీల సమస్యలను ఎంత వరకు చర్చించాయి! ఆయా పత్రికలు ఆ రకంగా రూపొందడానికి కారణాలేవిటి? వంటి ప్రశ్నలకి సమాధానాలు వెతుక్కుంటూ తర్వాత అధ్యాయంలోకి వెళ్ళడం జరుగుతుంది.

జ్ఞాపికలు

1. కొలకలూరి ఇనాక్, వ్యాసపరిణామం. పుట 377
2. హిందూజన సంస్కారిణి, సం. 3. సంచిక-8, 1888. మార్చి. పుట 205
3. రాయసం వెంకటశివుడు ఆత్మచరిత్ర. పుట 456
4. అక్కిరాజు రమాపతిరావు వీరేశలింగం సమగ్ర పరిశీలన పుట 207
5. రాయసం వెంకటశివుడు ఆత్మచరిత్ర. పుట 228
6. తెలుగు జనానా & సతీహిత బోధిని సంపుటి 12 సంచిక 3, సెప్టెంబరు-1904.
7. మన్యం వెంకట సుబ్బమ్మ 'ఒక ప్రకటనము-ఒక మనవి' సావిత్రి. 1904 మార్చి, సంపుటి 1, సంచిక 3.
8. రాయసం వెంకటశివుడు ఆత్మచరిత్ర. పుట 454
9. మన్యం సుబ్బమగారు సావిత్రి పత్రికలో కూడా ఒక వందెం వేశారు.
10. రాయసం వెంకటశివుడు ఆత్మచరిత్ర. పుటలు 455-456
11. హిందూ సుందరికంటె ముందు 1892 లోనే డ్రైడన్ దొరసాని 'ఉపాధ్యాయోపయోగి'ని అనే పత్రికను నడిపారు. అయితే అది స్త్రీల కోసం ఉద్దేశించిన పత్రిక కాదు. స్త్రీ నడిపిన పత్రిక, అందుకని దానిని పరిశోధనా పరిధిలోకి తీసుకోలేదు.

# 3

# పత్రికల్లో అంశాలు-చర్చ

ఇంతకు ముందు అధ్యాయంలో స్త్రీల పత్రికల ప్రచురణకు సంబంధిం చిన వివరాలు ఇవ్వడం జరిగింది। ఈ అధ్యాయంలో స్త్రీల పత్రికలు ఏ అంశాల్ని ఏ విధంగా చర్చించాయి! ఆయా విషయాల పట్ల ఈ పత్రికల దృక్పథం ఏమిటి ! అని పరిశీలించటం జరుగుతుంది.

ఈ పత్రికలు 1883 నుంచి 1947 వరకు ఒకే స్వభావంతో ఉన్నా యని చెప్పలేము ! అట్లాగే అన్ని పత్రికలు స్త్రీల సమస్యల్ని చర్చించటానికే వెలుపడ్డాయని చెప్పలేము. ఆయా పత్రికాధిపతుల దృక్పథాన్నిబట్టి ఆయా పత్రికల స్వభావం రూపుదిద్దుకొంది. 19వ శతాబ్దంతంలోనూ, 20వ శతాబ్ది ఆరంభంలోనూ దేశంలో విపరీతమైన మార్పులు సంభవించాయి. వాటి కను గుణంగానే స్త్రీల పత్రికల్లోనూ మార్పులు వచ్చాయి.

మొదట్లో స్త్రీల పత్రికలు పురుష సంపాదకత్వంలో వెలువడ్డాయి. 20వ శతాబ్ది ఆరంభం నుండి స్త్రీల పత్రికలకు సాధారణంగా స్త్రీలే సంపాద కత్వం వహించారు. పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రికలకి, స్త్రీల సంపాదకత్వంలో వెలువడిన పత్రికలకి ఒక స్పష్టమైన తేడా కనిపిస్తుంది. పురుష సంపాదకత్వంలో నడిచిన పత్రికలు స్త్రీకి హితబోధ చేసేవిగాను, ఆమెను నైతికంగా ఉన్నతురాల్ని చేయడానికి పాటు పడేవిగాను ఉండేవి. స్త్రీల సంపాదకత్వంలో వెలిసిన పత్రికలు స్త్రీల హక్కుల్ని ప్రశ్నిస్తూనే తమను తాము పురుషులకు అనుచరిణులుగా వర్ణించుకొనేవి.

ఈ పత్రికల్లో 1883 నుంచి 1920 వరకు వచ్చిన వాటి స్వభావం ఒక విధంగాను, 1920 నుంచి 1947 వరకు వెలువడిన పత్రికల స్వభావం ఒక విధంగాను అంచనా వేయవచ్చు. మొదటి దశలో వచ్చిన పత్రికల ముఖ్య ధ్యేయం స్త్రీని విద్యావంతురాల్ని చేయడం! సంఘసంస్కరణ, రెండో దశలో

వచ్చిన పత్రికలు స్త్రీ విద్యావసరాలతో పాటు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గురించి, దేశంలోని రాజకీయ వాతావరణాన్ని గురించి చర్చించేవి. మొత్తం మీద స్త్రీల పత్రికల్లో రాజకీయాలకు సంబంధించిన అంశాలు చాలా తక్కువ. 1920 వరకు ఆ అంశాలు అసలు లేవనే చెప్పాలి. తరువాత వచ్చిన "గృహలక్ష్మి" 'ఆంధ్ర మహిళ" వంటి పత్రికలు రాజకీయాల్ని గురించి కొంతవరకు చర్చించాయి. ఆంధ్ర మహిళ వెలువడే నాటికి దేశ పరిస్థితులలోనూ చాలా మార్పులు వచ్చాయి. స్త్రీలు విద్యావంతులవడమే గాక, స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించారు! తదనుగుణంగా ఆంధ్ర మహిళ పత్రిక ఆ విషయాల్ని గురించి చర్చించింది. అంతకు ముందున్న పత్రికలు దేశంలో ఎన్ని ఉద్యమాలు జరుగుతున్నా పట్టించుకోకపోవడం ఆశ్చర్యకరమైన విషయం.[1]

వివిధ అంశాల్ని స్త్రీల పత్రికలు ఏ విధంగా చర్చించాయనే ముందు మొదటి స్త్రీల పత్రిక "సతిహిత బోధిని" ప్రచురించబడే నాటికి స్త్రీ పట్ల ఆ పత్రికాధిపతుల దృక్పథం ఏమిటి? ఎందుకు స్త్రీలకోసం పత్రిక ప్రచురించారు! అనే విషయం చూడడం జరిగింది.

మొదట వెలువడిన స్త్రీల పత్రిక "సతీహిత బోధిని", పేరులోనే ఈ పత్రిక ధ్యేయం వ్యక్తమౌతోంది. ఆడ వారికి హితబోధ చేయడం, అని 19వ శతాబ్దంలో స్త్రీలకు హితబోధ చేయాల్సిన అవసరం ఏమిటి? అనే ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానం ఈ పత్రిక స్త్రీని చూసిన దృక్పథంలోనే గోచరమౌతుంది.

> "స్త్రీలు చదివి వివేకముగల వారైన పక్షమున తామెప్పుడును పరుష వాక్యములును తిట్లును నోటరానియ్యక యెవ్వరితోను కలహము పెట్టుకొనక శాంతత గల వారయి, మంచి నడవడిక ,గల వారయి యుందురు."[2]

విద్యా గంధమును, యుక్తాయుక్త వివేకమును లేకపోవటం వలన మనలోని స్త్రీలు పలువురు ప్రత్యక్ష రాక్షసులుగనున్నారు.[3]

"సాధారణముగా మనలోని స్త్రీలు నలుగురొక్కచోట కూడినప్పుడు

వారు విద్యాగంధ మెఱుగని వారు గనుక ముచ్చటించుటకు మంచి సంగతులు దొరకక పరుల దోషములను గురించి మాటాడుకుందురు."4

మనలో సాధారణముగా స్త్రీలు కారణము లేకయే కలహము లాడుదురని యొకనింద వచ్చియున్నది.... లోకానుభవమును బట్టి చూడగా ఈ నింద నిష్కారణముగా వచ్చినవిగా కనబడదు.''5

''మనదేశములోని స్త్రీలలో సాధారణముగా కొండెములు చెప్పుట యొక గొప్ప తప్పిదముగా నున్నది.''6

''స్త్రీల యభివృద్ధిని మిత్తమయి యక్కడక్కడనుత్తమ పురుషులు చేయు ప్రయత్నములకు మూఢతా పిశాచా వేశముచేత స్త్రీలే ప్రతిబంధ కారిణులగుచున్నారు.''7

''భార్య యనుసరింపవలసిన ధర్మము లెన్నియున్నను అవి యన్నియు గృహ కృత్యములతో సంబంధించినవే కాని యితరములు కావని భార్యా పర్యాయ పదమయిన గృహిణీ శబ్దమే తెలుపుడు చేయుచున్నది.''8

ఇదీ తొలి స్త్రీల పత్రిక ప్రచురించిన వారికి స్త్రీ పట్ల వున్న దృక్పథం స్త్రీ మూర్ఖురాలై కలహప్రియమై ఇంటిని నరక తుల్యం చేస్తోంది. భర్తను అన్ని విషయాల్లోనూ బాధిస్తోంది. మూఢత్వానికి, మూర్ఖత్వానికి మూలస్థానంగా ఉంది. కాబట్టి అటువంటి స్త్రీని సంస్కరించాలని ''సతీహిత బోధిని'' పత్రిక ప్రచురించబడింది. ఇందుకు అనుగుణంగానే 'సతీహిత బోధినిలో పాతివ్రత్యం', 'సద్వర్తనము', ''కొండెములు చెప్పుట'', 'భూతదయ' వంటి వ్యాసాలు ప్రకటించబడేవి. అయితే స్త్రీలలో వున్న ఈ దుర్గుణాలన్నిటికి ఆమె విద్యావంతురాలు కాకపోవటమే కారణం అని, ఆమెని విద్యా వంతురాల్ని చెయ్యాలని సతీహిత బోధిని ప్రయత్నించింది. 1920 వరకు వచ్చిన స్త్రీల పత్రికలు సాధారణంగా చర్చించిన అంశాలు!

1. స్త్రీ విద్య 2. పాతివ్రత్యము 3. బాల్య వివాహాలు 4. గృహ నిర్వహణము 5. స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వంటి విషయాలు. వీటిలో ఒక్కో అంశాన్ని తీసుకొని వీటిపట్ల ఈ పత్రికల దృక్పథం ఎట్లా ఉండేదో

పరిశీలించడం ఈ అధ్యాయంలో జరుగుతుంది. స్త్రీ జీవితం పూర్తిగా గృహ సంబంధంగానే ఉండటంతో ఆమె సమస్యలు కూడా ఆ పరిధిలోనే ఉన్నాయి.

స్త్రీ విద్య : సమాజం పురోగమించాలంటె సమాజంలో సగభాగమైన స్త్రీ పురోభివృద్ధి ముఖ్యమనే విషయం నాడు సర్వత్రా గుర్తించబడింది. సమాజంలో సగభాగం సమాజంతో ఏ మాత్రం సంబంధం లేకుండా ఓ ప్రక్క మగ్గిపోతుంటే మిగిలిన సగభాగం సమాజోద్ధరణకు పూనుకోవటం ఉట్టికెక్క లేనమ్మ స్వర్గానికెక్క ప్రయత్నించినట్టుగా ఉంటుందని ముందు స్త్రీని విద్యావంతురాలిని చెయ్యాలని సంకల్పం కలిగింది.

> "సద్విషయాలలో స్త్రీల తోడ్పాటును పొందఁదలఁచిన పక్షమున ముందుగా వారి నాశ్రయించి యున్న మూఢతా పిశాచము తొలఁగునట్లుగా వారిని విద్యావతులును గాను వివేకరాంద్రను గాను జేయవలెను."9

సమాజ కార్యక్రమాల్లో స్త్రీ సహకారం అవసరమనే ఆలోచన గలిగి, తదనుగుణంగా స్త్రీని తయారుచేయాలనే ప్రయత్నం ప్రారంభం అయింది. స్త్రీని తమ కనుగుణంగా, సహాయకురాల్నిగా తయారు చేసుకోవాలంటే విద్య ముఖ్య సాధనమనే అభిప్రాయం కూడా కలిగింది. స్త్రీలకు విద్య అవసరం అని తేల్చాక స్త్రీకి ఎటువంటి విద్య అవసరం! ఆవిడ పురుషులతో సమానమయిన విద్య నేర్చుకోవాలా! తద్భిన్నమైనది నేర్చుకోవాలా అనే చర్చ మొదలైంది. స్త్రీ విద్యను గూర్చి నాటి స్త్రీల పత్రికలు అన్నీ ఇంచుమించుగా ఒకే రకమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చాయి.

స్త్రీలు దేశ చరిత్ర, గణితం, ప్రకృతి శాస్త్రం, వ్యాకరణం మొదలైన అంశాల్ని పురుషులతో సమానంగా నేర్చుకుంటూనే వారు ప్రత్యేకంగా నేర్చుకోవలసిన విద్యలు కొన్ని వున్నాయని నాటి పత్రికలన్నీ ప్రచురించేవి!

> "పైన చెప్పినవి గాక స్త్రీలు ప్రత్యేకముగా నేర్చుకోవలసిన విషయములును కొన్ని గలవు. అవి గృహ కృత్యముల తీర్పును నేర్పెడు గ్రంధములు. పాతివ్రత్య ధర్మములను బోధించు పుస్తకములను, కుట్టు

పనియు, సంగీతమును, శిశువులను పెంచురీతియునయి వున్నవి.''10 ''బాలికలకు గృహకృత్య నిర్వహణము నేర్పవలయును. ఇంటిలోని ప్రతి వయసు వచ్చిన బాలికయును, ఇంకొక బాలికను పెంచునట్లు చేయవలయును. దీనినిబట్టి బాలికలు. తమ తమ్ములను, చెల్లెలను పెంచు విధమును, ముందు తాము పెద్దవారైనపుడు తమ పిల్లల పెంచు రీతిని నేర్చుకొందురు.

''ఈ పాఠశాల ముందు బాలికలకు సంసారమున నుపయోగించు వస్తువులను జేసికొనుట నేర్పవలయును. చిన్న చిన్న పరుపులు చిత్రములగు ముగ్గులు పెట్టుట, వంటచేయుట, వ్యాధిగ్రస్థుల కుపచార ములు చేయుట, మొదలగునవి నేర్పవలయును.''11

''పురుషులు సంపాదించు విద్య కంటెను మనకు సంగీతము, పాక శాస్త్రము, కుట్టుపని, శిశుపోషణ మొదలగునవి హెచ్చుగా కావలసి యుండెను.''12

''దేశచరిత్రను ముఖ్యముగా బాలికలకు చెప్పవలయును.... స్వజాతీ యత దేశాచారములు, అలవాటులు, మతము, ఆత్మగౌరవము స్త్రీ విద్య యందు ముఖ్యముగా గమనింపవలయును.... శరీర శాస్త్రమును వార లకు బూర్తిగా జెప్పవలయును.... ఈ విద్యాశాఖ ఆయుర్వేద శాస్త్ర ముతో సంబంధించి యుండవలయును.... చిత్ర లేఖనము స్త్రీ విద్యకు మూల పీఠము వంటిది.''13

''స్వకుటుంబ పాలనా సమర్థత వహించుటకు స్త్రీలు విద్యావంతు రాండ్రుగా నుండుట యవసరమను విషయము సర్వజన సమ్మతము స్త్రీలు విద్యాభ్యాసమున కర్హులా? యనర్హులా? యను విషయ వివాద మున కిపుడవకాశము లేదు. అది ఏనాడో యంతరించి ముద్దియలు విద్దియం గఱచుట మేలని సకల జనులచే నిపుడంగీకరింపంబడి.... కొందఱు మానధనులిపుడు తమ సుదతులకుం దామే స్వయముగా విద్య గఱపి వివేకురాండ్రనుగా జేయుచున్నారు........

''స్త్రీలకు విద్యా స్వాతంత్ర్యమవసరము. అందు యుక్తాయుక్త విచార

మత్యంతావశ్యకము. పురుష విద్య యనవసరము. అట్టి విద్య యువిదల కనర్థదాయకము. గృహ పరిపాలనా విధులెఱింగి శిశు పోషణ క్రమ మూరసి, బాలశిక్షణా విధాన వభ్యసించి, గణితారుగ్య పాక పాకశాస్త్రముల నేర్చి. నీతి మతాచార దైవభక్తియందారితేరి, ఇహమందు కీర్తిని పరమందు సుఖమునిచ్చు విద్యయే స్త్రీలకు ముఖ్యావసరము.''14

ఇవి సాధారణముగా స్త్రీ విద్యని గురించి జరిగిన చర్చలు, తలెత్తిన ఆలోచనలు. సంసారాన్ని సక్రమంగా నిర్వహించుకోవటానికి స్త్రీకి విద్య కావాలి! అనే అభిప్రాయం సర్వత్రా గోచరమౌతుంది. స్త్రీ పురుషులతో సమానంగా విద్యలు నేర్చినప్పటికి వారు ప్రత్యేకంగా ఇంటిపని, వంటపని నెరవేర్చే విధంగా విద్యా విధానం ఉండాలని దేశ భాషల్లో స్త్రీకి విద్య నేర్పించాలని అభిప్రాయ పడేవి! పురుషులంతా ఇంగ్లీషు చదువులు వెంట పరుగులు తీస్తున్నారు కాబట్టి సంప్రదాయకమైన సంస్కృతాన్ని స్త్రీలు నేర్చుకొంటే ఆ భాష నశించిపోకుండా ఉంటుందని భావించేవి. హిందూ మతం, దేశాచారాలు, సంప్రదాయాలు మొదలయిన విషయాలన్ని స్త్రీ విద్యలో చోటు చేసుకోవాలని కూడా ఈ పత్రికలు వాంఛించాయి. అయితే దేశంలో ఇంగ్లీషు రాజభాషగా చలామణి అవుతోంది కాబట్టి స్త్రీలు ఇంగ్లీషును కూడా నేర్చుకొంటే తప్పులేదని, అయితే ఇంగ్లీషు విద్యని నేర్చిన స్త్రీలు పాశ్చాత్య స్త్రీలలాగా వారి వేషభాషల వ్యామోహములో పడకూడదని హెచ్చరించేవి.15

సంగీతం, చిత్రలేఖనం వంటి విద్యలు స్త్రీలకు అత్యంత అవశ్యకాలనీ, తమ భర్తల్ని సంతోష పెట్టడానికి సంగీతం, ఇంటిని అందంగా తీర్చిదిద్దటానికి చిత్రలేఖనం ఎంతగానో ఉపయోగిస్తాయని విద్య ద్వారా స్త్రీలకు వీటిని నేర్పాలనే అభిప్రాయం నాటి పత్రికలలో కనిపిస్తుంది.

స్త్రీలకు స్త్రీలే విద్య నేర్పాలని, (స్త్రీ ఉపాధ్యాయినులు దొరికేవరకు వృద్ధులయిన పురుషులను ఉపాధ్యాయులుగా నియమించవచ్చు.) స్త్రీలు బాలికా పాఠశాలల్లో ఉపాధ్యాయినులుగా పని చేయాలని, ఉపాధ్యాయ వృత్తిలో పురుషుల కంటే స్త్రీలే ఎక్కువ రాణిస్తారని పత్రికలు వ్రాసేవి.

స్త్రీ తన సహజమైన సహనగుణంతో విద్యార్థుల్ని అర్థం చేసుకొని వారి కను గుణముగా బోధ చేయగలుగుతుందని, స్త్రీలే ఉపాధ్యాయినులుగా ఉండటం వలన బాలికలను పాఠశాలలకి పంపడానికి వారి తల్లి దండ్రులకి ఎటువంటి అభ్యంతరం ఉండదని బాలికలు కూడా స్త్రీలే ఉపాధ్యాయినులు అయితే తమ సందేహాలను నిర్మొహమాటంగా తీర్చుకోగలరని ఈ పత్రికలు సూచించేవి.

స్త్రీ చదువుకుంటే కుటుంబమంతా చదువుకున్నట్లని, ఆమె తన బిడ్డల్ని సవ్యమయిన మార్గంలో పెంచగలుగుతుందని, తాను స్వయంగా పరి శుభ్రత, దేహారోగ్యాలు పాటించి, ఇంటి పరిసరాలు శుభ్రంగా వుంచి, బిడ్డలను ఆరోగ్యవంతులుగాను, వినయ విధేయతలు గలవారిగాను తీర్చిదిద్దుతుందని, స్త్రీ చదువుకుంటే తన భర్త యెడల గౌరవం బంధువుల యెడల ప్రేమాద రాలు పెంపొందించుకొని అందరికీ అనుకూలమయిన. ఆదర్శవంతమయిన గృహిణిగా తయారవుతుందనీ దృష్టాంతాలతోసహా ఈ పత్రికలు రాస్తుండేవి.

చదువులేని స్త్రీ తన బిడ్డలని చదువు విషయంలో దండించలేదని, భర్తలు పిల్లల్ని చదువు విషయంలో శిక్షించబోగా వారికి అడ్డు వెళ్ళి బిడ్డ లను చెడగొట్టడానికి కారణమవుతుందని 'చదువులేని స్త్రీ బిడ్డలకి శత్రువు' వంటిదని ఈ పత్రికలు తరచూ రాస్తూండేవి.

స్త్రీలు దేశ చరిత్రలు మొదలైనవి చదవడంవలన, గొప్ప గొప్ప వీరుల కథలను తమ బిడ్డలకు చెప్పి వారిని ధైర్య సాహసాలుగల వారిగా తయారు చేస్తారని, పిల్లలకి దేశభక్తి మొదలైనవి పెంపొందిప జేస్తారని, ప్రకృతిశాస్త్రం, వైద్యశాస్త్రం మొదలైనవి చదవడంవలన స్త్రీలు, ప్రతి చిన్న జబ్బుకి వైద్యులకోసం పరుగులు పెట్టక చిన్న చిన్న వైద్యాలని వారు ఇంటి వద్దే చేసుకోగలుగుతారని, చదువుకొన్న స్త్రీలు ప్రతి చిన్న పనికి భర్తల మీద ఆధారపడక తమకు తాము స్వయంగా నెరవేర్చుకొని భర్తలకి ఎంతో సహాయకారిణులుగా ఉంటారని, చదువువలన స్త్రీలకు తెలివు, వ్యవహార జ్ఞానం అలవడుతాయని స్త్రీ విద్యని గూర్చిన లాభాలుగా పత్రికలు రాస్తూండేవి.

వీటన్నిటికంటె ముఖ్యంగా స్త్రీ విద్యవలన స్త్రీ నైతికంగా ఉన్నత

స్థాయికి చేరుతుందని, ఆమెని నిర్బంధించి ఉంచి, విద్యాగంధం లేకుండా చేస్తే ఆమె అక్రమ పద్ధతులకి పాల్పడుతుందని, స్త్రీకి కనుక విద్య నేర్పితే, పురుషులకి వారిని ఎల్లప్పుడు అంటిపెట్టుకొని వుండి నిర్బంధించాల్సిన అవసరం ఉండదని, స్త్రీలు తమంతటతామే సద్వర్తనులౌతారని ఈ పత్రికలు ప్రచురిస్తాయి.

స్త్రీలు చదివి ఉద్యోగం చేయాలా! ఊళ్ళేలాలా! అనే వారికి ఈ పత్రికలు స్త్రీలు ప్రత్యేకంగా ఉద్యోగం చేయాల్సిన అవసరం లేదు. వారికి గృహ నిర్వహణమే ఉద్యోగం, విద్య ద్వారా స్త్రీలు గృహ నిర్వహణ సక్రమంగా చేసి 'ఉత్తమ గృహిణి'లు కాగలరని సమాధానం చెప్తాయి. స్త్రీ విద్య సర్వత్రా ఆమోదించబడిన తర్వాత విద్యావతులపట్ల సమాజంలో ఒక రకమైన హేళన భావం చోటు చేసుకుంది. విద్యావతులపట్ల సమాజ వైఖరిని నిరసిస్తూ ఆంధ్ర మహిళ పత్రిక స్త్రీ విద్యాశయాన్ని చాటేది.

> ''విద్యావతులు పాడైపోతున్నారనుట సరిగాదు. మనుష్యులను పాడు చేయగలది బుద్ధిగాని విద్యగాదు. గృహ కృత్యాలు నిర్వహించటానికైనా స్త్రీలకు విద్య అవసరమే. తమ ఆరోగ్యము, బిడ్డల ఆరోగ్యము కాపాడుకోవటానికి, చిన్న రోగాలకు కూడా వైద్యులకై పరుగెత్తకుండా స్వల్ప చికిత్సలు చేసుకోటానికి వైద్య గ్రంథాలు చదివి తెలుసుకోవలసి వుంటుంది. అవి చదవడానికైనా విద్య అవసరమే!
>
> ....మన స్త్రీలకు కూడా అట్టి శక్తి వుంటే దేశము యెంత బాగుపడి వుండేది పురుషులతోపాటు విద్య పరిశ్రమలు నేర్పించి స్త్రీలకు వృత్తుల ద్వారా స్వతంత్ర జీవనము కలిగిస్తే యెంతో ఉన్నతి ఉంటుంది.''16

1944 నాటికి స్త్రీ విద్యపట్ల దృక్పథం మారింది! విద్య ద్వారా స్త్రీ స్వతంత్ర జీవితం గడపాలనే ఆలోచన వచ్చింది! స్త్రీ విద్య గృహ నిర్వహణకే చాలు అనే పరిధిని దాటి స్త్రీకి ఆర్థికంగా సహాయం చేయగలగాలనే స్థాయికి ఎదిగింది. విదేశాల్లో స్త్రీలు పురుషులతోపాటు సమానంగా పారిశ్రామిక విద్యల్ని నేర్చుకోవటం వలన ఆ దేశాలెంతగానో వృద్ధిచెందుతున్నా

యని, మనదేశంలో కూడా అన్ని రకాల విద్యల్ని నేర్చగలిగితే ఈ దేశం కూడా అభివృద్ధి చెందుతుందని! విద్య స్త్రీకి స్వతంత్రాలోచన, స్వతంత్ర జీవనాన్ని కలిగించాలని వాంఛించేది!

స్త్రీ విద్యకి సంబంధించి ఆంధ్ర మహిళ కాలానికి పై ఆలోచనలు వచ్చినా ప్రాథమికంగా స్త్రీ విద్య గృహ నిర్వహణకి తోడ్పడేదనే అభిప్రాయం కూడా ఇంకా స్థిరపడింది.

పాతివ్రత్యం: 19వ శతాబ్ది అంతంలో, 20వ శతాబ్ది తొలిదశ కాల్లోని స్త్రీల పత్రికలు స్త్రీ విద్య తరువాత అత్యంత ప్రాముఖ్యం ఇచ్చి చర్చించిన విషయం పాతివ్రత్యం. 19వ శతాబ్ది స్త్రీ పాతివ్రత్యానికి భంగం వాటిల్లిందా! అనే అనుమానం వస్తుంది; ఈ పత్రికల ఘోష చూస్తుంటే! స్త్రీ పాతివ్రత్యాన్ని ఎట్లా కాపాడాలి, స్త్రీలు ఏ విధంగా పాతివ్రత్యాచరణ చెయ్యాలి అనే అంశాల్ని ఈ పత్రికలు సదా చర్చిస్తుండేవి. అసలు పాతివ్రత్యానికి హిందూ స్త్రీ పెట్టింది పేరు కదా! ఆలాంటిది 19వ శతాబ్దంలో స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు పెట్టి పాతివ్రత్యమో! దాన్ని ఆచరించండి! అని ఘోషించాల్సిన అవసరం ఏమిటో అర్థం కాదు!

> "లోకములో స్త్రీలకు పతివ్రతా ధర్మముతో సమానమైన ధర్మము మఱియొకటి లేదు కాబట్టి ఓ నారీ మణిలారా! మీరు సమస్త విధముల చేతనూ పాతివ్రత్యమును కాపాడుకొనుట కయి ప్రయత్నపడవలయును."17

> "సమస్త ధర్మములలోను ఈశ్వర భక్తియుం బతి భక్తియు మనకు ముఖ్య ధర్మములై యున్నవి శ్రేష్టతరమగు దైవభక్తితో సరిపోల్పబడియుండుటచేఁ బతిభక్తి మన కవశ్యా చరణీయముగాఁ గానబడుచున్నది. ఇట్టి సర్వజనాదరణీయమగు పాతివ్రత్యము మనచే నెంత క్రమముగా నాచరింపఁబడిన నంత శ్రేయస్కరమనీ వేఱుగఁ జెప్ప నక్కఱలేకయే యెల్లరకుం దెలియదగియున్నది."18

> "భర్త కురూపియైనను, ధనహీనుడైనను, అతని నిందింపక కాల

విశేషముచే నతనికి దుఃఖములు గలిగిన నుపాయముచే నతని నోదా ర్చుచూ, సమయ మెఱింగి యతనికి మజ్జన భోజనము విడుచు, సత్కార్యములందుఁగాని బంధు మర్యాదలందుఁగాని యతని మనోభి లాషము లెఱిగి నడుపుచూ, నతని తృప్తియే తన తృప్తియనియు నతని మనోభిలాష తన సుఖమనియుఁదలఁచి వర్తించునదియే పతి వ్రత ... కావున మన పెద్దల యాచారములఁ బాటించి పాతివ్రత్య మును జరుపుట శ్రేష్టము.''19

ఈ విధంగా నాడు పత్రికలు పాతివ్రత్యా చరణాన్ని గురించి ప్రచారం చేయడమే కాక, సుశీలా విజయం సత్యవతీ చరిత్రము వంటి సాహితీ రూప కాల ద్వారా కూడా పాతివ్రత్య మహాత్మ్యాల్ని గూర్చి ప్రచురిస్తుండేవి.

హిందూ స్త్రీలకు పాతివ్రత్యాన్ని గురించి ఇంతగా బోధించాల్సిన అవ సరం ఏమిటి? అనే ప్రశ్నకి మన సంప్రదాయాన్ని భంగం లేకుండా పాటించు కోవాలనే తపన. ఆంగ్లేయ స్త్రీల గురించి మన వారిలో వుండే దురభిప్రాయం సమాధానాలుగా ఊహించవచ్చు. వారు అదుపాజ్ఞలు లేకుండా విచ్చలవిడిగా పరపురుషులలో సంచరిస్తారనే తప్పుడు ప్రచారం కారణం అయి వుండవచ్చు. విద్యావ్యాప్తి వలన ఆ ప్రభావం మన స్త్రీల మీద ఎక్కడ పడుతుందోననే భయం ఉండి వుండవచ్చు. ఇక రెండో కారణం సహజంగానే అనాడు స్త్రీలకు పాతివ్రత్యా చరణం గురించి పదేపదే చెప్పాల్సిన అవసరం కలిగి వుండ వచ్చు. ఎందుకంటే పదేళ్ళ పసిపిల్లకి వృద్ధులతో పెళ్ళి చేస్తే, వీరికి వయసు వచ్చేసరికి, ఆ వృద్ధులు గతించడం జరిగేది. ఆ స్త్రీలు ఈ సంఘాచారాలకి కట్టుబడలేక రహస్యంగా తమ కోరికలను తీర్చుకోవడానికి ప్రయత్నించే వారు. ఇంతేగాదు ఏ కురూపినో, కుంటివాణ్ణో ఎవరయినా సరే మగవాడయితే చాలుననే ధోరణిలో ఎవరికి పడితే వారికి ఆడపిల్లనిచ్చి వివాహం చేసేవారు. ఇందువల్ల కూడా స్త్రీలు తమ మనస్సును చంపుకోలేక, ఆ భర్తతో కలిసి వుండలేక సతమతమయ్యేవారు. అందుకే స్త్రీల పత్రికలు భర్త కురూపి అయినా, దుష్టుడయినా, దుర్మార్గుడైనా, వాడ్ని ఎటువంటి పరిస్థితుల్లోను విడిచి పెట్టకూడదు. పరపురుషుల వైపు దృష్టి సారించకూడదు, అనే బోధలు

చేసేవి. తమలో లోపం వున్నప్పుడే తమ భార్యలు పరాయి వాళ్ళ వైపు చూస్తారేమోననే అనుమాన స్వభావం స్త్రీని నైతికంగా వున్నతురాల్నిగా చూడనీయ లేదు. లోపాన్ని కప్పిపుచ్చుకోవడానికి తమ భార్యల్ని అనుమానించేవారు.

> ''మానభంగము కంటె ప్రాణభంగము మేలని యెంచి కొన్ని సమయముల యందు తమ ప్రాణములకును ఎదుటి వారి ప్రాణములకు గూడ తెగింతురు. అందుచేతనే సదా పురుషులు స్త్రీల పాతివ్రత్యమును రక్షించుటకయి పూర్వకాలము నుండియు సర్వప్రయత్నములు చేయు చున్నారు.''20

పురుషులు స్త్రీల కోసం చేయదగ్గ పనులు ఎన్నో వుండగా పనిగట్టుకొని పాతివ్రత్యాన్నే కాపాడాలని ప్రయత్నించడం దేనికి? లోపం తమలో పెట్టుకొని లోకువగా ఉన్నారు కదా అని స్త్రీని కించపరచడం! తన భార్య కొంచెం అందంగా వుంటే ఇక ఆమెను గూర్చి ఆ భర్త తీసుకొనే జాగ్రత్తలు, ఆమెకు విధించే నిర్బంధాలు అతికఠినంగా ఉండేవి.

ఒక విధంగా ఇటువంటి పరిస్థితి కలగడానికి కారణాలు, బాల్య వివాహాలు, ఈడుజోడు కుదరని వివాహాలు, బాల్య వివాహాల వల్ల వితంతువులైన వాళ్ళు ఒకరకంగా పతితులైతే, వయోభేదం— విపరీతమైన వివాహాల వల్ల, వరహీనం మూలంగా భర్తలతో సుఖం లేక కొందరు వేరే దారి త్రొక్కేవారు! అటువంటి పరిస్థితిని చక్కదిద్దడానికి పాతివ్రత్యాన్ని గూర్చి అంతగా ప్రబోధించాల్సి వచ్చిందేమో!

విద్య ద్వారా స్త్రీకి పాతివ్రత్య మహత్యం తెలియజేసి ఆమె తనంతట తానే ఏ నిర్బంధాలు లేకుండా మనస్ఫూర్తిగా పాతివ్రత్యాన్ని పాటించేలా చేయాలని నాటి సంస్కర్తల ఆశయం! సతీహిత బోధిని ముఖపత్రం మీద మనుధర్మ శాస్త్రంలోని శ్లోకం ముద్రించబడేది! పురుషుడిచే రక్షింపబడే స్త్రీ కంటే తనను తాను రక్షించుకొనే స్త్రీ ఉత్తమమైనదని ఆ శ్లోకార్థం! స్త్రీ తన పాతివ్రత్యాన్ని తను కాపాడుకోవాలి గాని, పురుషుల చేత రక్షింపబడుతూ ఉండకూడదని దాని అంతరార్థం.

స్త్రీ పట్ల ఆమె భర్త సదా అనుమాన దృష్టితో ఉండేవాడు. ఈ పరిస్థితి మనుధర్మశాస్త్ర కాలం నుంచి ఉన్నదని పై శ్లోకం ఋజువు చేస్తుంది! అప్పటి సామాజిక పరిస్థితులేవిటో అంచనావేయడం ప్రస్తుతం సాధ్యంకాదు. కాబట్టి ఈ పత్రికల కాలానికి ఆ శ్లోకం ఏ విధంగా ఉపయుక్తమయిందని ఆలోచిస్తే- ముసలి భర్తలు తమ పడుచు భార్యల శీలాన్ని శంకిస్తూ, రక్షించాలని తాపత్రయ పడేవారు. స్త్రీలలో కూడా పరపురుషుడి యెడల చిత్త చాంచల్యం కలుగకుండా తన భర్తనే దైవంగా భావించి నడుచుకోవాలనే భావంతో ఆ శ్లోకం అక్కడ చేర్చడం జరిగి ఉంటుంది!

స్త్రీ శీలాన్ని శంకించే భర్తలకి బుద్ధి చెప్పడం పోయి, అటువంటి అనుమానాలకి తావివ్వకుండా స్త్రీలే అణుకువుగా నడుచుకోవాలని బోధిస్తుంది సతీహిత బోధిని!

ఈ సమాజంలో స్త్రీ పరిస్థితి హేయంగా వుందని, వితంతువుల పరిస్థితి మరీ దుర్భరంగా ఉందని, వితంతువుకు పునర్వివాహం చేయడానికి సమాజం నుంచి ఎంతో వ్యతిరేకతని ఎదుర్కొని చివరికి ఫలితం సాధించిన సంస్కర్తలే స్త్రీ శీలం విషయం వచ్చేసరికి ఎందుకింత సంకుచితంగా ఆలోచించారో అర్థంగాదు! అయితే ఇది ఏ ఒక్కరి తప్పు కాదు! తరతరాలుగా ఈ సమాజంలో జీర్ణించుకుపోయిన పురుషాధిపత్య స్వభావం యిది! అందుకే సామాజికంగా స్త్రీని ఎంత పైకి తీసుకురావాలని ప్రయత్నించిన సంస్కర్తలైనా! ప్రకృతి సహజమైన శారీరక వాంఛలు స్త్రీ పురుషులకి సహజమని తెలిసీ అంగీకరించలేకపోయారు! పాతివ్రత్య రక్షణ పేరుతో స్త్రీని గృహ నిర్బంధం చేశారు!

స్త్రీని ఎంతగా అనుమానించారంటే "పురుషుల వలన భీతియు-నిర్బంధములను తృణప్రాయముగా చూచి మన మానము కాపాడుకొనవలయును. మన మొంటిగానున్నప్పుడెప్పుడైన దుర్బుద్ధి పుట్టవచ్చును గనుక సాధ్యమయినంత వఱకు గుణవంతురాండ్రను తోడుగా నుంచుకొనుము. అట్టి యిల్లాండ్రు దొరకరని తోచిన యెడల సద్గ్రంథకాలక్షేపము చేసికొనుచు మన మనస్సునకు దుర్మార్గపు చింతలకవకాశము లేకుండా చేసికోనటయె కాక మన హృదయ మెప్పుడును సన్మార్గము మీదకే పోవునట్లు చేయుటకయి జీవదయాపరుడయిన పరమేశ్వరుని నిత్యమును వేడుకొనుచుండవలయును."21

పాశ్చాత్య నాగరికతా ప్రభావం వలన స్త్రీ పాతివ్రత్యాన్ని ఎక్కడ అలక్ష్యం చేస్తుందోననే భయం ఏవాహ వ్యవస్థలోని విపరీతమైన లోపాలవల్ల నైతికంగా దిగజారిపోతున్న స్త్రీని ఉద్ధరించాలన్న తాపత్రయం 19వ శతాబ్దంలోని స్త్రీల పత్రికల చేత పాతివ్రత్యాన్ని గురించి ఇంతగా ఘోషింప చేశాయి. పాతివ్రత్యం అనేది ఒక విధంగా కుటుంబ వ్యవస్థ పటిష్ఠతకు సంబంధించినది. స్త్రీ పరపురుషుడితో సంబంధం ఏర్పరచుకోవడంవల్ల ఆ కుటుంబం విచ్ఛిన్నమయ్యే అవకాశం ఉంది. అదే పని పురుషుడు చేస్తే కుటుంబానికి వచ్చిన ప్రమాదం లేదు. హిందూదేశంలో కుటుంబాన్ని అన్ని విధాల కాపాడవలసిన బాధ్యత స్త్రీపై వుంది. కాబట్టి స్త్రీ కనుక తన దృష్టిని పరపురుషుడి వైపు సారించినట్లయితే ఆ కుటుంబం ఎదుర్కోవలసిన సమస్యలు అనేక రకాలుగా వుంటాయి. అందుకే ఒకరి కంటే ఎక్కువ మంది పురుషులతో సంబంధం వున్న స్త్రీకి కుటుంబ వ్యవస్థలో సంబంధం ఉండేది కాదు. ఆమెకి కుల స్త్రీలతో పాటు గౌరవం ఉండేది కాదు. కుటుంబ కట్టుబాటు అనే సదాశయంతో ఏర్పడినా పాతివ్రత్యాచరణం రానురాను మగవాడికి స్త్రీని కట్టుబాట్లో ఉంచడానికి ముఖ్య సాధనంగా తయారయింది. ఈ రకమయిన వాతావరణంలో వెలువడిన స్త్రీల పత్రికలు కూడా అందుకు భిన్నంగా ఆలోచించ లేకపోయాయి.

బాల్య వివాహాలు : ఏ ఆచారాలైనా సంఘ శ్రేయస్సుకోసం ఏర్పడతాయి. బాల్య వివాహాలు కూడా ఒకప్పుడు స్త్రీ పురుషుల అన్యోన్య దాంపత్యం కోసం ఏర్పరిచినవి కావచ్చు. చిన్నతనంలోనే పెళ్ళి చేయడం వలన అమ్మాయి, అబ్బాయి రాకపోకల ద్వారా ఒకరిపట్ల ఒకరు సరియైన అనురాగాన్ని పెంచుకోగలరనే దృక్పధంతో ఏర్పడిన ఆచారం రానురాను దురాచారంగా పరిణమించింది! అయితే ఈ బాల్య వివాహాలకి ముస్లింల దండయాత్రలు కూడా ప్రధాన కారణంగా చెప్పడం జరుగుతుంది! ఎందుకోసం ఏర్పరచినవైనా ఈ బాల్య వివాహాలు 19వ శతాబ్ది మేధావుల్ని కదిల్చి సంస్కరణకు పురిగొల్పాయి.

సంస్కరణావశ్యకత సమాజంలో ఎప్పటికపుడు ఉంటూనే వుంటుంది!

భావాలు మారినంత వేగంగా ఆచారాలు మారవు! మేధావి వర్గాల్లో తలెత్తిన భావ సంచలనం సామాన్య జీవిత విధానాన్ని మార్చడానికి కొంత వ్యవధి పడుతుంది। అదే విధంగా ఈ బాల్య వివాహాల్ని గూర్చిన చర్చలు 19వ శతాబ్దంలోనే ఆరంభమయినా చాలాకాలం వరకు ఈ ఆచారం తగ్గు ముఖం పట్టలేదు. ఇప్పటికీ ఈ దేశంలో బాల్య వివాహాలు చేసే వాళ్ళున్నారంటే ఆచారాల ప్రభావం ఒక సమాజంపై ఎంతగా ఉంటుందో ఊహించవచ్చు.

20వ శతాబ్ది తొలిదశకాల్లోని స్త్రీల పత్రికలు ఈ బాల్య వివాహాలని తీవ్రంగా ఖండించాయి.

> "....ఇప్పుడన్ననో ఆడ పిల్లలకు ఏడెనిమిది సంవత్సరములలోపునను మగపిల్ల వానికి పది పండ్రెండు సంవత్సరములలోపునను వివాహములు జేసి పిల్లవాడు ప్రథమ పెళ్ళి వాడును, చిన్న వాడును అయిన అయిన యెడల బాలిక రజస్వల అయిన వెంటనే అనగా పదనొకండు పండ్రెండు సంవత్సరముల బాలికకును పదునైదు పదునారు సంవత్సరముల బాలునకును పునస్సంధానములను జేయుచున్నారు. భర్త కొంచెము పెద్దవాడైన యెడల గాని లేక రెండవ మూడవ పెండ్లి వాడైనచో గాని బాలిక రజస్వలగాక పూర్వమే పది పదునొకండు సంవత్సరముల ప్రాయముననే చేయుదురు. పిమ్మట వీరు వెంటనే గర్భములను దాల్చి పిల్లలను కన మొదలిడుదురు."

> "ఇట్టి పిల్లలకు బుట్టు పిల్లలు ఆరోగ్యవంతులును దారుఢ్యవంతులు ఎట్లగుదురు? ఇంత పసితనము నుండియే పిల్లలనుగను తలిదండ్రుల కేమి యారోగ్యమును ధారుఢ్యమును ఉండును? ఇట్టివారు ఘనకార్యములు చేయుటకు పట్టుదలనెట్లు వహింపగలరు. తాము దుర్బలులగుటచే ఎంత చిన్న కార్యమునైనను ఇది మనము చేయగలమాయనెడి నిరుత్సాహముగాని ధైర్యము ఉండదు. ధైర్యముండుటకు బలము కావలయును."22

"వివాహ విధులనెంత మాత్రము నెఱుగలేని పసితనమున జరుపు

బడెడు మనయ స్వాభావికపు వివాహముల వలననే మన వారిచే విధింపఁబడిన పతివ్రతా ధర్మములు మనచే విరుద్ధముగా నాచరింపఁ బడుచున్నవని నా యభిప్రాయము. అనర్థదాయకములగు అతి బాల్య వివాహములు నశించినఁగాని మనదేశమున దంపతులు నిజమైన యనురాగము గలవారై యీశ్వరాజ్ఞల నెఱిఁగి దేశక్షేమమునకు బాటుపడువారలు కాజాలరు.''23

''ఇక బాల్య వివాహాలు చూడండి. మన భారతీయ యువతుల్ని యెంతగా అధోగతి పాలుచేస్తున్నాయో! 5 సం॥లు, 10 సం॥లు, 15 సం॥ లోపుగానే బాలికలకు వివాహము చేయుట నిజంగా ఈ బాలికలకు సంసార బాధ్యత ఏమిటో భర్త అంటే ఎవరో తెలియదు. కాని పెండ్లి అయిపోతుంది. అందువల్ల ఆమె తన జీవిత భారాన్ని సక్రమంగా నడుపలేదు. అంతటితో అది ఆగిపోదు.''

''ఇందువల్ల మహిళల ఆయుః ప్రమాణం కూడా పూర్తిగా తగ్గించబడింది. దీనిని బట్టి తదితర దేశాల్లో స్త్రీ యొక్క ఆయుః ప్రమాణము ఎంతగానో యెక్కువగా వున్నట్లు కాన్పించుచున్నది! గాని యిండియాలో మాత్రం స్త్రీ యొక్క ఆయుః ప్రమాణము, పురుషుని కంటె తగ్గివున్నదన్నమాట వాస్తవం. అంటే బాల్య వివాహము స్త్రీ యొక్క ఆయుః ప్రమాణమును తగ్గించిందన్న మాట.''24

19వ శతాబ్దం ఉత్తరార్ధంలో స్త్రీలకోసం సంప్రత్యేకంగా పత్రికలు వెలువడే నాటికి సంస్కర్తలను తీవ్రంగా ఆలోచింపజేస్తున్న అంశం బాల్య వివాహాలు. ముప్పై ఏళ్ళ మగవాడు, మూడేళ్ళ ఆడది అనేది ఆ రోజుల్లో సామెతగా పరిణమించింది. ఈ బాల్య వివాహాలు సాధారణంగా బాలికల పరంగానే బాల్య వివాహాలైనా కొన్ని సందర్భాల్లో మగ పిల్లలకు కూడా అతి చిన్న వయసులోనే వివాహాలు జరుగుతుండేవి। అయితే వివాహ వ్యవస్థలో పరిస్థితి ఏ విధంగా వున్నా ఎక్కువ బాధపడేది స్త్రీలే కాబట్టి, ఈ బాల్య వివాహాల వల్ల కూడా నష్టాన్ని స్త్రీలే ఎదుర్కోవలసి వచ్చింది. నాటి స్త్రీల పత్రికలన్నీ ముక్తకంఠంతో బాల్య వివాహాల్ని ఖండించాయి. బాల్య వివ

హాల వల్ల నష్టాలను అనేక కోణాల్నుంచి అంచనా వేశాయి. ఈ వివాహాల వల్లే స్త్రీ విద్యావంతురాలు కాలేకపోతోందని, ప్రపంచ జ్ఞానం పొందలేకపోతుందని, అనారోగ్యం పాలౌతోందని, సరియైన నిర్వహణ సామర్థ్యం లేకపోవడం వలన ఇంటిని ఆనందదాయకంగా ఉంచలేకపోతుందని పత్రికలు తరచు రాస్తూండేవి!

ప్రైమరీ పాఠశాలల్లో ఉన్న బాలికల సంఖ్య అప్పర్ ప్రైమరీ, హైస్కూల్ స్థాయిలో ఉండకపోవడానికి వివాహం కాగానే బాలికలు చదువుకు స్వస్తి చెప్పడమే కారణమని, స్త్రీలు విద్యావంతులైతే ఈ వివాహాల్ని ఖండించి, ఉన్నత విద్యకి కూడా వెళ్ళగలుగుతారని పత్రికలు వాదించేవి!

ఏ పత్రిక కూడా బాల్య వివాహాల్ని సమర్థించలేదు. వితంతు పునర్వివాహాది సంస్కరణల్ని ఖండించిన సావిత్రి పత్రిక కూడా బాల్య వివాహాలను నిషేధించాలని రాసేది! అయితే బాల్య వివాహాల్ని నిషేధించాల్సిన అవసరాన్ని ఆ పత్రిక భావించిన తీరు వేరు. బాలికలకి చిన్నతనంలోనే పెళ్ళి కావడం వలన వారు వివాహ విధుల్ని సక్రమంగా నిర్వహించలేకపోతున్నారని, వారికి పాతివ్రత్యం విలువలు తెలియడం లేదని, భర్త పట్ల భార్య సరియైన అనురాగాన్ని పెంచుకోలేకపోతోందని, ఇటువంటి లోపాలు తొలిగి, భార్య భర్త ఒకరి పట్ల ఒకరు అనురాగ మనస్కులై వుండి చక్కగా సంసార నిర్వహణ చేసుకోవాలంటే బాల్య వివాహాలు అంతరించాలనేది 'సావిత్రి'.

బాల్య వివాహాల వల్ల వితంతు సమస్య ఉద్భవిస్తోంది. వితంతువులు సమాజంలో అనేక అనర్థాలకి కారణమౌతున్నారు! వితంతువుల వల్ల స్వయంగా వాళ్ళకి సుఖశాంతులు లేకపోగా వారి చుట్టు పక్కల వాళ్ళకి కూడా ప్రశాంతత లేకుండాపోయే పరిస్థితి ఏర్పడుతోంది! మితిమీరిన వితంతు సమస్య నరికట్టడానికి కూడా బాల్య వివాహాలు అంతరించాలని పత్రికలు రాస్తుండేవి.

బాల్య వివాహాలు శాస్త్ర సమ్మతం కావని, రామాయణ భారతాల్లో

కనిపించవని, సీత ద్రౌపది మొదలైన వారు యుక్తవయసు వచ్చిన తరువాతనే స్వయంవర పద్ధతిని, వరుని యెంచుకున్నట్లు తెలుస్తోందని ఈ బాల్య వివాహాలు మధ్య యుగంలో ముస్లిం దురాగతాలకు తట్టుకోలేక ఏర్పరిచిన ఒక ఆచారం! ప్రస్తుతం మధ్యయుగం నాటి పరిస్థితులు లేవు కాబట్టి బాల్య వివాహాలు మాని కాలానుగుణంగా యుక్త వయసు వచ్చిం తర్వాతనే వివాహాలు చేయ్యాలని బాలికలకు కనీస వివాహ వయసు 16 సం॥ బాలురకు 18 సం॥లు వుండాలని ఆ విధంగా ప్రభుత్వం చట్టాలు చేయాలని ఘోషించేవి!

ఈ పత్రికల ఈ ఘోష మనకి 20 శతాబ్దంలో ఎక్కువ కనిపిస్తుంది! తెలుగు జనానా పత్రిక 20వ శతాబ్ది ఆరంభానికి ప్రభుత్వ లెక్కల ప్రకారం బాల్య వివాహాల సంఖ్య తగ్గినట్టు లెక్కలు చూపిస్తుంది.

> "వివాహ విషయములందు, మనదేశములో నానాటి నుంచి మార్పులు గలుగుచున్నవని చెప్పవచ్చును. ఈ మధ్యనే దొరతనము వారిచే ప్రచురించబడిన చెన్నపురి రాజధానీ జనాభా పుస్తకములోని లెక్కల ప్రకారము పూర్వము కంటె నిపుడు బాల్య వివాహములును బాల వితంతువుల సంఖ్యయును తగ్గియున్నదని చెప్పవచ్చును. క్రింది పట్టిని బట్టి 11 సం॥లకును ఇప్పటికిని గల మార్పును గనుగొన వచ్చును. మన రాజధానిలో 15 సంవత్సరముల లోపు ప్రాయముగల బ్రాహ్మణ బాలికల నుదాహరణముగా తీసుకోబడినది!

| జనాభా సంవత్సరం | వివాహముగాని బ్రాహ్మణ బాలికలు | వివాహమైన బ్రాహ్మణ బాలికలు | వితంతువులైన వారు |
|---|---|---|---|
| 1891 | 7137 | 2744 | 119 |
| 1901 | 7552 | 2378 | 70 |

> పై పట్టికలో 15 సం॥లలోపు ప్రాయము గల బ్రాహ్మణ బాలికల సంఖ్య పదివేలుగా తీసుకొనబడినది."25

పై పట్టిక నాధారముగా బాల్య వివాహాలు 1901 నాటికి తగ్గిపోయాయని భావించడానికి వీలులేదు. ఇది కేవలం చెన్నపురికి మాత్రమే పరిమిత

మైక పట్టిక కాని దేశంలోని ఇతర ప్రాంతాల్లో, పల్లెల్లో బాల్య వివాహాలు యథావిధిగా జరుగుతూనే వున్నాయి. ఎంతో మంది బాలికలు వితంతువు లౌతూనే వున్నారు. చెన్నపురి రాజధాని నగరం కాబట్టి అక్కడ చేరిన వారంతా విద్యావంతులు, ఉద్యోగస్తులు ఉండటంవల్ల సహజంగానే బాల్య వివాహాలు తగ్గివుండవచ్చు. ఈ పట్టిక నాధారంగా తీసుకొని దేశమంతటా పరిస్థితి అదే విధంగా వుందని చెప్పడానికి వీలులేదు.

1911వ సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం అతి బాల్య వివాహాలు 90 లక్షలు జరిగాయి. అందులో పునర్వివాహ నిషేధితులయిన భాలవితంతులు 44,000.

| వయసు | పెండ్లి అయిన బాలికలు 26 |
|---|---|
| 11 సం॥లు | 25 00 000 |
| 15 సం॥లు | 90, 0000 |

ఇది 1911 సంవత్సరం నాటి పరిస్థితి. ఈ పరిస్థితిలో క్రమంగా మార్పు వచ్చింది. నాడు స్త్రీల పత్రికలు అన్నీ కూడా బాల్య వివాహాలు స్త్రీ విద్యకి, స్త్రీ మనుగడకి ఆటంకాలుగా తయారౌతున్నాయన్న సంగతి గుర్తించి వాటి నిషేధానికి పాటుపడ్డాయి!

వితంతు సమస్య: బాల్య వివాహాల తర్వాత పత్రికలు విస్తృతంగా చర్చించిన అంశం నాటి వితంతువు పరిస్థితి. ఒక విధంగా చెప్పాలంటే 19వ శతాబ్దంలో స్త్రీ జనోద్ధరణకు సంస్కర్తలు నడుంకట్టడానికి ముఖ్య కారణం ఈ వితంతువుల దరవస్థ! నాడు సంస్కర్తల మధ్య భిన్నాభి ప్రాయాల్ని కూడా తీసుకురాగలగింది. ఈ సమస్య! స్త్రీ విద్య బాల్య వివాహాల నిషేధం వంటి ఎన్నో అంశాల్లో ఏకీభవించిన ఎందరో మేధావులు వితంతు వివాహాన్ని అంగీకరించలేకపోయారు! కొందరు సంస్కర్తలు ఒ పక్క నుంచి వితంతు పునర్వివాహాలకోసం పాటుపడుతుంటే మరికొందరు వాటిని ఆపడానికి శతవిధాల ప్రయత్నించేవారు. వితంతు పునర్వివాహం శాస్త్ర సమ్మతం అవునాకాదా అనే అంశం మీద విపరీతంగా చర్చలు జరిగేవి.

ఈ విషయంలోనే సంప్రదాయ వాదులు సంస్కర్తలతో పూర్తిగా భేదించారు ! స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతం అని నిరూపిస్తూ గ్రంధాలు వెలువడితే, స్త్రీ పునర్వివాహం శాస్త్ర నిషిద్ధం అని నిరూపించే పుస్తకాలు వెలువడ్డాయి. బహుశా ఈ విషయ నిరూపణ కోసం. 19వ శతాబ్దంలో తిరిగి ఒకసారి వేదాలు, పురాణాలు విస్తృతంగా అధ్యయనం చేయడం జరిగి ఉండవచ్చు.

| వయస్సు | బాలవితంతువుం సంఖ్య |
|---|---|
| 5 సం॥ | 735 |
| 5-10 | 4832 |
| 10-15 | 19377 |
| 15-20 | 57604 |
| 20-25 | 1082 |
| 25-30 | 101511 |

5 ఏండ్లకు మించనివారు 735 గురు అయితే, ఏడాది నిండని బాల వితంతులు 37 గురున్నారు.

''....మన దేశంబున విధవల సంఖ్య హెచ్చి స్త్రీజన్మ నిష్ఫలంబగుచున్నయది. దీనిం గురించి దేశాభిమాను లనేక విధంబులం బాటువడుచున్నారు. గాని రాజావలంబన లేకయు, మన మాతాచార్యు లంగీకరింపకుండుటను, మనలో నైకమత్యము సాహసం లేకుండుటను, సర్వజన సామాన్యముగాఁ జాలకున్నయది. ఈ దురాచార మడంప వలెనని ప్రతివారి మనంబుల నున్న యది గాని సాహసించువా రలుదుగా నుండుట నింక నాచారముగా నందరిచే నవలంబింపబడలేదు. కొద్ది కాలములో నిదియునగు గాక.''28

''పూర్వకాలమందింత బాల్య వివాహములు జరుపుబడకుండుటచే నప్పటి వితంతులు చాలా వరకు వృద్ధాంగనలే యయ్యుండుట యిట్టి పని కంగీకరించిరేమో గాని పదియేండ్ల లోపుననే వయిధవ్యమొంది సంసారమన్న నేమియో యెరుగని ఏ శిశువుల నయితము పట్టి బలవంతముగా నిట్టియమానుష కృత్య మొనర్చుట యెట్టి దురన్యాయము. అక్కలారా ! నోరెత్తిన సంఘము నుండి వెలిజేతుమని బెదిరించు

నాచార్యుల కఠిన వాక్యములును, అన్నాహారము లొంటనంటనీయక సాధించు వృద్ధాంగనల సాధింపుంకును పడజాలక దైవదత్తములగు శిరోజములకే పాట్లొనర్చుచుండిరి గాని మనస్ఫూర్తిగానే స్త్రీయు నిందు నంగీకరింపజాలరు.''29

ఇది వితంతువుల పరంగా నాటి సంఘ స్థితి. వితంతు దుస్థితికి కలత చెంది వారి నుద్ధరించాలని కొంత మంది కంకణం కట్టుకున్నప్పటికి, సాంఘి కంగా వారికి మద్దతు లభించలేదు, మతాచార్యుల నుండి సంఘ బహిష్కార మనే బెదిరింపు వారిని భయపెట్టేది. సంస్కర్తలే కాక వితంతువులు కూడ తామున్న పరిస్థితి నుంచి బయటికి రావాలనే తలంపు ఉన్నప్పటికి, వారికి సంఘంలో మద్దతు లేకపోవడంవలన ఎవరూ కట్టుబాటును దాటి బయటికి వచ్చేవారు కారు.

వితంతువులకు సంఘంలో గౌరవం లేదు. ఆమెను కుటుంబ సభ్యులు కూడా ఘోరంగా చూసేవారు. వితంతువు కావడం ఆమె పూర్వజన్మ పాప ఫలమని, అందుకు ఈ జన్మలో శిక్ష అనుభవించి తీరాలని నమ్మేవారు! వితంతువులకు, మామూలు స్త్రీలతో సమానంగా అలంకారాలు మొదలైనవి అంగీకరిస్తే వారికి ఈ ప్రాపంచిక సుఖాల మీద మమకారం పెరుగుతుందని తర్వాత వారు భ్రష్టమౌతారని భావించి, వితంతువుల అలంకరణ, ఆహార వ్యవహారాలు మొదలైన అన్ని విషయాల్లోనూ ఆంక్షలు విధించారు. ఆమెకు వయసుతో నిమిత్తం లేకుండా 'కేశఖండనం' జరిపించి అందవిహీనంగా తయారు చేసేవారు! ఆమెను పురాణ పఠనం, అర్థంగాని వేదాంత శ్రవణా లకి బలవంతగా గురిచేసేవారు! వితంతువులైన స్త్రీలు వేరే ఆలోచన లేకుండా నిష్కామ బుద్ధితో బ్రహ్మచర్యాన్నవలంబించి, సద్గ్రంథ కాలక్షేపం చేస్తే ఆమెకి మోక్ష ప్రాప్తి కలుగుతుందని నమ్మించే వారు!

వితంతువు పరిస్థితి గృహిణులను కూడా కదిల్చి వేసింది! సంస్కర్తలు కొందరు వితంతు పునర్వివాహాలకి ఒడిగడితే, సాటిస్త్రీలు వితంతువుల్లో విద్యా వ్యాప్తి చేయాలని నడుంకట్టారు! అనేక వితంతు శరణాలయాలు

స్థాపించబడ్డాయి. పత్రికల్లో వితంతు పునర్వివాహాన్ని గురించిన ప్రకటనలు ఇచ్చేవారు. వితంతు శరణాలయాల్లో ఉన్న స్త్రీలకి విద్య నేర్పి వారికి స్వతంత్ర జీవనోపాధికి మార్గం చూపాలని ప్రయత్నించే వారు.

వితంతువులు అధికంగా పెరగడానికి కారణం బాల్య వివాహాలేనని' బాల్య వివాహాలవల్ల వృద్ధుడైన భర్త తొందరగా చనిపోవడంవల్ల స్త్రీలు తరచుగా వితంతువులయ్యేవారు! చిన్నతనంలోనే పెళ్ళి చేయడంవలన అబ్బాయికి చిన్నప్పుడు కలిగే వ్యాధులవల్ల ఒక్కొక్కసారి చిన్నవాడైన భర్త కూడా మరణించడం సంభవించేది! అయితే స్త్రీ మరణాలు లేవా! అనే అనుమానం రావచ్చు. స్త్రీలు మరణించినా, వారి భర్తలు వెంటనే పునర్వివాహం చేసుకోవడంవలన వితంతు సమస్య స్త్రీలనే బాధించేది. స్త్రీల పత్రికలు వితంతువులపట్ల జరుగుతున్న అన్యాయాన్ని తీవ్రంగా ఖండించాయి. భర్త చనిపోయిన స్త్రీకి కేశఖండనం చేయాలన్నప్పుడు భార్య చనిపోయిన మగవాడికి జీవితాంతం గడ్డాలు మీసాలు కత్తిరించాలనే నిబంధన పెడితే ఎలా వుంటుంది! జాతకాలు మగవాడికి ద్వితీయకళత్ర తృతీయకళత్ర యోగాల్ని రాసి స్త్రీలకి ఎందుకు ద్వితీయ భర్త, తృతీయ భర్త యోగం చెప్పలేదని ప్రశ్నించాయి. అయితే అన్ని పత్రికలు ఈ విధంగానే వితంతు పరిస్థితిని ప్రశ్నించాయని చెప్పలేము। కొన్ని పత్రికలు వితంతువులకి భగవంతుడే చిన్నప్పుడే, సంసార బంధాల్నించి విముక్తుల్ని చేశాడని, వారిని తిరిగి పునర్వివాహ మిషతో సంసార బంధంలోకి తోయకూడదని వితంతువులు ఎందరో ఎన్నో సంసారాలకి అండగా ఉన్నారని, అసలు వితంతువులు లేకపోతే చాలా సంసారాలు గడిచే పరిస్థితే ఉండదని, వితంతువులకి చెడు తలంపులు రాకుండా వారికి సద్విద్యను బోధించి సన్మార్గంలో ఉంచాలని ప్రచురించేవి!

విద్యావంతులైన స్త్రీలు, ఇళ్ళల్లో వ్యర్థంగా జీవితం గడుపుతూ కుమిలిపోతున్న వితంతు సోదరిలకు కనీసం విద్యా బోధన చేసి వారి పరిస్థితిని మెరుగుపరచాలని, ప్రయత్నించేవారు. పత్రికలు 'వితంతువుల దురవస్థ' 'వితంతు కేశఖండనము' 'బాల వితంతువులు' వంటి వ్యాసాలు తరచూ ప్రచురిస్తుండేవి!

ఈ పత్రికల ద్వారా వితంతువులకి సంబంధించి కొన్ని విషయాలు స్పష్టమవుతాయి !

1. నాడు వితంతువుల సంఖ్య అధికంగా వుండేది.
2. వితంతువుల పరిస్థితి దుర్భరంగా ఉండేది.
3. వింతతూర్దణకి కొందరు ప్రయత్నించసాగారు.
4. వితంతువుల పరిస్థితిలో ఏదో ఒక విధమైన మార్పు తేవాలనే తపన కొందరిలో ప్రారంభమైంది.
5. వితంతువులకి విద్యాబోధన తప్పకుండా చేయాలనే సంకల్పం
6. వితంతు పునర్వివాహం.

పై అంశాల్లో మొదటి అంశాలకి సంఘంలోని అన్ని వర్గాల నుంచి సమ్మతి లభించింది। ఆఖరి అంశం 'పునర్వివాహం' విషయంలో సంఘంలో జరుగుతున్న ఘర్షణ నాటి పత్రికల్లో ప్రతిబింబిస్తుంది.30

బాల్య వివాహాలు, వితంతువుల సమస్యలు వివాహ వ్యవస్థతోనే ముడి పడి వున్నాయి. వివాహ వ్యవస్థలో సమగ్రమైన మార్పువస్తేనే పరిస్థితి మెరుగవుతుందని పత్రికలు భావించాయి ! యూరప్ దేశాల్లోని స్త్రీలు రాజకీయ స్వాతంత్రంకోసం పోరాడుతుంటే మనం కనీసావసరమైన వివాహం గురించి ఇంత వ్యథ చెందటమేమిటని స్త్రీల పత్రికలు ప్రచురించాయి !

మొత్తం మీద అదుపుతప్పతున్న వితంతువు సమస్య సమాజంలో అనేక మార్పులకి దారితీసింది ! బాలికల తలిదండ్రులను ఆలోచింపజేసింది. తత్ఫలితంగా క్రమంగా బాల్య వివాహాలు తగ్గాయి. స్త్రీ విద్య అభివృద్ధి చెందింది. కొన్ని తరాల స్త్రీల దుర్భర వితంతు జీవనం తరువాతి తరాలవారి జీవనం సుగమం కావడానికి కారణమైంది.

పత్రికలన్నీ ముక్తకంఠంతో వితంతు పరిస్థితికి దుఃఖించాయి. అయితే ఏ పత్రిక కూడా వితంతు సమస్యకి పునర్వివాహం సరియైన పరిష్కారం అనే విషయాన్ని నొక్కిచెప్పలేదు ! కొన్ని పత్రికలు వితంతు పరిస్థితిని, మగ

వారితో పోల్చి తీవ్రంగా ప్రశ్నించాయి గానీ, పునర్వివాహాన్ని పరిష్కారమని నిర్ధారించలేదు. అయితే పత్రికల ద్వారా ప్రోత్సాహింపబడిన వితంతు విద్యాభ్యాసం ఎందరో వితంతువులు విద్యావతులై, దేశాభివృద్ధికి పాటుపడటానికి కారణమైంది! మొదట్లో చదువుకొన్న స్త్రీలు భర్తలు అండదండలున్నవారైనా తర్వాత స్త్రీ విద్య వితంతువుల పరంగా వృద్ధిచెందింది!

*గృహ నిర్వాహణ*: నాటి స్త్రీల పత్రికలు గృహ నిర్వహణ అందాలు అలంకారాలు పేరిట ప్రత్యేక శీర్షికలు నిర్వహించకపోయినా, గృహ నిర్వహణ స్త్రీ బాధ్యత అనినొక్కి చెప్పాయి! గృహ నిర్వహణలో చాలామంది స్త్రీలు అపజయం పొందుతున్నారని, గృహ నిర్వహణ అనేది, స్త్రీకి చిన్నప్పటి నుంచి అలవడవలసిన ప్రత్యేక లక్షణం అని పత్రికలన్ని ఏకకంఠంతో ప్రచారం చేశాయి! అసలు స్త్రీ విద్య ప్రప్రథమే గృహ నిర్వహణకోసం ప్రారంభమైంది! స్త్రీ పురుషులకి సమాన విద్య ఉండకూడదు! అనడానికి కూడా కారణం స్త్రీలకి గృహ నిర్వహణ సంబంధమైన విద్య తప్పనిసరి అనే భావంతోనే స్త్రీ విద్యను ప్రోత్సాహించిన వారంతా కూడా ఆమె ఉద్యోగాలు చేసి ఉళ్ళేలాలని కోరుకోలేదు! విద్యాభ్యాసం చేసి స్త్రీ ఉత్తమ గృహిణిగా తయారుకావాలనే కోరుకున్నారు! విద్య లేకపోవడం వలన స్త్రీ గృహ నిర్వహణలో ఎన్నో అవకతవకలు చేసి భర్తని ఇబ్బంది పాలు చేస్తోందని తమ భార్యలు సక్రమంగా సంసారాన్ని నిర్వహించాలంటే భర్తలు వారిని విద్యావంతుల్ని చెయ్యడానికి ప్రయత్నించాలనేవి!

> "భార్య గృహమునందు రాణి గృహ కృత్యములను విచారించి పాలించి కుటుంబమును సుఖపెట్టుట యామెకు పరమ ధర్మము ఆమె భర్తకు సమస్త సత్కార్యముల యందును సహాయురాలుగాను హితబోధకురాలుగా నుండవలయును. దాస దాసీజనములను చక్కగా విమర్శించి యెవ్వరి చేత నెట్లు పని చేయింపవలెనో తెలిసిన యుత్తమ యజమానురాలుగా నుండవలెను. కుటుంబమున కుత్సాహమును, సంతోషమును నాగరికతకు వృద్ధిపరచు ప్రౌఢురాలుగా నుండవలయును. ఇట్టి కృత్యములందు నేర్పుగల భార్యయే భార్య గాని యింటి పనికి భర్త

యొక్క ఇంద్రియ సుఖమునకు మాత్రము నుపయోగపడెడు గృహిణి గృహిణి కాదు. పైన వివరించిన కృత్యముల యందు పరమని పుణు రాలయిన భార్యయే గృహమునందుండునో యాగృహము భూలోక స్వర్గమని చెప్పవచ్చును. ఈ గుణములు విద్యాభ్యాసం లేక పట్టు పడనేతవు.''31

''గృహ కృత్యములను నెరవేర్చుటకు పకరించు విద్య మన బాలికల కావశ్యకమని యెల్లరు నొప్పుకొనియున్నారు....గృహనిర్వాహకత్వము మొదలగు విషయములును బాలికా పాఠశాలలలో నేర్పబడు చున్నవి....''32

''శిశువుల బెంపనేర్పవలె. సేవకులెల్లపుడు న్విధేయులై వశులగునట్లు నేర్పవలె, వాకిళులిండ్లు సమస్త వస్తువుల్ మశక పిపీలికాదులు దుమారము దూలగ నూడ్చు పెంపునన్
విశదముగా నొనర్పవలె వేడ్కక జూడ్కులకున్ సతీమణి''

......... ............................ ......... .........

వలసిన వస్తు సంగ్రహ మవశ్యము కాలము ఖంబునందునే
ర్పల వడజేసి కావలసినట్లు చితంబుగ వాడుకొంచు ధీ
విలసిన మేర్పడం బతికి వేగతులన్ సుఖమబ్బఁ జెసినఁ
జెలువున కిల్లు స్వర్గమయి చిత్తము రంజిల్లదే నతీమణి''33

''చదువు నేర్చిన స్త్రీలు గృహ కృత్యములు చక్కఁగా జక్కఁబెట్ట రనియుఁ బెద్దలను లక్ష్యము చేయరనియు జెప్పుచున్నారు. ఆడది చదివి ఉద్యోగములు చేయునాయని యెత్తి పొడుచుచున్నారు. వారికి గృహమందే యుద్యోగములున్నవని తమకుఁ తెలియదు కాఁబోలు! తన మగని కుపచారము చేయుట తన బిడ్డలకు విద్యా బుద్ధులు చెప్పుట. ఇంతకన్న స్త్రీకి వేరు ఉద్యోగమేమి! ఈ పని చక్కగా చేయుట కామె చదువవలదా! ....స్త్రీలకు స్వభాషలోనే తగిన సద్విద్య నేర్పినఁ గుటుంబ జీవనము స్వర్గతుల్యమగును.''34

"స్వకుటుంబ పాలనా సమర్థత వహించుటకు స్త్రీలు విద్యావంతురాం డ్రుగా నుండుట యవసరమను విషయము సర్వజన సమ్మతము"35

ఇవి సాధారణంగా గృహ నిర్వహణకి సంబంధించి పత్రికల్లోని భావాలు! స్త్రీలు విద్య లేక పోవడంవలన గృహనిర్వహణలో అనేక తప్పిదాలు చేస్తున్నారు కాబట్టి వారు మొదట విద్యావంతులైతే గృహనిర్వహణ చక్కగా చేయగలుగుతారని పత్రికలు విశ్వసించాయి। పత్రికలు గృహ నిర్వహణలో ఉపకరించే సంగతులు కంటె అసలు గృహిణి నిర్వహణపట్ల స్త్రీ దృక్పథమే మార్చేలా ప్రయత్నించాయి! కేవలం యాంత్రికంగా యింటిపని చేసుకుంటూ పోవడంగాక మెళకువలు తెలుసుకొని గృహనిర్వహణ భారం వహించాలనడం పత్రికల ధ్యేయంగా కనిపిస్తుంది! కొన్ని పత్రికలు "ఇంటి విషయమయిన సంగతులు" అను శీర్షిక పెట్టి అందులో వివిధ వంటకాల్ని గురించి, ఇంట్లో బట్టలు, పాత్రలు మొ॥ వస్తువుల పట్ల వహించాల్సిన జాగ్రత్తలను గురించి ప్రచురిస్తుండేవి! అయితే మొత్తంమీద పత్రికలన్నీ కూడ స్త్రీ విద్య ద్వారా స్త్రీ సమర్థవంత గా గృహ నిర్వహణ చేసుకోగలుగుతుందని భావించినట్లు గ్రహించవచ్చు.

గృహ నిర్వహణ పట్ల నాటి పత్రికలు అనుసరించిన విధానం ఎంతో వివేకవంతంగా కనిపిస్తుంది। బాహ్యమైన ఇంటి అలంకరణలు, శుభ్రతలు వంటి అంశాలకే కాక, అంతర్గతంగా స్త్రీలో రావలసిన మార్పును గురించి ప్రచారం చేసేవి! గృహ నిర్వహణ అనేది పై పనుల వల్ల కాక స్త్రీ స్వభావంలోనే పరివర్తన రావాలని వాంఛించాయి! గృహ నిర్వహణ అనేది కేవలం భౌతికమైన శుభ్రతాదులే కాక మానసికమైన ఆనందాన్ని కూడా కలిగించే విధంగా స్త్రీ తయారుకావాలని వాంఛించాయి! కుటుంబ యజమానురాలుగా, సఖ్యురాలుగా స్త్రీ నిర్వహించవలసిన పాత్రను గూర్చి చర్చించాయి! స్త్రీ సమర్థత గలిగిన యజమానురాలిగా, సహృదయతగలిగిన సఖ్యురాలిగా కుటుంబంలో తయారుకానాలని, అప్పుడే ఆ యిల్లు స్వర్గతుల్యం అవుతుందని భావించాయి.

స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపట్ల పత్రికల దృక్పథం:

స్త్రీ స్వేచ్ఛా, స్వాతంత్ర్యం అనే నినాదాలు ఈ మధ్య కాలంలో వుద్భవించినవనే భ్రమ చాలా మందికి వుంటుంది! కాని 19వ శతాబ్దం నుంచి స్త్రీ స్వేచ్ఛను గురించి ప్రశ్నలు తలెత్తాయి! 20వ శతాబ్ది ఆరంభంలో స్త్రీ స్వేచ్ఛను గురించిన చర్చలు విస్తృతంగా జరిగాయి. స్త్రీకి వేదకాలం నుండి స్వేచ్ఛ ఉండేదని మధ్యయుగాల్లో ఏ కారణాలచేతో స్త్రీ స్వేచ్ఛ అడుగంటి పోయిందని తిరిగి దానిని పునరుద్ధరించాలని స్త్రీలు భావిస్తే, మరికొంత మంది స్త్రీలకి కావల్సిందేవిటి? ఆవిడకి ఎటువంటి స్వేచ్ఛ కావాలి? అనవసరముగా లేనిపోనివి ఊహించుకొని స్వేచ్ఛ లేదని స్త్రీ బాధపడుతోందని అభిప్రాయ పడ్డారు! 19వ శతాబ్దంలో ప్రారంభమయిన స్త్రీ విద్యా వుద్యమం క్రమ క్రమంగా స్త్రీ స్వేచ్ఛా వుద్యమంగా పరిణమించింది! స్వేచ్ఛ ముఖ్యంగా విద్యా విషయంలో ఎక్కువగా ప్రశ్నింపబడింది! వివాహ విషయంలో ఏ రకమైన స్వేచ్ఛను, ఎవ్వరూ కూడా అభిలషించలేదు! స్త్రీ తనకు కావలసిన వరుడ్ని ఎన్నుకోవడానికి స్వేచ్ఛ ఉండాలని ఆలోచించేవారు లేకపోలేదు! కానీ నాటికి ఆ ఆలోచనలకి విలువ అంతగా లేదు. (ఈ పరిస్థితిలో ఇప్పటికి అంతగా మార్పు కనిపించదు.)

"....ఆ కాలమునందు స్త్రీలు పురుషులవలెనే గౌరవింపఁబడుచుండిరి. గాని యిప్పటికి వలె గదులలో మూసిపెట్ట బడుచుండలేదు. ....ఆ కాలమునందలి స్త్రీలకుండవలసిన స్వాతంత్ర్యములన్నిటిని వారు గలిగియుండిరనుటకు సందేహము లేదు. వారి కప్పుడున్న విద్యా ప్రభావమునుబట్టి వారట్టి గౌరవములకును స్వాతంత్రములకును నర్హురాండ్రయి యుండిరి."36

"సాధారణముగా లోకమునందంతటను ముఖ్యముగా మన దేశము నందును, స్త్రీలకంత స్వతంత్రత లేక యుండుట చేత వారిలోఁ గొంద ఱెంత వివేకవంతులుగను సుగుణాన్వితులుగ నుండినను పురుషుల వలె నంతగఖ్యాతి సంద నేర కున్నారు! కావుననే స్త్రీల గొప్పదనము వారి మూలమున ఖ్యాతికెక్కిన వారి పతుల వలన, వారి పుత్రులవలనను, ముఖ్యముగా మనకు దెలియుచున్నది."37

"స్త్రీలను ఘోషాయందుంచుట మనదేశము నందలి విస్తారమైయున్నది. ఇది బొత్తిగా కూడదని నాయభిప్రాయం. స్త్రీలకు ఘోషా పద్ధతి దీసి వెసిన నిదియు మనదేశపు స్త్రీలకివబడు ప్రథమ స్వాతంత్ర్యమని చెప్పనొప్పును."38

"గృహ రాజ్యమును పాలించునది స్త్రీయే కదా! స్వేచ్ఛ లేదని స్త్రీ యేలధుమధుమలాడవలెను? భర్త మాటలు విని యాతని యాజ్ఞలకు లోబడి యుండుట భార్య ధర్మము. భర్తకు భార్య మంత్రిగాదె? భక్తురాలు గాదె? సేవకురాలు గాదె? ఆమెయే భర్త ఇంగితము నెఱింగి యనుగుణమా నడిచినచో భర్త స్వేచ్ఛ నామెకీయకుండునే? ...... మీ విద్యాభివృద్ధికిని, నీతి నేర్చుకొనుటకును స్వేచ్ఛ యెంత వరకవసరమో యంతవరకు మీ భర్తలే యీయగలరు. కానిమీస్థితి హేయమనియు, నీచమనియు, అజ్ఞాన కూపమున పడి యుండుటయే మో స్వేచ్ఛలేని గృహ జీవితమని లోలోన నిందించుకొనకుడు! గృహము ననే మీరు స్వేచ్ఛగా నుండవచ్చును....ఎచ్చటనైన స్త్రీల సభ జరుగు చుండెడ చూడవలెనన్న మీ భర్తతో గూడ పోవచ్చునే! స్వేచ్ఛ యొక్క పరిమితిని గుర్తెంగిరేని స్వేచ్ఛ మీకు గలదు."39

ఇవీనాటి పత్రికలు స్త్రీ స్వేచ్ఛను గురించి చేసిన చర్చలు! వీటిని పరిశీలించినపుడు నాటి స్త్రీ విపరీతమైన కట్టుబాట్లలో గృహ నిర్బంధమై యుండేదన్న సంగతి విశదమౌతుంది. అప్పటి సంస్కర్తలు, స్త్రీలు, తమ ప్రస్తుత స్థితిని పూర్వపు హిందూ స్త్రీలతో పోల్చిచూసి తాము అప్పుడు అనుభ విస్తున్న స్థితికి గర్హించసాగారు. తమ పూర్వ స్త్రీలు గౌరవింపబడడానికి వారు విద్యావంతులు కావడమే కారణమని తాము కూడా తగిన విద్యార్జన చేస్తే సంఘంలో గౌరవ స్థానం పొందుతామని భావించారు! స్త్రీకి స్వేచ్ఛ స్వాతం త్ర్యాలు ఇవ్వాలంటే ముందుగా ఆమె కొన్ని అర్హతల్ని సంపాదించాలని స్త్రీ లందరూ స్వాతంత్ర్యానికి అర్హులుకాని వారు మూఢులు కావడం చేత ఆమెకి స్వేచ్ఛ నిచ్చినట్లయితే దురుపయోగం చేస్తుందని భావించారు. ఈ అభిప్రాయం ఏర్పడడానికి కూడా కారణం లేకపోలేదు. అయితే అందులో స్త్రీ తప్పులేదు.40

స్త్రీ పురుషులిరువురు సమానులనే భావం నాటికి కలగలేదు! స్త్రీ విద్య నేర్చుకోవచ్చుగాని, పురుషుడి లాగా సర్వస్వతంత్రురాలు కాకూడదు! ఆమె సర్వదా పురుషుల ఆజ్ఞకు లోబడి ఉండాలి. స్త్రీలను రక్షించి వారిని పవిత్రంగా ఉంచే భారం పురుషులది. కాబట్టి వారికి అవసరమైనంతవరకు విద్యాబోధన చేసి కావలసినంత వరకు స్వేచ్ఛనిచ్చే అధికారం పురుషులదే! అనే భావ సర్వత్రా వ్యాపించి వుంది! సంఘంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం ఉద్యమం సాగించే స్త్రీలనుద్దేశించి పురుషులు కొందరు హితబోధ చేయడానికి ప్రయత్నించే వారు! స్త్రీలైనా, పురుషులైనా, స్త్రీకి స్వాతంత్ర్యం కావాలి కాని, అది భర్త ఆజ్ఞకు లోబడి వుండే స్వాతంత్ర్యమే కావాలి! అనే భావంతోనే వ్యవహరించారు! అసలు భర్తకు భిన్నంగా స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుంటాయని గాని, ఉండాలని గాని ఎవరూ ఊహించలేదు! స్త్రీ స్వేచ్ఛకి కొన్ని పరిమితులున్నాయని, ఆ పరిమితులకు లోబడే వ్యవహరించాలని పత్రికలన్నీ బోధించేవి! ముఖ్యంగా నాటి స్త్రీ సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కర్హురాలు కాదని అన్ని పత్రికలు భావించాయి! స్త్రీకి స్వాతంత్ర్యం అడుగంటటానికి కూడా విద్యాలేమి కారణం అని నిర్ధారించారు. స్త్రీకి స్వేచ్ఛ లేదనే భావాన్ని కూడా ఖండించారు చాలామంది. ఇల్లే స్త్రీకి రాజ్యమని అందులోనే ఆమె కావలసినంత స్వేచ్ఛ పొందవచ్చునని భావించారు. అయితే ఈ పరిస్థితిలో క్రమంగా మార్పు వచ్చింది. 1944 నాటికి ఆంధ్రమహిళ పత్రిక స్త్రీ స్వేచ్ఛ స్వాతంత్ర్య జీవనాల్ని గురించి ప్రశ్నించడం మొదలు పెట్టింది!

> ''మన సంఘాలు బాగుపడటానికి స్త్రీ అభ్యుదయము ముఖ్యము. ఆత్మ వికాసము పొందటానికి పురుషులకు ఎటువంటి వ్యక్తి స్వాతంత్ర్యము, అవకాశాలు వున్నవో (మనకు) స్త్రీలకు కూడా అటువంటి స్వాతంత్ర్యము, అవకాశాలు కావాలని కోరటం తప్పుకాదు. అవి పొందటానికి తగిన ప్రయత్నం చేయాలి........పాటక జనుల్లో స్త్రీ పురుషులిద్దరూ సమానంగా కష్టించి పనిచేసుకుంటూ స్వేచ్ఛా జీవులై యుంటారు. ఆ పద్ధతి ఆర్థిక, ఆత్మ స్వాతంత్ర్యములకు సాధనమే గాని తప్పుకాదు. ఆత్మరక్షణ సామర్థ్యము, ఆర్థిక స్వాతంత్ర్యములేని వ్యక్తికి ఆత్మ

స్వాతంత్ర్యమనేది సిద్ధించదు! పురుషుల సంపాదన మీద ఆధారపడి వున్నంతకాలం స్త్రీలకు ఆత్మవికాసము గాని స్వతంత్రేచ్ఛ గాని వుండవు.''41

స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యము, ఆత్మ స్వతంత్ర్యము అనే దృక్పథం సమాజంలో యేర్పడింది! ఇంకో విషయం కూడా స్పష్టమౌతుంది. బొత్తిగా స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు లేని స్త్రీలు సమాజంలో ఉన్నత వర్గాలకి చెందిన వారేననేది! పాటక జనాల్లో స్త్రీ పురుషుల మధ్య కష్టించి పనిచేయడంలో గానీ, స్వతంత్ర జీవనం గడపడంలో గానీ పెద్దగా తేడా లేదు! ఈ రకమైన వ్యవహారమంతా సంఘంలోని మధ్య తరగతి స్త్రీలకే ఎక్కువగా సంబంధించి వుంటుంది! స్వేచ్ఛ స్వాతంత్ర్యాల విషయంలో సమాజంలోని ఉన్నత వర్గాల స్త్రీల కంటె ఇతర స్త్రీల పరిస్థితే నయమనిపిస్తుంది!

పై అంశాలేకాక స్త్రీల పత్రికలు ఇంకా అనేక విషయాల్ని చర్చించాయి. అయితే పై అంశాల్ని ప్రధానంగా చర్చించేవి: వ్యభిచార, సమస్య మద్యపాన నిషేధం, వరకట్న సమస్యల్ని గురించి కూడా పత్రికలు చర్చించేవి గానీ వీటిని చర్చించనంత విస్తృతంగా చర్చించలేదు!

సాధారణంగా అన్ని పత్రికలు వివిధ వృత్తాంతాలనే శీర్షికలలో దేశంలో జరిగే వివిధ సంగతుల్ని ప్రచురించేవి! ప్రతి పత్రికలోను ఈ శీర్షిక తప్పకుండా వుంటుంది ఇంటి పనుల్ని గురించిన శీర్షికలు ఒకటి రెండు పత్రికలు నిర్వహించేవి. ఈ పత్రికలన్ని భర్తపట్ల, బిడ్డలపట్ల స్త్రీలు నిర్వహించవలసిన ధర్మాల్ని గూర్చి రాస్తుండేవి!

దేశంలో స్థాపించబడ్డ వివిధ మహిళా సంఘాలు, అవి జరిపే సభలు-సమావేశాలు, స్త్రీ విద్య-వ్యాపకాలు గూర్చిన సమాచారం ఈ పత్రికల్లో కనిపిస్తుంది! ఉత్తమ స్త్రీల చరిత్రలు కూడా తరచూ ప్రచురించబడేవి! హిందూ స్త్రీలను, విదేశీ స్త్రీలతో పోల్చి రాసిన వ్యాసాలు ప్రచురించబడేవి. స్త్రీకి ప్రకృతి శాస్త్రం మొదలైన అంశాల ప్రాథమిక పరిజ్ఞానం కలిగే సమాచారం అందించేవి!

స్త్రీల పత్రికలు స్త్రీని నైతికంగా ఉన్నతురాల్ని చేయడానికి, విద్యావంతురాల్ని చేయడానికి, 'ఉత్తమ గృహిణి'గా తయారుచేయడానికి ఎక్కువగా కృషిచేసినట్లు తెలుస్తుంది. స్త్రీలలో స్వభావ సిద్ధమైన మార్పు, పరివర్తన తీసుకురావడానికి ప్రయత్నించేవి! పత్రికల ద్వారా విజ్ఞాన వంతురాల్ని చేయడానికి ప్రయత్నించేది! ఇంతవరకూ పత్రికలు చర్చించిన వివిధ అంశాల్ని పరిశీలించడం జరిగింది. పై పరిశీలన వలన నాటి స్త్రీల పత్రికల్ని మూడు రకాలుగా విభజించవచ్చు.

1. సంపాదకుల్ని బట్టి
2. స్వభావాన్ని బట్టి
3. దృక్పథాన్ని బట్టి

సంపాదకుల్ని బట్టి :

1. పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రికలు.
2. స్త్రీల సంపాదకత్వంలో వెలువడిన పత్రికలు.

స్వభావాన్ని బట్టి :

1. సంప్రదాయబద్ధంగా నడిచేవి.
2. విప్లవాత్మకమైనవి.
3. తటస్థంగా ఉన్నవి !

దృక్పధాన్ని బట్టి :

1. స్త్రీలకి హితబోధ చేసినవి.
2. స్త్రీల సమస్యల్ని చర్చించి, హక్కుల్ని ప్రశ్నించినవి.

పురుష సంపాదకత్వంలో వెలసిన పత్రికలకి స్త్రీల సంపాదకత్వంలో వెలసిన పత్రికలకు కొంత భేదం గోచరిస్తుంది! పురుష సంపాదికత్వంలో వెలువడ్డ పత్రికలు స్త్రీలకు హితబోధ చేయాలనే దృక్పధంతో ఉంటాయి! స్త్రీలు అజ్ఞానంలో ఉన్నారు వారిని ఉద్ధరించాల్సిన బాధ్యత తమపై ఉన్నదని భావించినట్లు తెలుస్తుంది. అంతేగాదు స్త్రీలు అన్ని విధాల దుష్టవర్తనులుగా

న్నట్లు వారిని సంస్కరించటానికే ఆ పత్రికలు వెలువడినట్లు అనిపిస్తుంది. స్త్రీలు తమ దుష్టప్రవర్తనతో సంసారాన్ని దుఃఖమయం జేస్తున్నారనే భావం పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రికల వల్ల కలుగుతుంది! పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రికల్లో స్త్రీల సమస్యలైన బాల్య వివాహాలు, వితంతువుల అవస్థ వంటి అంశాలకు ప్రాముఖ్యత ఇచ్చినట్లు కనిపించదు. వారు స్త్రీల పత్రికలని స్థాపించింది స్త్రీలకి హితబోధ చేయడానికే కానీ, స్త్రీలకి వారి స్థితిని గురించి వివరించి చెప్పి వారిని కూడా సంస్కరణోద్యమంలో పాల్గొనేట్లు చేయాలనే సంకల్పం ఉన్నట్లు కనిపించదు. స్త్రీలకోసం మొదటి పత్రిక సతీహిత బోధిని కందుకూరి వీరేశలింగం గారి సంపాదకత్వంలో వెలువడింది. ఇందులో 1883 నుంచి 1889 వరకు వచ్చిన వ్యాసాల స్వభావం పై విషయాన్ని స్పష్టం చేస్తుంది. బహుశా వీరి దృష్టిలో స్త్రీలు ఆ విషయాలు ఆలోచించలేరనేమో శ్రీ వీరేశలింగం గారు స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకున్న వ్యక్తి అయితే స్త్రీలకోసం ఆయన స్థాపించిన పత్రికలో ఎక్కడా స్త్రీల సమస్యల్ని గూర్చిన ప్రస్తావన కనిపించదు! 'ప్రాతివత్యం' గృహ నిర్వహణ 'కలహాల మారితనం' ఇతరులపై చాడీలు చెప్పట అమిత వ్యయము మొదలైన వ్యాసాలు స్త్రీ హితబోధ చేసేవేగాని స్త్రీల సమస్యల్ని చర్చించేవి కావు బహుశా వీరేశలింగం గారి దృష్టిలో స్త్రీ సంస్కరింపదగ్గదే గాని ఆమె సంస్కరణలు చేయగలది కాదు! వీరేశలింగం గారి దృష్టిలో ఉన్న స్త్రీకి అటువంటి విషయాల బోధ అనవసరం అనుకున్నారో లేక స్త్రీలని ఆయన ఆ దృక్పథంలోంచి మాత్రమే చూశారో ఆలోచించాల్సిన విషయం।

తర్వాత వచ్చిన తెలుగు జనానా పత్రికా సంపాదకులు శ్రీ రాయసం వెంకట శివుడు గారు, ఈయన సాధ్యమైనంత వరకు వివాదగ్రస్తమైన అంశాల జోలికి పోక దేశంలో మహిళలకి సంబంధించిన సమాచారాన్ని సేకరించి తమ పత్రికలో ప్రచురిస్తుండే వారు. వీరు కూడా అంతో ఇంతో సంస్కరణోద్యమంలో పాలుపంచుకున్న వారే। ఈయన కూడా స్త్రీల సమస్యల చర్చల కంటె స్త్రీకి హితబోధ చేయడానికి ఎక్కువగా పూనుకొన్నట్లు గ్రహించవచ్చు.

ఇక స్త్రీల సంపాదకత్వంలో వెలసిన పత్రికలు స్త్రీల సమస్యల్ని అంటే వితంతు పరిస్థితి, స్త్రీ విద్యలకు, సంబంధించిన అంశాలు, బాల్య వివాహాలకు సంబంధించిన చర్చలు, పాఠశాలల్లో ఉపాధ్యాయినుల ఆవసరం వంటి విషయాలతో పాటు స్త్రీలకి, గర్భధారణ, ప్రసవవేదన, పిల్లలకి తల్లి పాలు ఆవశ్యకత వంటి అంశాల్ని ప్రచురించేవి!

తెలుగులో స్త్రీ సంపాదకత్వంలో వెలువడిన మొదటి స్త్రీల పత్రిక హిందూ సుందరి, రెండవది సావిత్రి, ఇవి రెండూ స్త్రీల సమస్యల్ని చర్చించడం మొదలుపెట్టాయి. విద్యపరంగా గానీ వివాహపరంగా గాని స్త్రీ స్థితిగతుల్ని అంచనా వేసి చర్చించేవి. స్త్రీలు అజ్ఞానంలో వున్నారని ఈ పత్రికలు కూడా ఘోషించేవి!

సతీహిత బోధిని తెలుగు జనానా పత్రికల్లోని రచనలకి ఈ పత్రికలు స్పందించి సమాధానం చెప్పేవి. ఒక్కోసారి ఈ పత్రికలు వివాదగ్రస్తమైన అంశాలకి చర్చా వేదికలయ్యేవి. పురుష సంపాదకత్వంలో పత్రికలు వెలువడప్పుడు రచయిత్రుల సంఖ్య తక్కువగా కనిపిస్తుంది. స్త్రీ సంపాదకత్వంలో పత్రికలు వెలువడడం ప్రారంభమయిన తర్వాత రచయిత్రుల సంఖ్య పెరిగింది. పురుష సంపాదకత్వంలో వెలువడిన పత్రికల్లో మనకి కనిపించే స్త్రీ అజ్ఞాని, మూర్ఖురాలు, స్త్రీ సంపాదకత్వంలో వెలువడిన పత్రికల్లో కనిపించే స్త్రీ సమాజంలో అన్యాయాలకి గురౌతున్న 'అబల', 'అణచివేయబడిన వ్యక్తి' ఆంధ్ర మహిళ కాలానికి కనిపించే నవ్యస్త్రీలో కొంత మార్పు వుంది. ఆమె' విద్యావతి! సంఘ శ్రేయస్సుకు పాటుపడాలని అభిలషించే స్త్రీ, తాను సంఘంలో భాగం అని భావించినది!

ఇవి ముఖ్యంగా స్త్రీ పురుష సంపాదకత్వంలో గోచరించే భేదాలు.

స్త్రీల పత్రికల స్వభావాన్నిబట్టి ఈ పత్రికల్ని మూడు వర్గాలుగా విభజించటం జరిగినది.

1. సంప్రదాయబద్ధంగా నడిచేవి! ఈ పరిధిలోకి సతీహిత బోధిని, సావిత్రీ, అనసూయ, ఆంధ్ర లక్ష్మి మొదలైన పత్రికలు వస్తాయి. ఇవి

పూర్వాచారాలను, సంప్రదాయాలను ఎదిరించకుండా, ఉన్న పరిస్థితి నే మాత్రం ప్రశ్నించకుండా కేవలం స్త్రీని విద్యావంతురాల్ని చేయడానికి ప్రయత్నించేవి.

విప్లవ భావాలు కలిగిన పత్రికలు హిందూ సుందరి, ఆంధ్ర మహిళ మొదలైనవి. ఇవి స్త్రీల పరిస్థితిని చర్చిస్తూ, సమాజాన్ని ప్రశ్నిస్తూ హక్కుల్ని గురించి ప్రయత్నించేవి. ఆచారాల్ని ప్రశ్నించేవి! స్త్రీని విద్యావంతురాల్ని చేయటంతో పాటు స్వతంత్ర్య వ్యక్తిగా కూడా తయారు చేయాలని ప్రయత్నించేవి. అయితే ఈ రెండు పత్రికల ప్రచురణలో ఎంతో కాలవ్యవధి ఉంది! కాలానుగుణమైన పరిణామం కూడా వీటిలో గోచరిస్తుంది.

తటస్థంగా ఉండే పత్రికలు, తెలుగు జనానా, బాలిక, వివేకవతి, గృహలక్ష్మి పత్రికలు ఈ పరిధిలోకి వస్తాయి. ఇవి వివాదగ్రస్తమైన అంశాల జోలికిపోక సాధ్యమైనంతవరకు సమాచారాన్నందించేవిగాను, సాహిత్యాన్నందించేవిగాను ఉండేవి. దేశంలోని వివిధ ప్రాంతాల్లో జరిగిన సంఘటనలు ఉపన్యాసాలు (స్త్రీలకు సంబంధించినవి) కి సంబంధించిన విషయ సేకరణతో ఈ పత్రికలు ప్రచురించబడేవి :

దృక్పథాన్ని బట్టి స్త్రీల పత్రికలు :

స్త్రీకి హితబోధ చేసేవి-

స్త్రీల సమస్యల్ని చర్చించి హక్కుల్ని ప్రశ్నించేవి!

సతీహిత బోధిని, తెలుగు జనానా పత్రికలు హితబోధ చేసేవిగా ఉండేవి.

హిందూ సుందరి, సావిత్రి, అనసూయ, ఆంధ్రలక్ష్మి ఆంధ్ర మహిళ పత్రికలు స్త్రీల సమస్యల్ని చర్చించేవి. అయితే వీటిలో హిందూ సుందరి, ఆంధ్ర మహిళలు స్త్రీల హక్కుల్ని కూడా ప్రశ్నించేవి! ఈ పత్రికలు హితబోధ చెయ్యలేదా అంటే లేదని జవాబు రాకపోయిన అది ప్రధానంగా జరిగేది కాదు.


స్త్రీల పత్రికలు
సంపాదకత్వాన్నిబట్టి
స్వభావాన్నిబట్టి
దృక్పథాన్నిబట్టి
సంప్రదాయబద్ధమైవి
విప్లవాత్మక మైనవి
తటస్థంగా వుండేవి
పురుష సంపాదకత్వం
స్త్రీ సంపాదకత్వం
స్త్రీకి హితబోధ బోసేవి
స్త్రీ సమస్యల్ని చర్చించేవి

## జ్ఞాపికలు

1. స్త్రీలకి ముందుగా కొద్దికొద్దిగా విద్యాది విషయాలు బోధిస్తే మంచి దని, రాజకీయాలని అర్థం చేసుకొనే పరిజ్ఞానం వారికి లేదని అందు వల్లే మొదట్లో స్త్రీల పత్రికలు రాజకీయాల్ని చర్చించ లేదని కొందరి అభిప్రాయం!

2 కందుకూరి వీరేశలింగం పంతులు - ''చదువెఱుఁగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు'' *సతీహిత బోధిని* మే 1883.

3. ''అత్తగారి కోదండ్రికము'' *సతీహిత బోధిని* 1883 జూలై.

4. కందుకూరి వీరేశలింగం పంతులు "పరుల మీద దోషములు చెప్పుట", *సతీహిత బోధిని* జూన్ 1884.

5. కందుకూరి వీరేశలింగం పంతులు ''తగవులమాడి తనము'' *సతీహిత బోధిని*.

6. కం॥ వీ॥ పం॥ ''కొండెములు చెప్పుట'' *సతీహిత బోధిని* మార్చి 1888.

7. కం॥ వీ॥ పం॥ హిందూ సుందరుల ప్రస్తుత స్థితి *సతీహిత బోధిని* డిశెంబరు 1888.

8. కం॥ వీ॥ పం॥ ''గృహిణీ ధర్మము'' *సతీహిత బోధిని* జూన్ 1888.

9. కం॥ వీ॥ పం॥ ''హిందూ సుందరుల ప్రస్తుత స్థితి *సతీహిత బోధిని* డిశెంబరు 1888.

10. కం॥ వీ॥ పం॥ ''స్త్రీలు చదువవలసిన విషయములు" *సతీహిత బోధిని* డిశెంబరు-జనవరి 1883-84.

11. ''హిందూ బాలికలకు విద్య నేర్పుట'' 1901 డిశెంబరు
*తెలుగు జనానా* పుటలు 191-192

12. వడ్డాది వెంకటరత్నమ్మ "స్త్రీ విద్య'' అక్టోబర్-నవంబర్ 1905,
*హిందూ సుందరి* పుట 223

13. నడింపల్లి రాజన్ రాజా ''స్త్రీ విద్యా విధానం'' ఫిబ్రవరి-మార్చి, 1920
*అనసూయ* పుటలు 53-56

14. ''*ఆంధ్ర లక్ష్మి*'' డిశెంబరు 1922. పుటలు 5-9

15. అప్పటికి ఇంగ్లీషు విద్య నేర్చిన పురుషులు పాశ్చాత్య నాగరికతను అనుసరించడంవలన స్త్రీలపట్ల ఇటువంటి హెచ్చరిక చేయడం జరిగి వుంటుంది.

16. వట్టి అమ్మాజీ ''స్త్రీలు — పారిశ్రామిక విద్య" *ఆంధ్ర మహిళ* జనవరి, 1946.

17. కందుకూరి వీరేశలింగం పంతులు ''పతివ్రతా ధర్మము'' *సతీహిత బోధిని*, జూన్ 1883.

18. కొటికలపూడి సీతమ్మ ''సతీధర్మము (వచనము) 'సావిత్రి జనవరి, 1904.

19. యం. కె. మీనాక్షి సుందరమ్మ ''పాతివ్రత్యము" అనసూయ నవంబరు-డిశెంబరు, 1919.

20. కం. వీ. పం. ''పతివ్రతా ధర్మము'' *సతీహిత బోధిని*, జూన్ 1883.

21. కం. వీ. పం. ''చదువెఱుఁగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు'' *సతీహిత బోధిని*, మే 1883.

22. అదుర్తి భాస్కరమ్మ ''బాలికా వివాహములు'' *హిందూ సుందరి*, జూలై 1913.

23. కొటికలపూడి సీతమ్మ ''సతీ ధర్మములు 'సావిత్రి' జనవరి 1904.

24. పి. వి. కె. రావు "మహిళల స్థానము బాల్య వివాహము", ఆంధ్ర మహిళ, ఏప్రిల్ 1946.

25. తెలుగు జనానా పత్రిక అక్టోబరు, 1902. సం. X సంచిక 4.

26. "హిందూ వితంతువుల దురవస్థ" హిందూ సుందరి, ఆగస్టు 1912.

27. పైదే

28. కల్లెపల్లె వెంకట రమణమ్మ "మహిళా మనోరమ" 'సావిత్రి' ఫిబ్రవరి, 1904.

29. మొసలికంటి రమాబాయమ్మగారు, "వితంతు కేశ ఖండనము" హిందూ సుంధరి, అక్టోబరు, 1905.

39. హిందూ సుందరి పత్రిక ఓ పక్కనుంచి వితంతువుల దురవస్థకి వారిని అమానుషంగా అణచి వేయడం గురించి ఘోషిస్తుంటే' సావిత్రి పత్రిక మరో పక్కనుంచి వితంతు పునర్వివాహాలు చెల్లవని' వారు పవిత్రంగా ఉండి విద్య నభ్యసించి, తమ వారికి చేతనైన సేవ' చేయాలని వాదించేవి! సావిత్రి పత్రిక వీరేశలింగంగారి పునర్వివాహోద్యమాన్ని కూడా నిరసించేది.

31. కం. వీ. పం. "గృహిణీ ధర్మము", సతీహిత బోధిని జూన్ 1888.

32. కమలాంబ సత్యనాథముగారు, "మన బాలికల విద్య" 'తెలుగు జనానా', మే, 1902.

33. దేవగుప్త సన్యాసిరాజుగారు, "సతీమణి". 'సావిత్రి', జూన్, 1911.

34. గోపిశెట్టి సూర్యనారాయణమ్మ, "స్త్రీ విద్య", అనసూయ, నవం-డిశెంబరు 1919.

35. ఆంధ్రలక్ష్మి, డిశెంబర్ 1922. సం. 2, సంచిక 1. పుటలు 5-9

36. కం. వీ. పం. "హిందూ సుందరుల ప్రస్తుత స్థితి 'సతీహిత బోధిని' డిశెంబర్ 1888.

37. తెలుగు జనానా, అక్టోబర్, 1902. పుట 136
38. అయితరాజు, జీడిగంటి రామారావు, "హైందవ యువతీ దురవస్థ" హిందూ సుందరి, జూలై 1912.
39. ఆకుంది వెంకటశాస్త్రి "స్త్రీ తన స్థితికి వగచుట" అనసూయ, సెప్టెంబర్, అక్టోబర్, 1919.
40. వట్టి అమ్మాజీ "స్త్రీలు పారిశ్రామిక విద్య" 'ఆంధ్ర మహిళ' జనవరి, 1946.
41. ఉన్నతవర్గాలు అంటే కులపరంగా వాడబడింది! సంఘంలో ఉన్నత కులాలుగా భావించబడే వారిలోనే స్త్రీలు ఎక్కువగా సమస్యలకి గురైనట్టు తెలుస్తుంది.

(ఇతర కులాల స్త్రీలకి సమస్యలు లేవని కాదు)

# ముగింపు

తెలుగులో స్త్రీల పత్రికల్ని గురించి చర్చిస్తూ, ఆక్రమంలో నాటి సమాజంలో స్త్రీలసమస్యలుగా పరిగణించబడుతున్న అంశాల్ని ప్రస్తావించాము. వాటిల్లో కూడా ముఖ్యంగా స్త్రీ జీవితంలో ఎన్నదగ్గ మార్పు తేగల విద్య, వివాహం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మొదలగు విషయాల్ని గూర్చి విపులమైన చర్చ వుంది. వీటి ద్వారా సామాజికంగా స్త్రీ పరిస్థితిని అంచనావేసే ప్రయత్నంలో, నాటి పత్రికలు, సంస్కర్తలు స్త్రీని ఏ దృక్పథంతో చూశారు అనే అంశమే ఈ ముగింపు వాక్యాలు.

తొలి స్త్రీల పత్రిక వెలువడేనాటి సామాజిక స్థితిగతుల్ని ఆర్థిక, విద్యా, వివాహ, కులవ్యవస్థలకి సంబంధించి చర్చించి, నాటి స్త్రీ స్థితిని గూర్చి విపులంగా చర్చించి ఆ పరిస్థితి తొలి స్త్రీల పత్రిక వెలువడడానికి ఏ విధంగా దోహదం చేసిందో చెప్పాం. వీటి అన్నిటి మీద సంస్కరణోద్యమ ప్రభావం అంతర్లీనంగా వుంది.

స్త్రీలను మొదట రెండు రకాలుగా విభజించి తర్వాత ఏర్పడిన మూడో వర్గం గూర్చి కూడా చర్చించడం జరిగింది. కుటుంబ వ్యవస్థలోని స్త్రీలు, కుటుంబ వ్యవస్థలో లేని స్త్రీలు, కుటుంబ వ్యవస్థలోనే వుంటూ అభ్యుదయకరమైన. సంస్కరణ భావాలు కలిగిన స్త్రీల గురించి చర్చించి, స్త్రీల పత్రికలు ఎక్కువగా చర్చించిన స్త్రీ విద్య, వివాహాది అంశాల్ని గూర్చి చర్చించాం

1883 నుంచి 1947 వరకు వచ్చిన స్త్రీల పత్రికలను కాలక్రమానుగతంగా పరిశీలించి వాటికి సంబంధించిన వివరాలన్నింటిని, ఇస్తూ ఆయా పత్రికల స్వభావాన్ని అంచనావేశాం.

సమాజంలో నాడు స్త్రీల సమస్యలుగా పరిణమించి, స్త్రీల పత్రికలు విస్తృతంగా చర్చించిన అంశాల పట్ల స్త్రీల పత్రికల దృక్పథాన్ని అంచనా

వేసే ప్రయత్నం వుంది. స్త్రీ విద్య, బాల్య వివాహాలు, పాతివ్రత్యం, వితంతు దురవస్థ, గృహ నిర్వహణ, స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మొదలగు విషయాల పట్ల పత్రికల దృక్పధాన్ని తెలియజేసే సమాచారాన్ని ఆయా పత్రికల నుంచి గ్రహించి వాటి దృక్పథం కూడా అంచనా వేశాం.

19వ శతాబ్దంలో తలెత్తిన స్త్రీ విద్యా వుద్యమం క్రమంగా విస్తరించింది. అయితే స్త్రీ విద్య ద్వారా ఉత్తమ గృహిణిగా తయారుకావాలనే భావం ప్రధానంగా వ్యక్తమయింది. స్త్రీకి విద్య ద్వారా గృహ నిర్వహణ సామర్థ్యం పెంపొందించి, ఆమె భర్తకు అనుకూలమైన భార్యగా తయారుకావడానికి వీలుగా ఉండాలనే అభిప్రాయం గోచరమౌతుంది. విద్య ద్వారా అప్పటి స్త్రీ పరిస్థితిలో కుటుంబ పరిధిలో ఎన్నదగ్గ మార్పు తెచ్చే ప్రయత్నం కనిపిస్తుంది. ఈ మార్పు ఆ సామాజిక పరిస్థితుల పరిమితులకి లోబడి వుంది.

బాల్య వివాహాలకి సంబంధించినంతవరకు అన్ని పత్రికలు వాటిని ఖండించాయి. బాల్య వివాహాల వల్ల స్త్రీ శారీరకంగా, మానసికంగా ఎంతగానో నష్టపోతోందని, ఒక్కొక్కసారి ఈ బాల్య వివాహాలు పురుషుల జీవితాల్ని కూడ దుఃఖమయం చేస్తున్నాయని, ముఖ్యంగా స్త్రీ అభ్యున్నతి పొందాలంటే బాల్య వివాహాల నిర్మూలనం జరగాలని నాటి స్త్రీల పత్రికలు వాంఛించాయి.

19వ శతాబ్ది తుది దశకాల్లోనూ, 20వ శతాబ్ది తొలి దశకాల్లోనూ వెలువడిన స్త్రీల పత్రికలన్నీ కూడా పాతివ్రత్యాన్ని గూర్చి ఎంతగానో ఘోషించాయి. వివాహ వ్యవస్థలోని లోపాల కారణంగా, స్త్రీ ప్రవర్తనలో అవాంఛనీయ ధోరణులు సంఘంలో చోటుచేసుకుంటున్నాయి. ఆ పరిస్థితిని అరికట్టడానికి నాటి స్త్రీల పత్రికలు పాతివ్రత్యాన్ని గూర్చి అంతగా నొక్కి చెప్పి వుంటాయి. విపరీతమైన బాల్య వివాహాలు, ఈడుజోడులేని వివాహాల వల్ల చిన్నతనంలోనే అనేక మంది వితంతువులు కావడం వల్ల స్త్రీ నైతికంగా దిగజారే పరిస్థితి నాటి సంఘంలో ఏర్పడి వుంటుంది. దాన్ని సరిదిద్దే ప్రయత్నంలోనే స్త్రీల పత్రికలు స్త్రీకి పాతివ్రత్యం గూర్చి సాధ్యమైనంత ఎక్కువగా బోధించడానికి ప్రయత్నించాయి. పత్రికలు పాతివ్రత్య బోధ చేసేముందు స్త్రీకి ప్రకృతి సహజమైన వాంఛలుంటాయనే విషయం విస్మరించాయి.

వితంతువుల దురవస్థను గురించి పత్రికలన్నీ ఎంతగానో స్పందించాయి. వారినుద్ధరించాలని ఎందరో సంస్కర్తలు కంకణం కట్టుకున్నారు. వితంతువుల పరిస్థితిని గూర్చి చదువుకొన్న స్త్రీలు ప్రశ్నించడం మొదలు పెట్టారు వితంతువులకు కనీసం చదువుకునే అవకాశం కల్పించాలనే అభిప్రాయం ఏర్పడింది.

వితంతు వివాహోద్యమం సంఘంలో సంచలనం సృష్టించింది. ఈ విషయానికి సంబంధించి సంఘంలో చెలరేగిన వివాదాలకి, పత్రికలు చర్చా వేదికలయ్యాయి. అయితే అన్ని పత్రికల్లోనూ ఈ అంశానికి సంబంధించిన చర్చలు కనిపించవు.

స్త్రీ విద్యావంతురాలైతే గృహ నిర్వహణలో ఆమె సమర్థురాలు కాగలదనే భావం సర్వత్ర గోచరించింది. నాటి పత్రికలు గృహ నిర్వహణ అంటే ఇంటి అలంకరణలకు సంబంధించిన అంశాల్ని గాక స్త్రీ మనోగతమైన పరివర్తనకు ప్రాధాన్యం ఇచ్చాయి. యింటి పస్తు చేసికోవడమే గృహ నిర్వహణ కాదు. అందరి మనసులు మెప్పిస్తూ, తాము మెప్పుపొందుతూ, చేయగలగటమే సరియైన గృహ నిర్వహణ అటువంటి సామర్థ్యం స్త్రీకి అలవడాలంటే ఆమె విద్యావంతురాలు కావాలనే భావం సర్వత్ర గోచరమైంది. అంటే స్త్రీ మానసికమైన ఎదుగుదలని పత్రికలు వాంఛించాయి.

స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి సంబంధించి ఈ పత్రికలు సాధ్యమైనంతవరకు సంప్రదాయ మార్గాన్నే అనుసరించాయి. స్త్రీ స్వేచ్ఛ పురుషుని వ్యాపకాల కనుగుణంగా ఉండాల్సిందేననే అభిప్రాయాన్ని ప్రచురించాయి.

స్త్రీకి స్వేచ్ఛ అంటే అది ఆమె ఇంటి పరిసరాల్లోనే అనుభవించాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చాయి. స్త్రీని స్వతంత్ర వ్యక్తిగా కంటె పురుషచ్ఛాయగానే చూడగలిగాయి. స్త్రీకి స్వేచ్ఛ లేదనే గుర్తింపు నాడు కలిగిందిగానీ ఆమెకి స్వేచ్ఛ కావాలనే తపన కలగలేదు.

పురుష సంపాదకత్వంలో నడిచిన స్త్రీల పత్రికల్లో కనిపించే స్త్రీ అజ్ఞాని, మూర్ఖురాలు, అందుకే ఆ పత్రికలు ఆమెకు హితబోధ చేశాయి.

స్త్రీ సంపాదకత్వంలో వెలువడ్డ పత్రికల్లో కనిపించే స్త్రీ అన్యాయానికి గురౌతున్న అబల. అణచివేయబడుతున్న వ్యక్తి. కాబట్టి వాటిల్లో స్త్రీల సమస్యలు చర్చించబడి హక్కులు వాంఛించబడ్డాయి. ఈ హక్కులు సాధారణంగా విద్యా వివాహ విషయాలకి సంబంధించినవి. వివాహ విషయంలో ఈ పత్రికల ప్రయత్నం చాలావరకు బాల్య వివాహాలు మాన్పించడమే. అయితే ఏ పత్రిక వితంతు వివాహాన్ని నొక్కిచెప్పినట్టు కనిపించదు. వితంతువుల పట్ల సానుభూతి మాత్రం కనిపిస్తుంది. అయితే ఈ పత్రికలకి సంపాదకత్వం వహించిన స్త్రీలంతా సాధారణంగా కుటుంబ వ్యవస్థలోనే వుంటూ విప్లవాత్మకమైన (ఆ కాలానికి ఆ భావాలే విప్లవాత్మకమైనవి.) భావాలు కలవారు. కుటుంబ వ్యవస్థకి భంగం వాటిల్లుతుంది. అందువల్ల స్త్రీలు ఇంటికి పరిమితమై ఉండాలనే విషయం పత్రికల్లో ప్రత్యక్షంగా చెప్పకపోయినా, పాతివ్రత్యాన్ని గూర్చి పదేపదే బోధించడంలోని అంతరార్థం కుటుంబ వ్యవస్థ పటిష్టతకోసమే అనే భావం కలుగుతుంది.

ఈ పత్రికల్ని సంపాదకత్వాన్నిబట్టి స్వభావాన్నిబట్టి, దృక్పథాన్ని బట్టి మూడు వర్గాలుగా విభజించవచ్చు. సంపాదకత్వాన్నిబట్టి పురుష సంపాదకత్వంలో వెలువడ్డవి, స్త్రీ సంపాదకత్వంలో వెలువడ్డవి అని రెండు రకాలు. స్వభావాన్నిబట్టి సంప్రదాయబద్ధమైనవి, విప్లవాత్మకమైనవి, తటస్థంగా ఉండేవి అని మూడు వర్గాలు.

దృక్పథాన్నిబట్టి స్త్రీకి హితబోధ చేసేవి. స్త్రీ సమస్యల్ని చర్చించి హక్కుల్ని ప్రశ్నించేవి అని రెండు రకాలు.

ఆయా పత్రికల సంపాదకుల దృక్పథాన్నిబట్టి ఆ పత్రిక స్వభావం, దృక్పథం ఏర్పడడం సహజం. నాటి పత్రికాధిపతుల దృష్టిలో నాటి స్త్రీ సంస్కరింపబడాల్సిన వ్యక్తి. అందువల్ల విద్య ద్వారా ఆమెను సంస్కరించాలని ప్రయత్నించారు. వితంతు దురవస్థకు వారు చింతించారు. వితంతు వివాహాలు జరిపించారు. కానీ వాటిని గూర్చి వారు (పత్రికాధిపతులైన సంస్కర్తలు) నడిపిన స్త్రీల పత్రికల్లో ఎక్కడా చర్చించలేదు. బహుశా వారి దృష్టిలో స్త్రీలు సంస్కరింపదగ్గవారే కానీ స్త్రీలకి ఇటువంటి విషయాలు చెపితే అర్థం

చేసుకోలేరనేమో! ఇది ఒక ఊహ మాత్రమే. ఎందువల్ల ఆ విషయాల్ని సంస్కర్తలు స్త్రీల పత్రికల్లో చర్చించలేదు అనే అంశాన్ని పత్రికల పరిధి లోనే నిర్ణయించి చెప్పటం కష్టం. పరిశోధన చేస్తే సరియైన సమాధానాలు దొరకవచ్చేమో! అయితే స్త్రీలు సంపాదకత్వం వహించిన పత్రికల్లో ఏ విధంగా నైతేనేమి ఈ అంశాలు విస్తృతంగానే చర్చించబడ్డాయి.

హిందూ స్త్రీల సమస్యలన్నిటికి వారు విద్యావతులు కాకపోవడమే కారణంగా భావించడం జరిగింది. విద్యావతియైన స్త్రీకి సమస్యలు కొంచెం ఎక్కువౌతాయని వారూహించలేకపోయారు.

> "ఇప్పటికి మన హిందూ స్త్రీలకు పూర్వకాలమున గల సద్విద్యయు. వుచిత స్వాతంత్రయము నశించి మూర్ధ దేవతా ప్రభావముచే అనేక యిక్కట్టులకు లోబడి కాలక్రమేణ పురుషుల వలన జడ పదార్థముల వలె చూడబడుచున్న, పశుప్రాయులమై యుంటిమి"1

పురుషులచే తాము పశుప్రాయులుగా చూడబడుతున్నామనే భావం తలెత్తింది. స్త్రీలలో ఒక విధమైన చైతన్యం క్రమంగా కలిగింది. విద్యా ప్రభావంవల్ల ఒక విధమైన తిరుగుబాటు ధోరణి ఏర్పడుతోంది. నాటి సమాజంలో చాలమంది పురుషులు హిందూ స్త్రీని విద్యావంతురాల్ని చేస్తున్నట్లు, ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాడుతున్నట్టు ప్రవర్తించారు. నిజంగా స్త్రీకి స్వేచ్ఛనిస్తే ఆమె కుటుంబ వ్యవస్థలోంచి బయటికి వస్తుందేమోననే భయం వుంది. అంటే నాటి స్త్రీ కుటుంబ వ్యవస్థ నుంచి బయటకిరావటానికి ప్రయత్నిస్తోందని భావం కాదు. అయితే ఆనాటి సంస్కరణోద్య వాతావరణంలో స్త్రీ గృహ పరిధిని దాటి ఇవతలకు రావచ్చు అనే ఆలోచనకే అవకాశం లేదు.

సంస్కరణోద్యమ కాలంలో (1850-1920) సంఘంలో తలెత్తిన స్త్రీ జనోద్ధరణ కార్యక్రమం స్త్రీని ఎంతవరకు సంస్కరించి, ఏ పరిధికి తేవాలి అనే అంశంలో కొన్ని పరిమితుల్ని కలిగివుంది.

స్త్రీకి ఎంతవరకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాన్నివ్వాలనే విషయంలో సంస్కర్తలు పూర్తి విశాల దృక్పథంతో ఆలోచించలేకపోయారనిపిస్తుంది. స్త్రీలను కాలానుగుణంగా విద్యావంతురాల్ని చేస్తే తమ కార్యకలాపాల్లో ఆమె తోడ్పాటు లభిస్తుందనే ఆశయంతోనూ, ఆమెకు సాధ్యమైనంతవరకు పూర్వ సంప్రదాయ పద్ధతుల సడలింపు లేకుండానే విద్యాబోధ జరిగింది. స్త్రీవిద్య ఆమె పురుషునికి అనుకూలమైన సహచారిణిగా కావడానికే గాని, ఆమెని స్వతంత్ర వ్యక్తిగా తయారుచేయాలనే భావం గోచరించదు. విద్యావంతురాలైన స్త్రీ స్వేచ్ఛ విషయంలో వారు పూర్తి విశాల దృక్పథం అవలంభించలేకపోయారు. గొప్ప గొప్ప సంస్కర్తలంతా కూడా స్త్రీ పురుష సంబంధాల పట్ల, భార్య, భర్త పట్ల కలిగివుండాల్సిన వైఖరికి సంబంధించి, సంప్రదాయ పద్ధతికి భిన్నమైన పద్ధతిలో ఆలోచించలేదు. వారు వితంతు పునర్వివాహాలు చెయ్యగలిగారు గానీ, దుష్టుడైన భర్త చేతుల్లోంచి భార్యకి విముక్తి కలిగించలేకపోయారు. వీరేశలింగం గారి లాంటి వారే భర్త దుష్టుడైనా, దుర్మార్గుడైనా, కుంటి వాడైనా, కురూపైనా, భార్య జీవితాంతం అతగాడ్ని బాగు పరుచుకునే ప్రయత్నంలోనే ఉండాలి కానీ వార్ని విడిచిపెట్టకూడదని బోధించారు. ఇది వీరేశలింగం గారి తప్పుకాదు. ఈ సమాజ నిర్మాణంలోనే వున్న లక్షణం. ఇది పురుష స్వామ్య సమాజం. ఈ సమాజంలో స్త్రీ చదువుకున్నా, వివాహం చేసుకున్నా, అది ఆమె స్వతంత్ర వ్యక్తిత్వ వికాసానికికాక, పురుష అనువర్తినిగా మెలగడానికి ఉపకరించే పద్ధతిలోనే ఏర్పడింది. స్త్రీ విద్య గృహ నిర్వహణతోనే ముడిపెట్టబడింది. స్త్రీకి ఇంటిని మించిన స్వేచ్ఛా వాతావరణం లేదని సిద్ధాంతీకరించబడింది. స్త్రీకి స్త్రీనే శత్రువుగా తయారు చేయడం జరిగింది. అత్తగారు కోడల్ని బాధపెట్టిందంటే అది అత్తగారి తప్పు కాదు. ఆమెని అట్లా తయారుచేసిన పరిస్థితుల తప్పు. తను అందుకోలేని సుఖం, తాను అనుభవించలేని స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని తన కోడలు పొందకూడదనే స్వభావం స్త్రీలో పెరగడానికి, ఆమె నిర్బంధ వైధవ్యం మితిమీరిన సంఘ కట్టుబాట్లు కారణం. స్త్రీకి మొదట్నించి సంఘంతో సరియైన సంబంధాలనుండనిచ్చి, స్త్రీని స్త్రీగా గౌరవించగలిగితే స్త్రీకి స్త్రీయే శత్రువయ్యేదికాదేమో!

సంఘ సంస్కరణోద్యమకాలంలో వెలువడిన స్త్రీల పత్రికలను పరిశీలించినప్పుడు నాటి స్త్రీని గురించిన ఆశ్చర్యకరమైన ఆలోచనలు తలెత్తుతున్నాయి. నాటి స్త్రీ నిజంగా అంత మూర్ఖంగా ఉండేదా! ఉంటే ఆమె అట్లా తయారుకావడానికి దారితీసిన పరిస్థితులేవిటి? పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడుతున్న పురుషులు తమ స్త్రీలను మాత్రం ఆ వ్యామోహం జోలికి పోకుండా అరికట్టాలని ప్రయత్నంచేశారా? ఆ ప్రయత్నంలో ఒక సాధనంగా స్త్రీ విద్య నుపయోగించుకున్నారా?

స్త్రీల పత్రికలు స్త్రీల సమస్యల్ని కొంతవరకు చర్చించాయి. అయితే ఆనాటికి ఆ చర్చలే ఎంతో అభ్యుదయకరమైనవి కావచ్చు. పత్రికల్ని మాత్రమే పరిశీలించి చూస్తున్నప్పుడు, స్త్రీల పత్రికలు కూడా స్త్రీని, స్వేచా జీవినిగా చేయటాని కంటె మగవారి అడుగుజాడల్లో నడిచే (నడవాల్సిన వ్యక్తిగా తయారుచేయడానికి మాత్రమే ఉపకరించాయనిపిస్తుంది.

> "అహర్నిశలు స్త్రీలకు సత్కాలక్షేపమునకు కారణమై విజ్ఞాన వివేకదాయకములై వుండవలసిన పత్రికలు మటుకు అందుకు తోడ్పడుట లేదు. ఈ పత్రికలోని నాయికలు విద్యావంతులు అశీలలై వుంటున్నారు."2

అన్న ఈ విమర్శ అన్ని పత్రికలకి అన్వయించలేము. ఎందుకంటే తొలి స్త్రీల పత్రిక నుంచి 1947 వరకు వచ్చిన, స్త్రీల పత్రికల్ని చూసినట్లైతే, స్త్రీ విద్యావ్యాసంగానికి సంబంధించి ఎంతో ప్రోత్సహించాయి. అయితే ఆ పత్రికలు ఆ సామాజిక పరిమితుల కనుగుణంగానే ప్రవర్తించాయి.

"స్త్రీల అభ్యుదయమునకు పాటుపడే పత్రికలున్నంత మాత్రమున సరిపోదు. వాటిని సరిఅయిన విధమున వుపయోగించుకోగల సామర్థ్యము స్త్రీలలో కలగాలి. ఏర్పికూర్పి ప్రచురించబడే పత్రికలను తమ జాతికి మరింత ఉపయోగకరముగా ఉండేటట్లు చేయుట కేవలం స్త్రీల పని."

స్త్రీల పత్రికలన్నీ స్త్రీ అభ్యుదయానికి పాటుపడ్డాయని ఖచ్చితంగా చెప్పలేము. అట్లాగని స్త్రీ అభ్యుదయంకోసం పాటుపడిన పత్రికల్ని స్త్రీలు ఆదరించారని చెప్పలేము. సంస్కరణోద్యమ కాలంలో స్త్రీ పరిస్థితిని గూర్చి పరిశోధించాల్సిన అవసరాన్ని ఈ పత్రికలు కలిగిస్తున్నాయి. పత్రికలకి తోడుగా ఆనాటి సాహిత్యాన్ని కూడా తీసుకుని సాహిత్యంలో సహితం వ్యక్తమయ్యే స్త్రీ స్థితిగతుల్ని సమగ్రంగా పరిశీలించాల్సిన అవసరం వుంది.

## జ్ఞాపికలు

1. వడ్డాది వెంకటరత్నమ్మ 'స్త్రీ విద్య' హిందూసుందరి
అక్టొబరు-1905

2. అచ్యుతుని గిరిజ 'పత్రికలు-వాటి ప్రయోజనాలు' ఆంధ్రమహిళ
ఏప్రిల్ 1945

# పత్రికా ప్రతుల పట్టిక

## లభించిన స్త్రీల పత్రికలు

**సతీహిత బోధిని :**

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1888 | సెప్టెంబరు | 3 | 4 |
| 2) | 1888 | అక్టోబరు | 3 | 5 |
| 3) | 1888 | నవంబరు | 3 | 6 |
| 4) | 1888 | డిశంబరు | 3 | 7 |
| 5) | 1889 | జనవరి | 3 | 8 |
| 6) | 1889 | ఫిబ్రవరి | 3 | 9 |
| 7) | 1889 | మార్చి | 3 | 10 |
| 8) | 1889 | ఏప్రిల్ | 3 | 11 |
| 9) | 1889 | మే | 3 | 12 |

**తెలుగు జనానా పత్రిక :**

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1899 | ఫిబ్రవరి | 6 | 8 |
| 2) | 1899 | ఏప్రిల్ | 6 | 10 |
| 3) | 1899 | మే | 6 | 11 |
| 4) | 1899 | జూలై | 7 | 1 |
| 5) | 1899 | ఆగస్టు | 7 | 2 |
| 6) | 1899 | సెప్టెంబర్ | 7 | 3 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 7) | 1899 | అక్టోబరు | 7 | 4 |
| 8) | 1899 | డిశంబర్ | 7 | 6 |
| 9) | 1900 | జనవరి | 7 | 7 |
| 10) | 1900 | ఫిబ్రవరి | 7 | 8 |
| 11) | 1900 | జూన్ | 8 | 1 |
| 12) | 1900 | ఆగస్టు | 8 | 2 |
| 13) | 1900 | సెప్టెంబరు | 8 | 3 |
| 14) | 1900 | అక్టోబరు | 8 | 4 |
| 15) | 1900 | నవంబరు | 8 | 5 |
| 16) | 1900 | డిశంబరు | 8 | 6 |
| 17) | 1901 | జనవరి | 8 | 7 |
| 18) | 1901 | ఫిబ్రవరి | 8 | 8 |
| 19) | 1901 | మార్చి | 8 | 9 |
| 20) | 1901 | ఏప్రిల్ | 8 | 10 |
| 21) | 1901 | మే | 8 | 11 |
| 22) | 1901 | జూన్ | 8 | 12 |
| 23) | 1901 | జూలై | 9 | 1 |
| 24) | 1901 | ఆగస్టు | 9 | 2 |
| 25) | 1901 | సెప్టెంబరు | 9 | 3 |
| 26) | 1901 | అకోబరు | 9 | 4 |
| 27) | 1901 | నవంబరు | 9 | 5 |
| 28) | 1901 | డిశంబరు | 9 | 6 |
| 29) | 1902 | జనవరి | 9 | 7 |
| 30) | 1902 | ఫిబ్రవరి | 9 | 8 |
| 31) | 1902 | మార్చి | 9 | 9 |
| 32) | 1902 | ఏప్రిల్ | 9 | 10 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 33) | 1902 | మే | 9 | 11 |
| 34) | 1902 | జూన్ | 9 | 12 |
| 35) | 1902 | జూలై | 10 | 1 |
| 36) | 1902 | అగస్టు | 10 | 2 |
| 37) | 1902 | సెప్టెంబరు | 10 | 3 |
| 38) | 1902 | అక్టోబరు | 10 | 4 |
| 39) | 1902 | నవంబరు | 10 | 5 |
| 40) | 1902 | డిశంబరు | 10 | 6 |
| 41) | 1903 | జనవరి | 10 | 7 |
| 42) | 1903 | ఫిబ్రవరి | 10 | 8 |
| 43) | 1903 | మార్చి | 10 | 9 |
| 44) | 1903 | ఏప్రిల్ | 10 | 10 |
| 45) | 1903 | మే | 10 | 11 |
| 46) | 1903 | జూన్ | 10 | 12 |
| 47) | 1903 | జూలై | 11 | 1 |
| 48) | 1903 | ఆగష్టు | 11 | 2 |
| 49) | 1903 | సెప్టెంబరు | 11 | 3 |
| 50) | 1903 | అక్టోబరు | 11 | 4 |
| 51) | 1903 | నవంబరు | 11 | 5 |
| 52) | 1903 | డిశంబరు | 11 | 6 |
| 53) | 1904 | జనవరి | 11 | 7 |
| 54) | 1904 | ఫిబ్రవరి | 11 | 8 |
| 55) | 1904 | మార్చి | 11 | 9 |
| 46) | 1904 | ఏప్రిల్ | 11 | 10 |
| 57) | 1904 | మే | 11 | 11 |
| 58) | 1904 | జూన్ | 11 | 12 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 59) | 1904 | జూలై | 12 | 1 |
| 60) | 1904 | ఆగష్టు | 12 | 2 |
| 61) | 1904 | సెప్టెంబరు | 12 | 3 |
| 62) | 1904 | అక్టోబరు | 12 | 4 |
| 63) | 1904 | నవంబరు | 12 | 5 |
| 64) | 1904 | డిశంబరు | 12 | 6 |

*తెలుగు జనానా పత్రిక & సతీహిత బోధిని*

| | | | | |
|---|---|---|---|---|
| 65) | 1905 | జనవరి | 12 | 7 |
| 66) | 1905 | ఫిబ్రవరి | 12 | 8 |
| 67) | 1905 | మార్చి | 12 | 9 |
| 68) | 1905 | ఏప్రిల్ & మే | 12 | 10 & 11 |
| 69) | 1905 | జూన్ | 12 | 12 |
| 70) | 1906 | మార్చి | 13 | 3 |
| 71) | 1906 | జూన్ | 13 | 6 |
| 72) | 1906 | జూలై | 23 | 7 |
| 73) | 1906 | ఆగష్టు | 13 | 8 |
| 74) | 1906 | సెప్టెంబరు | 13 | |
| 75) | 1906 | డిశంబరు | 13 | 12 |
| 76) | 1907 | జనవరి | 14 | 1 |
| 77) | 1907 | ఫిబ్రవరి | 13 | 2 |
| 78) | 1907 | మార్చి | 14 | 3 |
| 79) | 1907 | ఏప్రిల్ & మే | 14 | 4 & 5 |
| 80) | 1907 | జూన్ | 14 | 6 |

పత్రికా ప్రతుల పట్టికా

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|

ఆంధ్ర లక్ష్మి :-

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1922 | మే | 1 | 6 |
| 2) | 1922 | నవంబరు | 1 | 12 |
| 3) | 1922 | డిశంబరు | 2 | 1 |
| 4) | 1923 | జనవరి | 2 | 2 |
| 5) | 1923 | ఫిబ్రవరి | 2 | 3 |
| 6) | 1923 | ఏప్రిల్ & మే | 2 | 4 & 5 |
| 7) | 1923 | జూలై | 2 | 7 |
| 8) | 1923 | ఆగష్టు | 2 | 8 |
| 9) | 1924 | జనవరి & మార్చి | 3 | 2, 3 |

హిందూ సుందరి :-

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1902 | ఏప్రిల్ | 1 | 1 |
| 2) | 1902 | మే | 1 | 2 |
| 3) | 1902 | జూన్ | 1 | 3 |
| 4) | 1902 | జూలై | 1 | 4 |
| 5) | 1902 | ఆగష్టు | 1 | 5 |
| 6) | 1902 | సెప్టెంబరు | 1 | 6 |
| 7) | 1902 | అక్టోబరు | 1 | 7 |
| 8) | 1902 | నవంబరు | 1 | 8 |
| 9) | 1902 | డిశంబరు | 1 | 9 |
| 10) | 1903 | జనవరి | 1 | 10 |
| 11) | 1903 | ఫిబ్రవరి | 1 | 11 |
| 12) | 1903 | మార్చి | 1 | 12 |
| 13) | 1903 | ఏప్రిల్ | 2 | 1 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 14) | 1903 | మే | 2 | 2 |
| 15) | 1903 | జూన్ | 2 | 3 |
| 16) | 1903 | జూలై | 2 | 4 |
| 17) | 1903 | ఆగష్టు | 2 | 5 |
| 18) | 1903 | సెప్టెం. & అక్టో. | 2 | 6 & 7 |
| 19) | 1903 | నవంబరు | 2 | 8 |
| 20) | 1903 | డిశంబరు | 2 | 9 |
| 21) | 1904 | జనవరి | 2 | 10 |
| 22) | 1904 | ఫిబ్రవరి | 2 | 11 |
| 23) | 1904 | మార్చి | 2 | 12 |
| 24) | 1904 | ఏప్రిల్ | 3 | 1 |
| 25) | 1904 | మే | 3 | 2 |
| 26) | 1904 | జూన్ | 3 | 3 |
| 27) | 1904 | జూలై | 3 | 4 |
| 28) | 1904 | ఆగష్టు | 3 | 5 |
| 29) | 1904 | సెప్టెంబరు | 3 | 6 |
| 30) | 1904 | అక్టో. & నవం. | 3 | 7 & 8 |
| 31) | 1905 | ఫిబ్ర. & మార్చి | 3 | 11 & 12 |
| 32) | 1905 | ఏప్రిల్ | 4 | 1 |
| 33) | 1905 | మే | 4 | 2 |
| 34) | 1905 | జూన్ | 4 | 3 |
| 35) | 1905 | ఆగష్టు & సెప్టెం. | 4 | 5 & 6 |
| 36) | 1905 | అక్టో. & నవం. | 4 | 7 & 8 |
| 37) | 1905 + 1906 | డిశం. + జనవరి | 4 | 9 & 10 |
| 38) | 1906 | సెప్టెంబరు | 5 | 1 |
| 39) | 1906 | అక్టోబరు | 5 | 2 |
| 40) | 1906 | నవంబరు | 5 | 3 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 41) | 1906 | డిశంబరు | 5 | 4 |
| 42) | 1907 | జనవరి | 5 | 5 |
| 43) | 1907 | ఫిబ్ర. & మార్చి | 5 | 6 & 7 |
| 44) | 1907 | ఏప్రిల్ & మే | 5 | 8 & 9 |
| 45) | 1907 | జూన్ | 5 | 10 |
| 46) | 1907 | జూలై | 5 | 11 |
| 47) | 1907 | ఆగష్టు | 5 | 12 |
| 48) | 1910 | జూన్ | 8 | 4 |
| 49) | 1910 | జూలై | 8 | 2 |
| 50) | 1910 | ఆగష్టు | 8 | 3 |
| 51) | 1910 | సెప్టెంబరు | 8 | 4 |
| 52) | 1910 | అక్టోబరు | 8 | 5 |
| 53) | 1910 | నవంబరు | 8 | 6 |
| 54) | 1910 | డిశంబరు | 8 | 7 |
| 55) | 1911 | జనవరి | 8 | 8 |
| 56) | 1911 | ఫిబ్రవరి | 8 | 9 |
| 57) | 1911 | మార్చి | 8 | 10 |
| 58) | 1911 | ఏప్రిల్ | 8 | 11 |
| 59) | 1911 | మే | 8 | 12 |
| 60) | 1911 | జూన్ | 9 | 1 |
| 61) | 1911 | జూలై | 9 | 2 |
| 62) | 1911 | ఆగస్టు | 9 | 3 |
| 63) | 1911 | సెప్టెంబరు | 9 | 4 |
| 64) | 1911 | అక్టోబరు & నవం. | 9 | 5&6 |
| 65) | 1911 | డిశంబరు | 9 | 7 |
| 66) | 1912 | జనవరి | 9 | 8 |
| 67) | 1912 | ఫిబ్రవరి | 9 | 9 |

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 68) | 1912 | మార్చి | 9 | 10 |
| 69) | 1912 | ఏప్రిల్ | 9 | 11 |
| 70) | 1912 | మే | 9 | 11 |
| 71) | 1912 | జూన్ | 10 | 1 |
| 72) | 1912 | జూలై | 10 | 2 |
| 73) | 1912 | ఆగస్టు | 10 | 3 |
| 74) | 1912 | సెప్టెంబర్ | 10 | 4 |
| 75) | 1912 | అక్టోబరు | 10 | 5 |
| 76) | 1912 | నవంబరు | 10 | 6 |
| 77) | 1912 | డిశంబరు | 10 | 7 |
| 78) | 1913 | జన. & ఫిబ. | 10 | 8 & 9 |
| 79) | 1913 | మార్చి | 10 | 10 |
| 80) | 1913 | జూన్ | 11 | 1 |
| 81) | 1913 | జూలై | 11 | 2 |
| 82) | 1913 | ఆగస్టు | 11 | 3 |
| 83) | 1913 | సెప్టెంబరు | 11 | 4 |
| 84) | 1913 | అక్టోబరు | 11 | 5 |
| 85) | 1913 | నవంబరు | 11 | 6 |
| 86) | 1913 | డిశంబరు | 11 | 7 |
| 87) | 1914 | జనవరి | 11 | 8 |
| 88) | 1914 | ఫిబ్రవరి | 11 | 9 |
| 89) | 1914 | మార్చి | 11 | 10 |
| 90) | 1914 | ఏప్రిల్ | 11 | 11 |
| 91) | 1914 | మే | 11 | 12 |
| 92) | 1914 | జూన్ | 12 | 1 |
| 13) | 1914 | జూలై | 12 | 2 |

| | సంవత్సరము | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 94) | 1914 | ఆగస్టు | 12 | 3 |
| 95) | 1914 | సెప్టెంబరు | 12 | 4 |
| 96) | 1914 | అక్టోబరు | 12 | 5 |
| 97) | 1914 | నవంబరు | 12 | 6 |
| 98) | 1915 | జనవరి | 12 | 8 |
| 99) | 1915 | ఫిబ్రవరి | 12 | 9 |
| 100) | 1915 | మార్చి | 12 | 10 |
| 101) | 1915 | ఏప్రిల్ | 12 | 11 |
| 102) | 1915 | మే | 12 | 12 |
| 103) | 1915 | జూన్ | 13 | 1 |
| 104) | 1915 | జూలై | 13 | 2 |
| 105) | 1915 | ఆగస్టు | 13 | 3 |
| 106) | 1915 | సెప్టెంబరు | 13 | 4 |
| 107) | 1915 | అక్టోబరు | 13 | 5 |
| 108) | 1915 | నవంబరు | 13 | 6 |
| 109) | 1915 | డిశంబరు | 13 | 7 |
| 110) | 1916 | ఫిబ్రవరి | 13 | 9 |
| 111) | 1916 | మార్చి | 13 | 10 |
| 112) | 1916 | ఏప్రిల్ | 13 | 11 |
| 113) | 1917 | జూన్ | 15 | 1 |
| 114) | 1917 | జూలై | 15 | 2 |
| 115) | 1917 | ఆగస్టు | 15 | 3 |
| 116) | 1917 | సెప్టెంబరు | 15 | 4 |
| 117) | 1917 | సెప్టెంబరు | 15 | 5 |
| 118) | 1917 | నవంబరు | 15 | 6 |
| 119) | 1917 | డిశంబరు | 15 | 7 |
| 120) | 1918 | ఫిబ్రవరి | 15 | 9 |
| 121) | 1918 | మార్చి | 15 | 10 |

| | | | | |
|---|---|---|---|---|
| 122) | 1918 | ఏప్రిల్ | 15 | 11 |
| 123) | 1918 | మే | 15 | 12 |
| 124) | 1942 | సెప్టెంబరు | 37 | 10 |
| 125) | 1942 | నవంబరు | 37 | 11 |
| 126) | 1943 | మే | 38 | 5 |
| 127) | 1943 | జూన్ | 38 | 6 |
| 128) | 1943 | జూలై | 38 | 7 |
| 129) | 1943 | ఆగస్టు | 38 | 8 |
| 130) | 1943 | సెప్టెంబరు | 38 | 9 |
| 131) | 1943 | అక్టోబరు | 38 | 10 |
| 132) | 1943 | నవంబరు | 38 | 11 |
| 133) | 1943 | డిశంబరు | 38 | 12 |
| 134) | 1944 | ఫిబ్రవరి | 39 | 2 |
| 135) | 1944 | మార్చి | 39 | 3&4 |
| 136) | 1944 | మే | 39 | 5 |
| 137 | 1944 | జూన్ | 39 | 6 |
| 138) | 1644 | జూలై | 39 | 7 |
| 139) | 1944 | ఆగస్టు | 39 | 8 |
| 140) | 1944 | సెప్టెంబరు | 39 | 9 |
| 141) | 1944 | నవంబరు | 39 | 11 |

శ్రీ బాలిక

| | సంవత్సరము | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1896 | ఆగస్టు | 1 | 6 |
| 2) | 1897 | మే | 2 | 3 |

వివేకవతి

| | సంవత్సరము | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1909 | నవంబరు | 1 | 2 |

సావిత్రి

| | | | | |
|---|---|---|---|---|
| 1) | 1904 | జనవరి | 1 | 1 |
| 2) | 1904 | ఫిబ్రవరి | 1 | 2 |
| 3) | 1905 | నవంబరు&డిశంబరు | 2 | 11&12 |
| 4) | 1907 | ఫిబ్రవరి&మార్చి | 3 | 5&6 |
| 5) | 1911 | జూన్ | 4 | 12 |

అనసూయ

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1918 | సెప్టెంబరు | 1 | 3 |
| 2) | 1918 | నవంబరు | 2 | 5 |
| 3) | 1919 | సెప్టెంబరు&నవంబరు | 3 | 3&4 |
| 4) | 1919 | నవంబరు&డిశంబరు | 3 | 5&6 |
| 5) | 1920 | జనవరి | 3 | 7 |
| 6) | 1920 | ఫిబ్రవరి&మార్చి | 3 | 8&9 |

ఆంధ్రమహిళ

| | సంవత్సరం | నెల | సంపుటి | సంచిక |
|---|---|---|---|---|
| 1) | 1944 | మే | 1 | 1 |
| 2) | 1944 | జూన్ | 1 | 2 |
| 3) | 1944 | జూన్ | 1 | 3 |
| 4) | 1944 | జులై | 1 | 4 |
| 5) | 1944 | జులై | 1 | 5 |
| 6) | 1944 | ఆగస్టు | 1 | 6 |
| 7) | 1944 | ఆగస్టు | 1 | 7 |
| 8) | 1944 | సెప్టెంబరు | 1 | 8 |
| 9) | 1944 | సెప్టెంబరు | 1 | 9 |
| 10) | 1944 | అక్టోబరు | 1 | 10&11 |
| 11) | 1944 | నవంబరు | 1 | 12 |

| | | | | |
|---|---|---|---|---|
| 12) | 1944 | నవంబరు | 1 | 13 |
| 13 | 1944 | డిశంబరు | 1 | 14 |
| 14) | 1944 | ,, | 1 | 15 |
| 15) | 1945 | జనవరి | 1 | 16 |
| 16) | 1945 | ,, | 1 | 17&18 |
| 17) | 1945 | ఫిబ్రవరి | 1 | 19 |
| 18) | 1945 | మార్చి | 1 | 20 |
| 19) | 1945 | ,, | 1 | 21 |
| 20) | 1945 | ఏప్రిల్ | 1 | 22 |
| 21) | 1945 | ,, | 1 | 23 |
| 22) | 1945 | మే | 2 | 1 |
| 23) | 1945 | జూన్ | 2 | 3 |
| 24) | 1945 | జులై | 2 | 4 |
| 25) | 1945 | జులై | 2 | 5 |
| 26) | 1945 | సెప్టెంబరు | 2 | 6.7&8 |
| 27) | 1945 | ,, | 2 | 9 |
| 28) | 1945 | అక్టోబరు | 2 | 10 |
| 29) | 1945 | నవంబరు | 2 | 11&12 |
| 30) | 1945 | నవంబరు | 2 | 13 |

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. అచ్చమాంబ, భండారు : అబలా సచ్చరిత రత్నమాల
ప్రథమ సంపుటము, మూడవ కూర్పు
౧౯౧౩, హెచ్.వి. కృష్ణ & కో.,
చింత్రాదిపేట, మద్రాసు.

2. అప్పారావు, గురజాడ : కన్యాశుల్కము
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్
8వ ముద్రణ. 1983 (1897)

3. ఆనందలక్ష్మి, సి : తెలుగు నవలలో కుటుంబ జీవన చిత్రణము
నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్
విజయవాడ 1979

4. ఇనాక్, కొలకలూరి : తెలుగు వ్యాస పరిణామం
జ్యోతి గ్రంథమాల, 1 9 టి. నగర్
అనంతపురం. 1960

5. కామేశ్వరరావు, ఏడిద : అరుణ అసపాలీ
దేశి ప్రచురణలు, దేశికవితామండి,
విజయవాడ, ఏప్రిల్ 1946

6, చలం : ఆత్మకథ
అరుణా పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్,
విజయవాడ, సెప్టెంబరు 1986

7. నాగభూషణశర్మ మొదలి : చిలకమర్తి లక్ష్మీనరసింహము
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ
ప్రచురణ, అకాడమీ ప్రచురణ నెం. 11
ఫిబ్రవరి 1973

8. నారాయణమూర్తి ధబ్బీరు : బాలికా నీతి
మాదేటి సన్యాసయ్యచే ప్రకటితము, 1911

9. ప్రభాకరరావు దేవులపల్లి : మహాకవి గురజాడ
జీవిత విశేషాలు - సాహిత్య సమీక్ష
విశాలాంధ్ర ప్రచురణ, 1969

10. బంగోరే (సంకలనం) : బ్రౌన్ జాబులు, తెలుగు జర్నలిజం చరిత్ర
1832 నుంచి 1857 దాక
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ & హైదరాబాద్, 1973

11. ముద్దు నరసింహం స్వామినేని : హిత సూచని
ఆంధ్రకేసరి యువజన సమితి,
రాజమండ్రి—4, 986

12. రమాపతిరావు అక్కిరాజు : కోలవెన్ను వారి జీవితానుభవాలు
సాహితీ ప్రింటర్స్ -4 663/25,
నారాయణగూడ, హైదరాబాద్-29

13. రమాపతిరావు అక్కిరాజు : వీరేశలింగం పంతులు సమగ్ర పరిశీలన
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సికింద్రాబాద్ 1972

14. రమాపతిరావు అక్కిరాజు (అనువాదకుడు) : వెన్నెలకంటి సుబ్బారావు జీవితయాత్ర
చరిత్ర The life oi Vennelacanti
Soobrow 1873
శ్రీభారతి ప్రచురణలు, సికింద్రాబాద్ 1976

15. రమాపతిరావు అక్కిరాజు : కొమర్రాజు వేంకట లక్ష్మణరావు
(జీవిత చరిత్ర)
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజయవాడ. 1978

16 రమాపతిరావు అక్కిరాజు [సం] : వీరేశలింగం రచనలు
మొదటి సంపుటము, స్వీయ చరిత్రము
ప్రథమ భాగము

17. రమాపతిరావు అక్కిరాజు [సం] : వీరేశలింగం రచనలు రెండవ సంపుటము, స్వీయ చరిత్రము రెండవ భాగము. విశాలాంధ్ర పబ్లికేషన్స్ 1984.

18. రమాపతిరావు అక్కిరాజు [సం] : వీరేశలింగం రచనలు మూడవ సంపుటము, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1985

19. రమాపతిరావు అక్కిరాజు [సం] : వీరేశలింగం రచనలు నాలుగవ సంపుటము, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1986

20. రమాపతిరావు : వీరేశలింగం రచనలు ఐదవ సంపుటం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1986

21. రాజేశ్వరరావు పి (అనువాదకుడు) : టి: ప్రకాశం ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్ సికింద్రాబాద్, 1972.

22. రామకృష్ణ, వి : ఆంధ్రలో సంఘ సంస్కరణోద్యమాలు, రాచమల్లు రామచంద్రరెడ్డి (అనువాదము) హైదరాబాద్ బుక్ ట్రస్ట్,

23. రామానుజరావు దేవులపల్లి : తెలగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము సాహితీప్రింటర్స్, హైదరాబాద్, ఐదవకూర్పు 1972 1962)

24; లచ్చారావు, చెలికాని : శ్రీ నీతి పద్య రత్నావళి, ప్రథమ భాగము, శ్రీ రామావిలాస గ్రంధముల నెం-1, చిత్రాడ. పిఠాపురము 1915

25. లక్ష్మణరెడ్డి వి : తెలుగు జర్నలిజం (అవతరణ వికాసం] గోపీచంద్ పబ్లికేషన్స్, సూర్యారావుపేట, విజయవాడ—1985

26. లక్ష్మీరంజనం, ఖండవల్లి: ఆంధ్రుల చరిత్ర_సంస్కృతి,
బాలేందు శేఖరం, ఖండవల్లి బాలసరస్వతి బుక్ డిపో కర్నూలు. 1960

27. లక్ష్మీ నరసింహం, చిలకమర్తి : స్వీయచరిత్ర
ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం (సంపాదకులు)
ప్రజాశక్తి కార్యాలయం విజయవాడ,
ప్రచురణ నెం. 94

28. వరలక్ష్మి, జె : యుగయుగాల్లో భారతీయ మంగళ,
ప్రియదర్శిని ప్రచురణ. ఐ.డి.పి.యల్ కాలనీ, హైదరాబాద్-1977

29. వీరభద్రరావు కొత్తపల్లి తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము
కొత్తపల్లి వీరభద్రరావు (ప్రచురణకర్త)
179 వెస్ట్ మారేడ్‌పల్లి నగర్, సికింద్రాబాద్
ద్వితీయ ముద్రణ, 1986, (1960)

30. వేరేశలింగం పంతులు కందుకూరి : దాసములు
హితకారిణీ సమాజము, రాజమండ్రి

31. — వేశ్యకాంతల యుపన్యాసము,
హితకారిణీ సమాజము, రాజమండ్రి

32. — స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము
హితకారిణీ సమాజము, రాజమండ్రి

33. — నీతి దీపిక
హితకారిణీ సమాజం రాజమండ్రి

34. — అతిబాల్య వివాహము
హితకారిణీ సమాజం, రాజమండ్రి

35. — స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయ విజ్ఞాపనము,
హితకారిణీ సమాజము, రాజమండ్రి

36. — కృతగ్రంధములు,
ఎనిమిదవ సంపుటము ఉపన్యాసములు,
జీవిత చరిత్రములు, ఆనంద ముద్రాక్షరశాల
యందు ముద్రింపబడినది. చెన్నపురి 19: 8

37. — కృతగ్రంధములు,
ఆరవ సంపుటము స్త్రీ్రలకుపయోగించు
పుస్తకములు, మనోరమా ముద్రక్షరశాల
యందు ముద్రింపబడినది, రాజమండ్రి 1916

38. — వేశ్యా పియ ప్రహసనము
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము, 1950

39. — ఆసహాయ శూర ప్రహసనము
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము. మూడవకూర్పు 1950

40. — : కలహప్రియ ప్రహసనము
హితకారిణీ సమాజము రాజమహేంద్ర
వరము, 1950

41. — : తిర్యగ్విద్వన్మహాసభ మూషకాసురవిజయము
హితకారిణీ సమాజము రాజమహేంద్ర
వరము, 1950

42. — : మహాబధిర ప్రహసనము,
హితకారిణీ సమాజము రాజమహేంద్రవరము
1950

43. — : మహావంచక ప్రహసనము
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము, 1950,

44. — : విచిత్ర వివాహ ప్రహసనము,
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము, 1950

45. — : సతీహిత బోధిని,
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము 1950

46. — : స్త్రీ నీతి దీపిక
హితకారిణీ సమాజము రాజమహేంద్ర
వరము 1950

47. — : వ్యవహార ధర్మబోధిని
హితకారిణీ సమాజము, రాజమహేంద్ర
వరము, 1950

48. — : ఉపన్యాస మంజరి,
హితకారిణీ సమాజము, రాజమహెంద్ర
వరము. 1951

49. — : చంద్రమతీ చరిత్రము.
హితకారిణీ సమాజము, రాజమండ్రి,
పదనొకండవ కూర్పు, 1953

50. వెంకటరామా రావు, జి : ఆంధ్ర దేశ చరిత్ర ఆధునిక యుగం
ఇం.నెం. 17-7-729/2, అవుట్ సైడ్
గౌలీపూర్, హైదరాబాద్-500253, 1982

51. వెంకటప్పయ్యవంతులు కొండా : స్వీయచరిత్ర
దక్షిణ భారత హిందీ ప్రచారసభ (ఆంధ్ర)
హైదరాబాద్-4 ద్వితీయవారం, 1966

52. వెంకటరంగయ్య మామిడిపూడి : మారుతున్న సమాజం నాజ్ఞాపకాలు
తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం
ప్రథమ ముద్రణ, 1981

53. వెంకటశర్మ మంగిపూడి : బాలవితంతువు విలాపము
కర్రా అచ్చయ్య సన్సు వారిచే ప్రకటింప
బడియె బుక్కు సెల్లర్సు, రాజమండ్రి-1922

| | | |
|---|---|---|
| 54. | వెంకటశివుడు రాయసము | : ఆత్మ చరిత్రము ఆంధ్రపత్రిక ముద్రాలయము మద్రాసు 1933 |
| 55. | వెంకట సత్యనారాయణ రావు. రావూరి (పరిష్కర్త) | ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ హైదరాబాద్, ప్రథమ ముద్రణ, 1979 |
| 56 | వెంకటసీతమ్మ ఆట్లూరి | : అన్నపూర్ణాదేవి జీవితము శ్రీ అన్నపూర్ణదేవి గ్రంథమాల ప్రచురణ, 1929 |
| 57 | వెంకటసుబ్బయ్య,డి | : సంఘసంస్కర్త ఉన్నవ దేశబుక్ డిస్ట్రిబ్యూటర్స్, దేశీబుక్ హౌస్, విజయవాడ, హైదరాబాద్-29 రెండవముద్రణ, 1976 (1975) |
| 58. | వెంకటసుబ్బయ్య గొర్రెపాటి | : నవమేధావి నార్ల దేశబుక్ డిస్ట్రిబ్యూటర్స్, దేశీబుక్ హౌస్, విజయవాడ, హైదరాబాద్ 29, రెండవ ముద్రణ, 1976 (1975) |
| 59. | వెంకటేశ్వరరావు, నార్ల | మూడు దశాబ్దాలు ఎన్నిక చేసినసంపాద కీయాల సంకలనం 1944-1974) నవో దయ పబ్లిషర్స్, విజయవాడ 2,1976 |
| 60. | వోల్గా | : స్త్రీల సమస్యలు-పరిచయం హైదరాబాద్ బుక్ ట్రస్టు, 1984 |
| 61. | శివారెడ్డి, ఎల్లూరి | : నరవరము ప్రతాపరెడ్డి జీవితము సాహిత్యము ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్ 500037, 1973 |
| 62. | సత్యనారాయణ కంభంపాటి | : ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి-2 మహీధర రామమోహనరావు సంక్షిప్తాను వాదం, హైదరాబాద్ బుక్ట్రస్టు, |

హైదరాబాద్_500029, రెండవ ముద్రణ 1?86 (1982)

63. సీతారామ చయనులు మిత్రిపాటి : నిరతాన్నదాత్రి డొక్కా_సీతమ్మగారి జీవిత చరిత్ర
లంకలగన్నవరము అంబాజీపేట పోస్టు
తూ,గో జిల్లా

64. సీతాదేవి, నేతి : దుర్గాబాయి దేశ్‌ముఖ్
ఆంధ్రమహిళా సభ ప్రచురణ 1977

65. సుబ్బమ్మ మల్లాది : ఆంధ్రమహిళోద్యం మహిళా సంఘాలు
(1860-1983

66. సూరి జియ్యరు : ప్రజాస్వామ్య ప్రచురణలు, 1985
స్త్రీ కళాకల్లోలిని 1876

67. సాంబశివరావు, పోతుకూచి : నా జీవితంలో ప్రయత్నాలు - ప్రయోగాలు
(ఆత్మకథ)
పోతుకూచి ఏజన్సీస్, 208 న్యూబోయిగూడ
సికింద్రాబాద్-3 1980

68. సుబ్రహ్మణ్యశర్మ పురాణం : తెలుగు వెలుగు చలం
(మొదటిభాగం) న్యూస్టూడెంట్స్ బుక్
సెంటర్, ఏలూరురోడ్, విజయవాడ,1983

69. సూర్యనారాయణ కోటిపల్లి : శ్రీ అయ్యదేవర కాళేస్వరరావుగారి జీవిత చరిత్ర
సవోదయ పబ్లిషర్స్, విజయవాడ

# ఆకర గ్రంథాలు


1. Mangamma, J. : Book Printing in India, Bangorey Books, Nellore-1975

2. Raj, V.P : Dr. Sir R. Venkataratnam Part I - His Life Madras, 11th October, 1929

3. — : Dr. Sri R. Venkataratnam Part II - His teachings. Madras, Ist October, 1930

4. Ramakrishna, V : Social Reform in Andhra (1848-1919) Vikas Publishing House Private Limited, New Delhi, 1983

5. Seshagiri Rao (ed) : Studics in the History of Telugu Journalisom Andhra Pradesh Book Distributors, Rashtrnpati Road, Securderabad-1968

6. Shastri Shakuntala Rao : Women in the Vedic Age Bharatiya Vidya Bhavan. Chonpatty, Bombay, Second edition, 1954 (1952)

# వ్యాసాలు


1. వెంకట రంగయ్య మామిడిపూడి (అధ్యక్షుడు, సంపాదకీయ [వర్గం]) : "పత్రికల ఆర్థిక సమస్యలు" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము 5వ సంపుటము సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి, హైదరాబాద్ 1966

2. — "పత్రికా రచనము" [భారతీయము విదేశీయము] సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము 5వ సంపుటము

3. — "పత్రికా రచనము" తెనుగున సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, 5వ సం॥

4. — "పత్రికా ముద్రణము" సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, 5వ సం॥

5. రావు, కె.యల్. [ముఖ్య సంపాదకుడు] : "ముద్రణాభివృద్ధి" విజ్ఞాన సర్వస్వము పన్నెండవ సంపుటము తెలుగు భాషా సమితి ప్రచురణ 1970

6. బ్రహ్మయ్యశాస్త్రి కాశీభట్ల : "పురాతనాంధ్రవార్తాపత్రికలు' ఆంధ్రపత్రిక పదునొకండవ సంవత్సరాది సంచిక మే 1920.

7. విశ్వనాధ చయనులు, క : "సంఘము - భార్యాభర్తలు" శారదాపత్రిక సంపుట 1, సంచిక 2, ఏప్రిల్ 1924.

8. Murali, Atlury : Perspectives on women's Liberation : Andhra in the Nineteenth and Early Twenth Centuries Studies in History Vol. III, Jan-June 1986.

# అనుద్రిత సిద్ధాంత వ్యాసాలు

సుమిత్రాదేవి, గూడ : గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతలైన కవయిత్రులు వారి కావ్యాలు
ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పి. హెచ్.డి పట్టానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం

2) రామమూర్తి కలువగుంట ; తెలుగులో మహిళా పత్రికలు మహిళాభ్యుదయం
వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి యం.ఫిల్ పట్టాకి సమర్పించిన పరిశోధన వ్యాసం
1984

3) కృష్ణారావు, వాసిరెడ్డి ; మహిళాభ్యుదయోద్యమ వాఙ్మయ పరిచయం
కాకతీయ విశ్వవిద్యాలయానికి యం.ఫిల్ డిగ్రీకి సమర్పించిన పరిశోధన వ్యాసం
1986